


294.5922
వీరాం.. ఎమె
71,170

# ఎమెస్కో వచన రామాయణం

శతావధాని కోట వీరాంజనేయ శర్మ

Cat-2925

# ఎమెస్కో వచన రామాయణం
## (పదకొండవ సంపుటం)

రచన :

శతావధాని కోట వీరాంజనేయ శర్మ



1 9 9

యం. శేషాచలం అండ్ కంపెనీ
మచిలీపట్నం-సికింద్రాబాదు

EMESCO VACHANA RAMAYANAM - Vol. 11

*as retold by* :

SATAVADHANI KOTA VEERANJANEYA SARMA

*first edition* :

NOVEMBER 1981

12-2-33

Cat-I

*publishers* :

M. SESHACHALAM & Co.,

Machilipatnam, Secunderabad.

*cover design* :

B A P U

*printers* :

MADHU PRINTERS,

Secunderabad.

Price : Rs 5-00

71170

71170

503 044.

*distributors* :

M/s. ANDHRA PRADESH BOOK DISTRIBUTORS,

3237, Rashtrapathi Road, Secunderabad - 500 003.



1 9 9

# ద్వాదశాదిత్య మండలంవలె ప్రకాశించే

# 13 సంపుటాల ఎమెస్కో వచన రామాయణ ప్రాశస్త్యం.

ఏనాడు వాల్మీకి మహర్షి అపార తపశ్శక్తితో వేదాన్ని రామాయణాత్మకంగా ఆవిష్కరించాడో ఆ నాటినుండి అవిచ్ఛిన్నంగా శాఖోపశాఖలతో బహు నామాలతో ఆ కల్పవృక్షం భారతాన్ని పుణ్యభూమిగా, కర్మభూమిగా చేసి దిగ్దిగంతాలకు ప్రాకింది. ఇంకా ప్రాకుతుంది. అందుకే ఒక కవి "రాఘవేశ్వర చారిత్రము నెందరెన్ని గతులన్ వర్ణించినన్ క్రొత్తదే" అని అన్నాడు. మేం కూడా ఆ పవిత్ర భావంతోనే ఈ మహాకార్యానికి పూనుకున్నాం. ఈ నూత్న ప్రయత్నంలో ఒక విలక్షణమైన మార్గం త్రొక్కడం జరిగింది. వేదానికి వేదం ప్రమాణంలాగా వాల్మీకి రామాయణానికి వాల్మీకియే ప్రమాణంగా అనువాదంలోనే అపవాదులు పరాస్తం చేయబడినై. యథాతథంగా అనువదించినా స్వతంత్ర కావ్యంవలే చదువరులకు ఆనందం కలిగిస్తుంది. ఎన్నో గ్రంథ గ్రంథులున్నై. ఎన్నో పూర్వాపర విరుద్ధాలున్నట్లు పైకి కనుపిస్తాయి. వచ్చిన కథలే వస్తై. ఒకచోట శంకకు ఎక్కడో పరిహారం వుంటుంది. ఈ చిక్కులన్నీ ఇందులో విడదీయబడినై. తైలధారవలె అవ్యాహతంగా రచనా స్రోతస్సు ప్రవహిస్తుండే చవిటినేలలు, కేదారఖండాలు, నల్లని, ఎర్రని, రేగడ భూములు విస్తార నిరుపయోగ ప్రదేశాలు సస్యశ్యామలంగా మారి ఫలానుభవంతో ఇహపర సుఖాలు తమంతతామే కోరి వరించి వస్తై. ఈ రచనా విన్యాసం సరికొత్త. పండిత పామరభేదం లేకుండా స్త్రీ శిశు విచక్షణ లేకుండా అందరికీ రామాయణ కల్పవృక్ష ఫలాలను అందిస్తుంది. ఏ అనుమానం వచ్చినా ఈ రామాయణం ఆ ఘట్టంలో చూసుకుంటే తెలుస్తుంది. ఇంతకు పూర్వం తెలియని ఎన్నో రహస్యాలు వెలికి తీయబడినై. ఉదాహరణకు దశరథుడు ముగ్గురు భార్యలకు పాయసం నాల్గుభాగాలెందుకు చేశాడు? వాలి వధ ఎందుకు ధర్మబద్ధమైంది? తార పతివ్రతగా ఎందుకు ఆరాధ్య అయింది? సీతా పరిత్యాగంలో రాముడు అన్యాయం చేశాడా? ఇంకా ఎన్నో ఎన్నో - ఈ బృహత్కార్యం ఎందుకు సంకల్పించామో చదివి చదువరులు సాక్షులు కండి.

—:o:—

స్వామి! భవత్కృపన్ బదవ సంపుటమున్ రచియించి భక్తితో
భూమి భవాత్మదేవు పదపూజ యొనర్చితి సూనమట్లుగన్
గామితదాత! యీ పదునొకండవ సంపుటమున్ మృదూక్తులన్
బామరపండితాళి భవబంధహరంబుగ వ్రాయఁబూనుమా.

# మకరాక్షుడు రాముని తూలనాడుట

ప్రళయగర్జలతో, ప్రచండ మారణ సాధనాలతో గట్లొరసి పారే నదివలె వస్తున్న రాక్షస సైన్యాన్ని మర్కట సైన్యంచూచి వృక్షశైల శిలాయుధ దాల్చి వ్యూహం పన్ని ప్రతి గర్జనలు చేస్తూ ముందుకు సాగింది. రక్కసులు రణరంగంలో కాలుమోపటం కపులు ఎదురునడిచి పోటీయ్యటం, ప్రతిఘటించి నిశాటులు ధాటితో విజృంభించటం జరిగి పోరుదారుణంగాసాగింది. అంతకంతకు తుఫానువలె అధిక వేగంతో పరస్పర హనన విజయాకాంక్షులై ఉభయులూ తెగించి సమరంసాగించారు. అమరులు అద్భుతరోమహర్షణులై ఆకాశంనుంచి చూస్తున్నారు. పరిఘాయుధహలనిహంతలు, ఉర్వీధర వృక్ష మారకులు, నిష్ఠురముష్టికలంబతాడితులు, వివిధగదాసికుంతశరవృక్షశిలాభిన్న శరీరులై భటులు సమరం చేస్తుంటె రక్కసులు క్రమంగా క్రుక్కి వెనుకంజ వేస్తున్నారు. మకరాక్షుడు తిలకించాడు. మౌర్వీధ్వనించాడు. శరవర్షం సారించాడు. వాతాహతికి మేఘం విచ్చినట్లు వానరవ్యూహం విచ్చింది. రక్షణ స్థానానికి పారిపోతుంటే రక్ష సైన్యం వెన్నంటి తరుముకుని వస్తూంది. భీతితో కపిసైన్యం రామచంద్రుని దిశగా మరలింది. రాముడు చూచాడు. భక్తావన ప్రశస్తమైన హస్తం ఎత్తి వానరుల వారించి నిలువరించాడు. పొంగే వారాశికి చెలియలికట్టవలె, విజయగర్వంతో వెన్నంటి వస్తున్న రాక్షసుల దుర్జయపర సంఘ భీతికర శాతమహాశుగ తీవ్ర వృష్టిచే అడుగుపడకుండా ఆపాడు. శరాగ్నికి శలభాలను చేశాడు. అగస్త్యుని అరచేయి సముద్రాన్ని నిర్జలం చేసినట్లు రాముడు తన సైన్యాన్ని సంపూర్ణంగా దహిస్తుంటే, మకరరాక్షుడు మంటలు క్రక్కుతూ, "రామా! నిలు నిలు. ఎందుకు నిక్కుతావు? అశక్తభటవర్గంపై అస్త్రాలు కురిపించి అధికుడ

నని నిరూపించుకో చూస్తున్నావా? నేనున్నాను. నీ సమర పాటవం చూడవచ్చాను. ద్వంద్వయుద్ధం చేద్దాం. ప్రాణాలపై తీపితో పారిపోవోకు. నేను లేని సమయంలో నాతండ్రి ఖరుణ్ణి దండకారణ్యంలో చంపావు. ఇప్పుడు పరాక్రమంతో నా ఎదుట భాసిస్తుంటే ఒడలు భగ్గున మండుతూంది. నాకిది అనుకూల కాలం. దైవం నా పట్ల ప్రసన్నుడుననే నిన్ను నా ముందుకు తోశాడు. క్షుధార్త సింహాన్ని మృగం సమీపించినట్లు ప్రతిక్రియా వాంఛా ప్రబలుడనైన నన్ను చేరవచ్చావు. తండ్రి ఋణం తీర్చుకునే సమయం ఆసన్నమైంది. నాచే నిహతుడవై కిష్కింధకుపోయి నీచే చచ్చిన నిశాచర వీరులతో చెలిమిచేసి క్రీడించు.

“ఓరామా! ఇన్ని మాటలెందుకు? లోకం నీవైపూ, నావైపూ చూస్తుంది. గదలావాలో, ఇతరాస్త్రశస్త్రాలు కావాలో, రిక్తహస్తాలతో మల్లయుద్ధం కావాలో చెప్పు. నీవు ఏది కోరితే దానితో నేను తలపడతాను. నిర్ణయం నీకే వదిలి తున్నాను. ఎందులో నీకు పాండిత్యం వుందో అందులోనే పోరాడుదాం” అని అన్నాడు. రాముడు మకరాక్షుని మాటలు విని మందహాసం చేశాడు. “నిశాచరాధమా! శూరమ్మన్యా! ఎందుకు వికత్థనాలు? వ్యర్థంగా ఎందుకు ప్రేలుతున్నావు! పోటరితనంలో కీర్తివస్తుందికాని మాటల బింకంలో వస్తుందా? నీ జాతికి శిరోమాణిక్యంగా చెప్పదగిన చతుర్దశ సహస్ర నిశాట సైన్యం నిమిష మాత్రంలో ఎవనిచేత హతమైందో, దూషణ త్రిశిరులతో కలిపి నీ తండ్రి ఖరుని ఎవడు యమసదనానికి బాణత్రయంతో పంపాడో వాడి ఎదుట మాటలు పనిచేయవనీ, పోటుతనం కావాలనీ తెలియకుండా వదరుతున్నా వెందుకు? నీవు నా సైన్యాన్ని చంపుతున్నా నీమీదికి రాలేదు. పదాతి సంకుల సమర కాలంలో నీ వాళ్ళను రక్షించే నిమిత్తం నీవే మూర్ఖుడవై నా వాళ్ళను భర్జించావు. అయినా నీ దురుద్యోగం సహించాను. నీ కనుకూలుడనుకున్న దైవం మృత్యు గహ్వరానికి తెచ్చిందని గుర్తించలేని నీవు రామునితో ఏం యుద్ధం చేస్తావు? మీ కులపతి నాతో పోరి ఓడి ఇంటికి చేరాడు. ఇంతవరకు మళ్ళీ రాలేదు. పాపం! అనవసరంగా మిమ్మల్ని ఆహవానికి అర్పిస్తున్నాడు. ఇవంతా నీకు తెలుసు. ప్రేవేవు కనుక గుర్తు చేశాను. నీవు రణవిద్యా సంపూర్ణుడవు. నాకు రథంలేదు. ఇతరాయుధాలూ లేవు. శరచాపాలుమాత్రం వున్నై. నీ కోరిక తీర్చాలంటే అవన్నీ తెప్పించుకోవాలె. కాలహరణానికి

కారణం అవుతుంది. వచ్చినవాళ్ళతోగలసి క్రీడించే అవకాశం నీకు మిక్కిలిగా కావటం నాకు సమ్మతంకాదు. ఎవడి శరీరం తీక్ష్ణతుండ నఖాంకుర గృధ్ర సృగాల మూకలు ముక్కుబండిగా భుజించుతవో పోరులో తేల్చుకుందాం. ఇక మాటలుమాని సర్వాయుధాలతో రథివై నీవూ, శరచాప మాత్రపదాతిగా నేనూ యుద్ధం చేద్దాం. తండ్రి ఋణం తీర్చే కొడుకవు. నీకే ముందవకాశం ఇస్తున్నాను. నేను ముందే దిగితే నీ ప్రతాపం చూపించే స్థితి నీకూ, చూచే స్థితి నాకూ వుండకపోవచ్చునని అనుకుంటున్నాను" అని చెపుతుండే రాక్షసుడు శరాసనం ఎక్కుపెట్టి శర వర్షం గురిశాడు. అతడు ప్రయోగించే అస్త్రాలను నిజకాండాలతో ఖండించి వేశాడు. మానవదానవ శ్రేష్ఠులు మాటలపోటులు మాని మార్గణాలతో మరణ దేవతను ఆహ్వానిస్తుండే వానర రాక్షసులు,దేవమౌని పన్నగ గంధర్వాదులు విభ్రమంతో విలోకిస్తున్నారు. పరస్పరం అస్త్ర సంహారంతో ఆగక ఉద్ధృతబలంతో, ఉడుగనిబలంతో, వీర్య శౌర్యధైర్యాలు మూర్తులు గొన్నట్లు, వజ్రద్వయం, సుదర్శనద్వయం, పాశద్వయం, పారావారద్వయం ఘర్షించినట్లు ఘర్షించుతుండే ఖండిత శరాలు గుట్టలుపడి పర్వతాలవలె పెరుగసాగినై. "ఇంతకాలం ఎదిరించి ఎవరూ పోలేదు. నీవు నిజంగా వీరుడే. ఇక నీవీ ఆటలు సాగనీయను. ఈ విధంగా ఎంత కాలమైనా పోరుతుండే ఏం ప్రయోజనం సాధించినట్లు?" అని రాముడు అనుకున్నాడు. అకర్ణాంతం మౌర్వీలాగి దానవుని ధనువు ఒక శరంతోనూ, శరత్రయంతో వాజులనూ, అష్ట శిలీముఖాలతో సారథినీ, మార్గణ దశకంతో రథాన్ని నిర్మూలనం చేశాడు. రథం నాశనంకాగానే ఫాలలోచనుడు శూలం దాల్చి వచ్చినట్లు కేలశూలం పట్టుకుని నేల దూకాడు. దూకిన వెంటనే మకరాక్షుడు శూలాన్ని భయంకరంగా త్రిప్పి రామునిపై విసిరాడు. రాక్షస కరనిర్ముక్త శూలానలాన్ని రామకోదండ నిర్గత ప్రచండకాండకాల భుజంగం కబళించింది. శూలాస్త్రాలు కొట్టుకుంటుండే మిణుగురులు చెదరి పరిసర ప్రాంతాన్ని భగ్గున మండించినై. చివరకు దాశరథి బాణం దానవునిశూలాన్ని పొడి పొడి చేసి కూల్చింది. విశ్వ భూతజాలం సత్య పరాక్రముడైన రాముని ధనుఃపాండితికి, సర్వలోక భీకర శూల హరణానికి "మేలు మేలు, భళి భళి" అంటూ నుతించింది. ఆ స్తోత్రనాదం దిక్కుల నిండింది. శూల రథాలు పోయినా మకరాక్షుడు ముష్టి బిగించి "రామా! నిలు. ఆగు" మని అరుస్తూ

పైకి వస్తుంటే, హాసవిజిత శశాంకుడు, ధరణిజా మనోజ్ఞ హృత్పద్మబంభరం పావకాస్త్రం గుణంలో కూర్చి, ప్రజ్వలింపచేసి నిశాచరునిపై ప్రయోగించాడు. ఆ చిమ్మిన అమ్ము దైత్యుని రొమ్ములోనాటి దుమ్ములు కనపడగా వెన్ను దూటి వెలికి వచ్చి యథాస్థానంలో అంతర్హితమైంది. క్షపాచరుడు క్షణ కాలంలో బింకాలు పలికినంత కాలంకూడా రాముని ఎదుట నిలువలేక యమ మందిర వాసానికి వేంచేశాడు. దుర్జయుడైన మకరాక్షుడు చావగానే, రామబాణ భీతీ, వానర ప్రతి హింసాశక్తీ కలవరపెట్టగా హతశేష సైన్యం లంకకు పారిపోయింది. మర్కట వీరుల్లో మళ్ళీ పర్వ దిన సాగరంలాగా ఉత్సాహం పొంగి పొర్లింది.

## ఇంద్రజిత్తు రెండవసారి యుద్ధానికి పోవుట

పారి వచ్చిన అసుర సేన మకరాక్షుని మరణ గాథ లంకేశ్వరునకు వినిపించి దుఃఖించింది. మకరాక్షుని చావు మాంసాశన ప్రభువునకు మతి సంక్షోభం కలిగించింది. పట పట పళ్ళు కొరుకుతూ, కుటిల చరిత్రుడైన కొడుకు రావణిని చూచి, "నాయనా! యుద్ధ గతి మారింది. లోకైక వీరుల, రాక్షస వంశ రత్నాల, రామ లక్ష్మణ శర కుండంలో హుతంచేశాను. ఫలితం సర్వ నాశనం. ఇందులో నీవు గాక రణానికిపోయి విజయంతో లంక చేరినవాడు లేడు. నీవు సర్వశక్తిమంతుడవు. రెండుసార్లు శత్రువుల నిర్జించావు. నా దురదృష్టం వాళ్ళను మళ్ళీ మేరుధీరుల చేసింది. ఈ సారి వాళ్ళ మరణం పూర్తిగా చూడకుండా మరలిరావద్దు. యుద్ధంలో ఎప్పటికేది యుక్తమో అది నీకు తెలిసినట్లు మాకెవ్వరికీ తెలియదు. ప్రచ్ఛన్న యుద్ధంతప్ప ప్రత్యక్ష యుద్ధం నిరుపయోగమని తేలింది. శత్రువుల కంటబడితే బ్రదకనీయరు. సమీపించకుండా సమరం చేయి. దేవతలను జయించిన నీకు మానవ వానరులొక లెక్కా? సురలోకపతినే నిర్జించిన నీకు నరలోకపతులు ఎంతవారు? నీ మాయామహిమకు ధాతకూడా దాసోహం అనక తప్పడు. ఇంతవరకు రెండుసార్లు వెళ్ళి నీవే విజయివై వచ్చావు. నీవు తప్ప శత్రువుల జయించే వీరుడు లంకలోనే కాదు మన జాతిలోనే మిగులలేడు. నా పరువు ప్రతిష్ఠలు నీవే కాపాడాలి" అంటూ కళ్ళనీళ్ళు పెట్టుకున్నాడు. ఇంద్రజిత్తు గుండె తండ్రి కన్నీళ్ళతో

జరిగింది. రామ లక్ష్మణ వధయే తనధ్యేయంగా భావించాడు. అగ్నిహోత్రుని ఆవాహనం చేసి అర్చించటానికి యజ్ఞభూమికి తండ్రి అనుజ్ఞకొని తరలి వెళ్ళాడు. రక్తాంబరాలుగొని దానవ కాంతలు భయంతో వెనుక వచ్చారు. అంబరాలు ధరించి లాజలచేతా, గంధమాల్య హవిస్సులచేతా అగ్నిని ఆవహింపచేసి పూజించి శరపత్రాలుగా నిజశస్త్రాలు పేర్చి, లాంద్రశాఖా సమిధల సమర్పించి, అరుణ వస్త్రధారియై ఇనుపస్రువంతో శరపత్ర మధ్యప్రదేశంలో మేకను బలి ఇచ్చి హుతంచేశాడు. పొగలేని మంటలతో, విజయం సూచిస్తూ, సప్రదక్షిణంగా సర్వాభరణ భూషితుడై జ్వలనుడు సాక్షాత్కరించి హవి గ్రహించాడు. అనంతరం రావణి అంతర్ధానగతం, హయ చతుష్కం, కాంచన పరిచ్ఛదం, అతుల తేజం, అర్ధచంద్ర పూర్ణచంద్ర నిశాత విశిఖా సమృద్ధం, మృగ సంయుతం అయిన రథాన్ని ఆరోహించి, శాత పరిపూర్ణ జలకుంభమై, జ్వలిత హుతవహసుభ్యమై, వైడూర్య కలితమైన ధ్వజాన్ని ఎత్తి, సూర్యకల్పం బ్రహ్మాశరం రక్షింపగా, దుస్సాధసత్త్వుడయి లంకానగరం నిర్గమించి రాక్షస వీరులతో ఆత్మోత్కర్ష తెలుపసాగాడు.

## అదృశ్యుడైన ఇంద్రజిత్తు రామ లక్ష్మణ వానరుల బాధించుట

“రక్షోవీరులారా! జంకవద్దు. వంచకమునివేషధారులైన రామ లక్ష్మణుల వధించి జయం మీ చేతికి అందిస్తాను. తండ్రి ఆనందంతో ఆత్మీయులకు తర్పణం ఇచ్చేలాగా చేస్తాను. భూమండలం అవానరం, అరామలక్షణం కావిస్తాను. నా తండ్రి మనశ్శల్యం పెకలిస్తాను. ఈనాడు వానరులు మిమ్మల్ని తేరి చూడలేరు. మీపోటుకు అడ్డులేదు. ఎక్కడ నేనున్నా మీవెంట వున్నట్లే. పగతీర్చుకునే అవకాశం వచ్చింది. అది సారూపంగా దైవంమీకిచ్చినది. నడవండి. నేటితో యుద్ధపరిసమాప్తి కావాలె” అంటూ రథంతో అదృశ్యుడై రణక్షేత్రానికి వెళ్ళాడు. పోయి దుష్టావహులను, త్రిశీర్షభుజంగ విభ్రమవిభాసులను, అవధీరిత నైఋతయోధులను రామలక్ష్మణులను ప్లవంగ వీరమధ్యంలో చూసి, “ఆహా! వీరా రామలక్ష్మణులు? జగజ్జేగీయమాన పరాక్రములు. సందేహం లేదు. వీరికన్మొరగి విజయం సాధిస్తాను” అని తలచి శరపాతం చేశాడు.

హఠాత్తుగ వచ్చిపడుతున్న బాణాల తాకిడికి నొచ్చి, నిలువ్రదొక్కుడని అంబరానికి శరాలు విసర్రాడు. కాని ఒక బాణం కూడా వాణ్ణి తాకలేదు. అంధకారమున్నుకల్పించి, అభ్రాన్ని కూడ మంచు అలముకున్నట్లు కానరాకుండా చేసి శరవర్షం కురిశాడు. గుణలతా ఘోషమో, హయఖుర గంభీర ఘట్టన ధ్వానమో, నేమి నినదమో తెలియరాకుండా, శబ్దవేధులకు ఖండాంతరవేధులకు అందకుండా బాణాలు పరంపరగా ప్రయోగిస్తున్నాడు. ఎదురుగా మబ్బులోవచ్చి సర్వాంగాలు మర్మవిపాటనంగా మార్గణాలు విసరి రామలక్ష్మణుల శరీరాలను జల్లెడలాగా ఛేదించాడు. వాన ధారకు పర్వతం వలె నిల్చి భ్రాతలు శరగమనాన్ని గుర్తించి ఆ దిక్కుగా అస్త్రసందోహాన్ని ఆగకుండా ప్రయోగించారు. ఆ విధంగా జరుగుతుందని అనుకోని ఇంద్రజి సోదర ప్రయుక్త శరాలకు తనువు లక్ష్యభూతంకాగా బాధలో ఆ దిక్కు వదిలి పృష్ఠభాగం చేరి యుద్ధం చేయసాగాడు. ఏదిక్కునుంచి వస్తున్నా దేహం కాండం తాకకుండా ఖండిస్తున్న దాశరథుల ప్రజ్ఞకు మాయావి సిగ్గుపడి, తగిలే వరకూ కనపడకుండా నారాచాలునాటి శరీరాలు చీల్చాడు. అసురుడు కనిపించడు. అస్త్రాలు కనుపించవు. లక్ష్యం తెలియని స్థితిలో అన్నదమ్ములు చాపధరులై నిలిచి శరాఘాతాలను సహిస్తున్నారు. పూచిన కింశుక వృక్షాలకూ, రామలక్ష్మణులకూ భేదం కనిపించలేదు. దాశరథులు నిర్వ్యాపారులు కాగానే వంచకుడు విజృంభించాడు. వాడి రూపంకాని, ధనువుకాని, రాకకాని, పోకకాని, బాణంకాని తెలియని విధంగా మాయాయవనికలోదాగి అపారవానర సైన్యాన్ని నాశనం చేశాడు. "ఆ కుటిల కర్ముడు శాంబరీ సహాయంతో శాఖచరులనూ చంపుతున్నాడు. మనలను చేతగాని దద్దమ్మలచేశాడు. వీరవిహారం చేస్తున్నాడు. శక్తికల్గి అశక్తులవలె సహించటం ఎవరికి క్షేమం? మనకా? మనకోసం పోరాడవచ్చిన మర్కట నాయకులకా? సహనానికైనా ఒక సమయం వుండాలె. మన ఉదాసీనత విరోధుల విక్రమాన్ని వృద్ధిచేస్తూందని అనుకోటం అవసరం. నీకు సమ్మతమైతే బ్రహ్మాస్త్రంతో అరాక్షసం చేస్తాను. అంతటితో పీడ విరగడైపోతుంది" అని కోపంతో అన్నతో అన్నాడు. "తమ్ముడా! ఆ పని నేను చేయలేక వూరుకున్నానా? ఒకే ఒక దుర్మార్గుని కారణంగా జాతి నిర్మూలనం చేయటం ధర్మమా? సాక్కినవాణ్ణి, అయుధ్యమానుణ్ణి, పారుపోతును, అంజలించినవాణ్ణి, దాగినవాణ్ణి, శరణు

జొచ్చినవాణ్ణి శత్రువైనా చంపటం ధర్మంకాదు. ఇక్ష్వాకులు ఆ పని ఎన్నడు చేయలేదు. నేను వీణ్ణి చంపే మార్గం ఆలోచిస్తూనే వున్నాను. వీడు మాయను ఆశ్రయించి సమరం సాగిస్తున్నాడు. మనం ఎలాగైనా వాణ్ణి కనుపించేలాగా ఏదో యత్నం చేయాలె. కనపడితే మనవాళ్ళే చంపుతారు. మనదాకా రానీయను. రసాతలం దూరినా, ఆకాశంలో అణగినా చంపటానికి నేను సిద్ధంగా వున్నాను. ఎంతోకాలం వేచివుండ పనిలేదు. ఇప్పుడే శరదగ్ధుడై భూమిపై పడతాడు" అంటూ పరమ దయామూర్తి రాముడు తమ్మునితో చెప్పి తీవ్రంగా తారాపథంవంక పరిశీలనగా చూచాడు. మాయావియైన ఇంద్రజి రాముని చూపులో పడ్డాడు.

## రావణి మాయాసీతతో హనుమ వున్న దిక్కుకు పోవుట

రాముని చూపు రావణి శరీరం కాల్చింది. ఇక లాభంలేదని మాయ మాని "రాముడు క్రుద్ధుడైనాడు. అతని చూపులో ఇక మాయ నిలువదు. నన్ను చూచాడు. శరమోక్షం సలుపకముందే తప్పుకోటం యుక్తం" అని తలచి లంకకు మరలిపోయాడు. వాడు పోవటంతో మంచుపొర విడిపోయినట్లు కల్పిత మాయాంధకారం పంచబంగాళమై పోయింది. అంపవెల్లి ఆగిపోయింది. వానరులు పెలరేగి దానవుల చూరబుచ్చ సాగారు. గృహానికి పోయినా ఇంద్రజిత్తు మనస్సు శాంతించలేదు. తనపై విశ్వాసంతో వచ్చిన తన వాళ్ళంతా కీశుల చేతుల్లో చావటం, తాను ప్రాణభీతితో తిరిగి రావటం, తండ్రితోనూ, తనవాళ్ళతోనూ పలికిన ప్రగల్భ వాక్యబృందం అవమానాన్ని ఎత్తి చూపిస్తున్నై. ఏమైనాసరే ఇక వెనక్కు రాగూడదని నిర్ణయించుకుని, రాముడున్న వైపు వదలి హనుమ వున్న పశ్చిమద్వారంవైపు వచ్చాడు. సత్యపరాక్రమవులైన సోమకుల పొంగు అణగించే సంకల్పంతో మాయతో అచ్చంగా సీతవలె తోచేట్లు ఒక స్త్రీని కల్పన చేశాడు. దాన్ని తన తేరు ముందు భాగంలో కనపడేలాగా బంధించాడు. మోహంతో కపిసేన మునిగేలాగా రథం అభిముఖంగా తోలించుకుని వచ్చాడు. వస్తున్న మేఘనాదుని వానరులు వీక్షించి సాం శైలాంచత్కరులై, హానని పురస్సరులై వాణ్ణి చంపే ఆసతో ఒక్కపెట్టున

తాకారు. హనుమ పర్వతందాల్చి రథానికి ఎదురేగి, మాసిన చీరతో, జడలు కట్టిన వేణితో, కన్నుల్లో కారుతున్న అశ్రుజల వాహినితో, ఉపవాస కృశీభూతాంగ తేజంతో, విగతభూషా సంతతితో, దీనవదనయై, ధూళి క్రుంగిన దేహంతో చెలువేది వున్న ఒక స్త్రీ మూర్తిని మూర్తకాలంచూచి, "సీతా మాతయే ఈమె" అని భావించి సంతాపించాడు. కొన్నిరోజులక్రిందట కన్నవాడు, సీతను గుర్తించినవాడుకావటం, ఆపన్నురాలై శత్రురథంపై వుండటం కారణంగా హనుమ హృదయం అల్లాడిపోయింది. బుద్ధి మూగపోయింది.

## ఇంద్రజిత్తు మాయ సీతను చంపబూనుట

"రణక్షేత్రానికి ఈ దుర్మార్గుడు ఎందుకు తెచ్చాడు? ఏం చేయనెంచాడు? వీడు రామ ప్రభువుతో పోరాడుతూ పారిపోయింది ఈమెను తెచ్చుటకేనా? ఈ పాపి ఇప్పుడే నా చేత మరణిస్తాడు. సీతమ్మ చెర నుండి విముక్తి అవుతుంది" అని సైన్యాన్ని పురికొల్పుతూ పైపైకి వస్తున్న హనుమ రూపం చూచాడు. లోగా హనుమ ఎంతవాడో ఎరిగినవాడు కనుక సమీపించకుండా ఒరలో ఖడ్గంలాగి పైకెత్తి ఆ దుష్టుడు మాయా సీత కేశాలు చేత పట్టుకుని "రామా! శ్రీరామా!" అంటూ రోదిస్తున్నా కనికరం లేకుండా కంఠం తరుగబోయాడు. హనుమ ఆ దుస్సంఘటన చూడలేక అశ్రువులు కారుస్తూ, ఆ సాధ్విని, రామచంద్రుని అర్ధాంగిని దీనంగా చూస్తూ, "ఓరీ మూర్ఖుడా! ఆత్మనాశనకారియైన అన్య స్త్రీ కేశాకర్షణం ఎందుకు చేశావు? దుర్మార్గుడా! దుష్టుడా! నీచుడా! కావలుడా! హంతా! మానిత బ్రహ్మర్షి మండనుడైన పులస్త్య వంశంలో జన్మించింది రాక్షసి ప్రహర గర్భంలో. అందుచేతనే నిరయాన్ని కూర్చే ఈ నీచకార్యానికి సాహసించావు. క్షుద్రుడా! పాపీ! ఉగ్ర కర్ముడా! నీకు కరుణలేకపోయినా జుగుప్సకూడా లేదు. ఎందుకు వుంటుంది? రక్త దాహకులు. పలల భోజులు. ఛీ! నీవెంతో గొప్ప వీరుడవనీ, ఇంద్రుణ్ణి జయించావనీ ఏమేమో పొగడుతారు. అదంతా నీ తండ్రి వరబలం. నీ నైజం నీచరాక్షస లక్షణం. ఇల్లూ, వాకిలీ, రాజ్యం, తుదకు భర్త సాన్నిధ్యం విడిచి అహోరాత్రాలు ఏడుస్తూ కాలం గడుపుతుండే నీకేం ద్రోహం చేసిందని ఆమెను చంపబోతున్నావు? పురుషుడవై మాతో పోరాడలేక అధమాధముడవై ఆడుదానిని చంపుతున్నావు. నీవు బ్రదికి ఎవరిని

సంతోషపెట్టగలవు? నీచకాముకుడు, నిర్లజ్జుడు, సమరభీరుకు నీ తండ్రి సంతోషించవచ్చునేమో కాని, నీ తల్లి, నీ భార్య సంతోషించరు సరికదా భీరుడు కోరిన పుత్రుడైనాడనీ, నీచుడు భర్త అయినాడనీ అసహ్యించుకుంటారు. నీవీ సతిని చంపావా? నీవు జీవించవు. నిన్ను చంపక విడువను. నేను ధర్మమార్గావలంబిని. రామ భక్తుడను. కనుక నీ బ్రహ్మాస్త్రాన్ని, నీ మాయనూ సహించాను. లేకపోతే మొదటినాటి యుద్ధంలోనే నిన్ను తుదముట్టించే వాణ్ణి. నేను నిన్ను వీరుని చంపినట్లు చంపక మృగంలాగా చంపి స్త్రీ హత్యాపాపానికి ఏ లోకం ప్రాప్తిస్తుందో, ఆ లోకానికి పంపుతాను ఆగు. పుంస్త్వహీనుడా! ఆగు. ఇదిగో ఈ ముష్టి ఘాతంతో నీ బ్రదుకు ముగుస్తుంది" అంటూ మీదికి లంఘించాడు. ఆతనితోపాటు ఆగచర సైన్యం రావణి సైన్యాన్ని రాళ్ళవానలో ముంచింది.

## రావణి కల్పితసీతను హనుమ చూడగా ఖండించుట

ఆగ్రహంతో వస్తున్న వానరసేనను శరవృష్టితో నిరోధించి పావనిని లక్షించి "నీ కూతలతో నాకేం పని? నాకు విజయం కావాలె. నా తండ్రి ఆనందించాలె. అంతే. సామాన్యుల సామాన్యాస్త్రాలతో జయిస్తాను. దివ్యుల దివ్యాస్త్రాలతో నిర్జిస్తాను. శక్తిమంతుల వంచనతో జయిస్తాను. అదీ సాధ్యం కాకపోతే మాయతో జయిస్తాను. ప్రయోజన శూన్యమైన పౌరుషంతో నాకు సంబంధం లేదు. ఏ స్త్రీకై నీవూ, సుగ్రీవుడూ, రామలక్ష్మణులూ ఎత్తివచ్చి నా వాళ్ళను చంపారో, నా తండ్రికి అవమానం కల్పించారో ఆ స్త్రీని నీ ఎదుటనే ఖండిస్తాను. ఇది బ్రతికినా నా తండ్రికి అనుకూలురాలు కాదు. ఇంక జీవిస్తే ఎందరి ప్రాణాలు తీయిస్తుందో. అందుకే ముందు ఈ పిశాచాన్ని తొలగించి, ఆపై రామలక్ష్మణుల త్రుంచి, నిన్నూ, సుగ్రీవుణ్ణీ, వివేకభ్రష్టుడూ, శత్రు పాదసేవా ధురంధరుడూ అయిన విభీషణుని చంపుతాను. ఆడుదాన్ని చంపటం అధమకార్యం అన్నావు. నీకు రణ నీతి, రాజనీతి తెలియదు. శత్రువును జయించాలంటే బాహ్యాభ్యంతరాలు రెండూ బాధించాలె. సీత చస్తే రాముడు నిర్వీర్యుడై చస్తాడు. అన్న చస్తే తమ్ముడు చస్తాడు. వాళ్ళు

చావగానే నా చేత మీరు చస్తారు. కనుక ఈ పని అర్థమయిందా" అని హనుమకు చెపుతూ కృపాణంతో కృత్రిమ సీత తల నరికాడు. రెండు తుండేలు నేలపడినై. మాయా సీతను చంపి "ఓ పెద్ద కోతీ! మీ అందరి ఆరాటం తీరిపోయింది. రామునిపై పగతో రామపత్నిని చంపాను. శత యోజన నిర్మిత సేతుబంధనం, మహా దైత్య వీర సంహారం, లంకాదహనం, అన్నీ వృధా అయినై. ఇంకెవరికోసం పోరుతారో, ఏం చేస్తారో మీరే నిర్ణయించుకోండి. ఇక మాకు యుద్ధంలో పనిలేదు" అని మేఘనాద నామం సార్థకంగా గర్జించాడు. లావరిలాంగూల సైన్యం పారిపోసాగింది. నిశాచర సైన్యం విజయఘోషతో ఉప్పొంగిపోయింది.

## హనుమ ఇంద్రజిత్తుతో పోరుట

నిశాటుల ఆర్భటులకూ, ఉత్సాహం ఉరకలువేస్తూ మేఘనాదుడుచేసిన ఘోషకూ వానర సైన్యం స్తబ్ధమైంది. "ఇంతకు తెగించినవాడు ఎంతకైనా సాహసిస్తాడు, ఏమైనా చేస్తాడు. ప్రాణాలుంటే బలుసాకయినా తిని బ్రతుకవచ్చు" నని భావించి ప్లవంగ పుంగవులు పుడమిపడిన పాదరసం చెల్లాచెదరైనట్లు ఎక్కడివాళ్ళక్కడ చెదరిపోసాగారు. భయకంపిత చిత్తులై పరుగెత్తుతున్న ప్లవగ వీరుల హనుమ చేయెత్తి ఆపి, "సాహసవంతులారా! రణవాంఛా తత్పరులారా! సంగరోత్సాహాన్ని సమయించి, ధైర్యాన్ని ఏట గలిపి, యుద్ధావని వదలి, పశులు భక్కున నవ్వేట్లు పారిపోతున్నారా ? ప్రాణాలంత తీపా ? ఎంత పేరు గడించారు ? ఎందరిని మడియించారు ? ఎంత శూరత చూపారు ? రామచంద్రుని ప్రేమకు ఎంత పాత్రులయ్యారు? పంక్తిముఖుని దృష్టికి ఎంత భయంకరులయ్యారు? అదంతా ఏంచేశారు? ఈ పిరికిమందు ఏ అంగడిలో కొన్నారు? చావు యుద్ధంలోనేనా? ఇంటిలోరాదా? చావక స్థిరంగా బ్రతికినవారున్నారా? నారక్షణలో మీరీపనిచేయటం నన్నవమానించటంకాదా? నేను నిలిచి వుండగా మీరు పారిపోవటం ధర్మమా? నేను అశక్తుణ్ణయితే మీరు చేసింది యుక్తమైన పనే. నేను ఎదుటనుండగా నన్నుగాదని మిమ్మల్ని చెనకటం సాధ్యమా? మీ భయం ఎవరినిచూచి? రాక్షసులనా? మీపేరు చెపితేనే వాళ్ళు లంకకు పారిపోతారు. ఇక ఈ క్రూరుడు, నయవంచకుడు ఇంద్రజిత్తును గురించా?

నేనెరుగానేవున్నానుగా. వాడెక్కడికిపోతాడు? నేనెక్కడికిపోతాను? రామ సేవకులు, రవిపుత్రుని బంటులు సాటిలేని మేటిమగవారు. పిరికితనం మంచిది కాదు, మనవైరులవి. నావెనుక వ్యూహంగా నిలువండి" అని సక్రోధ సింహంలాగా ప్రబోధించాడు. అప్పుడే కపులు భీతిని నిగ్రహించి, పరాక్రమాన్ని గ్రహించి నగచరులు సహజాస్త్ర సంశోభితపాణులై, భూమిగ్రక్కదల ముందుకు నడిచారు. ఆగ్రహించిన హనుమ సవ్యాపసవ్యంగా పర్వత వృక్షశిలా వర్షాన్ని కురిసి రాత్రించర గాత్రాలను నుగ్గునూచం చేశాడు. అంతతో నిలువక మహాపర్వతం రావణి రథంపై విసిరాడు. సమయస్ఫూర్తి గల సారథి రథాన్ని దూరంగా తోలుకునిపోయాడు. ఆ పర్వతపాతానికి అసురసేన అపారంగా విలయంపొందింది. రక్షణ పొందిన రావణి కపిసైన్యం పోటుకు తనవారు పడుతున్న భంగపాటు చూచి రథాన్ని ముందుకు తోలించి మర్కటుల మర్మాంగాలు ఛేదించసాగాడు. వానరులు అంతులేని శిలాశైల వృష్టం కురిసి ఇంద్రజిత్తును వేధించారు. ఇంతలో హనుమ దిగ్గరగా ఎలుగెత్తి "వానరులారా! పోరుమానండి. నామాటలు కొన్ని వినండి" అని అన్నాడు.

## సామీరి సమరం చాలించి రాముని చూడబోవుట

హఠాత్తుగా హనుమ ఆహవాన్ని ఆపుమన్నాడు. "ఇంద్రజిత్తును మనం చంపినా, అసురసేనను అంతం చేసినా ఏమేలు లభిస్తుంది? మనం పోరుతున్నది రామునికోసంగదా? ఈయుద్ధానికి హేతువు సీతామాత. రాముని ప్రాణప్రియ. ఆమే హత్యచేయబడితే ఎవరికోసం ఈ యుద్ధం? వృథా ప్రాణత్యాగం చేయటం ఎందుకు? వ్రతంచెడినా ఫలమైనా దక్కాలిగదా! రెండూ చెడిన రేవడులమైతే ప్రయోజనం ఏముంది? జరిగినదంతా రామరవి పుత్రులకు చెబుతాను. వారు ఏవిధంగా ఆలోచిస్తారో, ఏనిర్ణయం తీసుకుంటారో ఆవిధంగా చేయటం మనవిధి. తెలిసింది చెప్పకపోవటం సేవకధర్మం కాదు. మీరుమిక్కిలియుద్ధానికి బీజమైన మైథిలిమరణందాచతగిందేనా? వ్యూహం ఉపసంహరించి నా వెనుకరండి" అని చెప్పి మోహంతో రామునికి చెంతకు చేరబోయాడు. అగచరులతో హనుమంతుడు రణంమాని రాముని చేరపోవటం రావణి చూచాడు. తన ఎత్తు పారిందని సంతసించాడు. "సీతను చూచినవాడు

హనుమ ఒక్కడే. ఆతడి మాట రామునకు బంగారు మూట. నమ్మకంపేట. అందుకే రామునితో పోరుమాని వంచనతో జయించాలని తానీ ఎత్తు వేశాడు. హనుమ నమ్మాడు. రామునకు చెపుతాడు. అనంతరం తానూహించినట్లే జరుగుతుంది. ఇక నా కార్యం విజయవంతంగా ముగిస్తాను" అని ఆలోచించి విధివత్ప్రకారం చైత్యంలోని నికుంభిలకుపోయి అభిచార హోమం ప్రారంభించాడు. ఆతడు అర్పిస్తున్న పలలాస్ర హవిస్సుతో జ్వాలనుడు అస్తమయార్కరుచితో ప్రజ్వలించసాగాడు. రాక్షసుల క్షేమంగోరి రావణి వర సన్నిభమైన హోమం అంతరాయం లేకుండా చేయసాగాడు. శత్రువులకు కానరాకుండా రక్ష సైన్యాన్ని చుట్టూ బలంగా కాపుంచాడు. హోమం జరుగుతున్నా ధూమం రాకుండా అగ్ని వెలుగుతున్నాడు.

## రావణి సీతను వధించెనని హనుమ శ్రీరామునితో చెప్పుట

నైఋతిదిశ రక్షిస్తున్న రామచంద్రుడు హనుమ కాపాడుతున్న పశ్చిమ దిక్కున రాక్షసులు చేస్తున్న కోలాహలంవిని, అక్కడ పోరు ఘోరంగా జరుగుతున్నదని భావించి జాంబవంతుని పిలిచి "భల్లూకపతీ! విన్నావా ఆ రక్కసుల ఆర్భాటాలు? ఇంతకు పూర్వం మనవాళ్ళ ఉత్సాహం ఘోషలు వినిపించినై. ఇంతలో శత్రువుల అరుపులు అధికమైనై. అంతకంతకు అభివృద్ధికానొచ్చినై. కారణం ఏమై వుంటుంది? హనుమకు సంగరం భారమైందేమో? మనవాళ్ళ చడిచప్పుడూ బొత్తిగా లేదు. పావని నిల్చి వుండగా పరులు విశృంఖలంగా విజృంభించుతారా? నాకు నమ్మకంలేదు. ఏదో ఇబ్బంది కలిగి వుంటుంది. నీవు నీ సేనతో తోడు పడిపోవటం మంచిది" అని చెప్పాడు. వెనువెంటనే జాంబవంతుడు కదలిపోయాడు. దారినడుమ దీర్ఘంగా నిశ్శ్వసిస్తూ, విన్ననైన వదనంతో కపులవెంట బెట్టుకుని వస్తున్న మహాకపిని చూచాడు. హనుమ కూడ ఆ వృద్ధ యోధుని ఆపి తన వెంటగొని రాముని సన్నిధికి వచ్చాడు. రాముడు హనుమను తేరిపార చూచాడు. పూర్వం ఏ స్థితిలోనూ తాను చూడని హనుమ రూపలక్షణాలను తిలకించి అశుభాన్ని చింతించాడు. ఇంతలో పావని ఆపుకోలేని ఆవేదనతో "స్వామీ! రామచంద్రా!

ఇదికూడా ప్రత్యక్షంగా అందరికీ తెలిసిందే. పరోపకారివి. అందుకు నీ జీవితమే సాక్ష్యం. అటువంటి నీకు అనర్థం రాకూడదు. అయినా నీకువచ్చింది కనుక ధర్మాన్ని ఆచరించటం నిరర్థకం. స్థావర జంగమాలకే విధంగా తెలియటం లోకంలో లేదో, లోకానికి కూడా అలాగే ధర్మం తెలియబడటం లేదు. అది ఉంటే మనకెందుకు అనుభవానికి రాదు? ఇది జడం, ఇది చైతన్యం అని తెలుస్తూంది కదా? ఇది ధర్మఫలం, ఇది అధర్మ ఫలం అని తెలియాలిగా? ఇప్పుడు మనకు తెలిసిన విధంగా నీవుండగా వదిన మరణించ కూడదు. మనకు సంప్రదాయం, పెద్దలు చెప్పిన ధర్మాన్నే నీవు ఆచరిస్తున్నావు. ఇది మరి దేనివల్ల వచ్చిన ఫలం? ఇది అధర్మంవల్ల వచ్చిందనుకోవాలా? కనుక ధర్మం వుండటం కల్ల. ఇక అధర్మం వుందేమో ఆలోచిద్దాం. పగవాడైన పంక్తిముఖుడు అధర్మాలని చెప్పేవాటి కన్నింటికీ ప్రతీక. అతను అజన్మ పరమ భోగి. అతను అనుభవించని అర్థాలేమి మిగిలివున్నై? కనుక అధర్మ పథగామియైన అసురపతి దుఃఖం పొందక పోవటం, ధర్మనిరతుడవైన నీవు కష్టాలు అనుభవించటం పరస్పర విరుద్ధ కార్యాలు గదా? ఎలా జరుగుతున్నై? దీన్ని సూక్ష్మంగా విచారిస్తే అధర్మం సుఖానికీ, ధర్మం అసుఖానికీ కారణమని తేలుతూంది.

అన్నా! ధర్మవర్తనం శర్మ ప్రదమనీ, ధర్మహీనత దుఃఖకారణమనీ నీవుతలపోస్తే అది అసత్యం. కార్యకారణ సంబంధ దూరం. బ్రతికినంతకాలం ధర్మమూర్తులు సుఖాలనూ, అధర్మరతులు దుఃఖాన్నీ పొందినట్లు లోకానుభవం చెప్పటం లేదే? మిశ్రమ ఫలానుభవ జీవులే కానవస్తున్నారే! కనుక ధర్మాధర్మాలు రెండూ నిరర్థకాలే. పాపాత్ముల అధర్మం శిక్షిస్తుంటే క్రమంగా అధర్మం క్షీణించిపోదా? ఇంక దానికి స్వత్వం ఎక్కడుంటుంది? ఈ సృష్ట్యాది ఇప్పటికి అధర్మం అనే పేరు మాసిపోయి వుండాలె. కర్మ చేసినా కర్మాధి దేవత ఫలం ఇస్తుందని వాదిస్తే, దైవం ధర్మమూర్తినే బాధిస్తూంది. అది కాదంటే కర్మకారుడే అన్యాయి బాధింపబడుతున్నాడు. ఇది సత్యంగా తెలుస్తున్న విషయం. పాపకర్మఫలం దుఃఖమైతే అది దైవానికే చెందుతుందికాని, కర్మకు చెందదు. ధర్మంవైపూ ఇంతే! ధర్మమనేదానికి రూపులేదు. సంకేతాలూలేవు. ఇక అసత్యరూపమైన ధర్మం పరఫలం ఇస్తుం

ధనం ప్రధాన సాధనం. అది చేవేతుల పాటు చేసుకున్నవానికి ఇంకా ధర్మం ఎక్కడ? ధనహీనుడు బలహీనుడు. వాణ్ణి అన్నతమ్ములు కూడా పరిత్యజిస్తారు. ధనం లేనివాడు తలపెట్టే కార్యం వేసవిలో ఏటి నీరులాగా వట్టిపోతుంది. సౌఖ్యం ఆశించినవాడు ముందు తనకున్నది వెచ్చపెడతాడు. ఆపైన దాన్ని పొందటానికి ఎన్నో పాపకార్యాలు చేస్తాడు. ఆ పాపంతో వాడు చస్తాడు. కలవానికి మిత్రులుంటారు. బంధువులుంటారు. ఇతరుల రాకపోకలు, స్తుతి సన్మానాలు, రాజగౌరవాలు, మృష్టాన్న భోజనాలు అన్నీ వుంటై. లేనివాడు పుడమి లేనివాడు. ధనం వుంటే (విద్యలేని) పామరుడు పండితుడౌతాడు. కూళ నేర్పరి అవుతాడు. కురూపి సుందరుడవుతాడు. ఒకటేమిటి? ధనముంటే అన్నీ వాడే అవుతాడు. బలవంతుడు, ధీమంతుడు, ధర్మాత్ముడు, త్యాగిభోగి అన్నీ ధనంతో కావచ్చు. అర్థరహితుడికే అన్ని అనర్థాలువస్తై. కులంవున్నా హీనంగా చూస్తారు. పాండిత్యం వున్నా ప్రభువులుగాని, ప్రజలుగాని గుర్తించరు. సర్వశక్తిసంపన్నమైన ధనాన్ని ఏమాశించి త్యాగం చేశావో నీకే తెలియాలె. అర్థాన్ని అర్థార్థులైన వారికోసం వ్యయంచేస్తే అది వృథగాదు. నిర్ధనుడు, ధనాభిలాషతో అనర్థాలను కొనితెచ్చుకుంటాడు. ఇంతెందుకు? శమహర్ష కామదమ క్రోధ ధర్మాదిగుణాలన్నీ ధనం చేతనే ప్రవర్తిస్తై. స్థిరంగా నిలుస్తుంటై. కీర్తికారణాలవుతుంటై. ధర్మం ధర్మమంటూ ఒక ధర్మాన్నే ఆచరించే వాళ్ళకు శర్మం చాలా దూరంగా వుంటుంది. మేఘం దట్టంగా అలుముకుంటే సూర్యచంద్రాది ప్రకాశ గ్రహాలు సయితం కానరానట్లు, లోకంలోని శౌర్య సౌఖ్య కారణాలైన దానవిత్త ధర్మశర్మాలు నీకు లేనే లేవుగా. అన్నీ వదులుకుని తండ్రిని సత్యవాదిగా చేయాలని సంకల్పించావు. దానికి ఫలంగా అడవిలో అష్టకష్టాలు అనుభవించావు. ఇప్పుడు ప్రాణాధికురాలైన భార్యనుదాసి బ్రదుకు బండలు చేసుకున్నావు. ఇంత ఘోరం జరిగినా నీవు ఎందుకు ఉదాసీనంగా వున్నావో నాకు బోధపడలేదు. ఇకనైనా ఇంద్రజిత్తు చేసిన దుష్కృతికి ప్రతిక్రియ చేద్దువుగానిలే. నాకు అనుజ్ఞ ఇచ్చి నీవు రానున్న పరిణామాన్ని దర్శించు. ఓ రాజలోకరత్నమా! ఓ ఆజానుబాహు యుగళా! నియమవ్రతా! లే లెమ్ము. మహాత్ముడవైన నిన్ను నీవు తెలుసుకోలేక అయ్యయ్యో! శోకిస్తుంటే నేనేం చేసేది? ఈ సౌమిత్రి పుట్టింది నీ ప్రియంకోసం. నీకు అప్రియం జరిగితే ఓర్చి వీడు

బ్రతుకలేను. నీకు ప్రేమాస్పదం, నాకు మాతృస్థానీయం అయిన వదిన మరణం విని సహించలేను. నేను జీవించివుండగా ధర్మమూర్తివి నిన్ను కష్టాలపాలు చేసిన విశ్వం వుంటేనేం? ఊడితేనేం? ఎక్కడి ధర్మం? ఎక్కడి దేవతలు? ఎక్కడ సత్యవ్రత నియమాలు? నాకు లోకం అంటే నీవు. బ్రదుకంటే నీవు. ఈ సృష్టి నన్నే అవమానించింది. జరిగిన కీడు నీకు కాదు, నాకు. మనసా వాచా కర్మణా నేను నిన్నుగాక అన్యం ఎరగను. ఈ విశ్వసృష్టిని దగ్ధం చేస్తాను. నేను దగ్ధుడనై పోతాను. ఈ యుద్ధం దేనికి? ఈ కాలహరణం దేనికి? నీకు అప్రియమైన భార్య మరణం విని నేను క్రోధకలుషిత చిత్తుడైనాను. లంకనూ, లంకాధిపతినీ, సర్వ సంపదనూ, సబాంధవంగా దహించివేస్తాను" అని లక్ష్మణుడు అన్నను ఓదార్చాడు.

## రావణి మాయోపాయాలను విభీషణుడు రామునకు చెప్పుట

మూర్ఛిల్లిన రామునకు స్మృతి మాత్రం కలిగింది. కాని, స్వస్థత మాత్రం పూర్తిగా రాలేదు. లక్ష్మణుడు చెపుతున్న మాటలు వింటున్నట్లు కానీ, తద్వారా ఊరటనందినట్లుగాని ఆయనలో కనిపించటంలేదు. ఇంతలో కపిసైన్యాన్ని క్రమబద్ధంగా వ్యూహాలుతీర్చి, కరులు సేవింపగా వచ్చే కరినాథునిలాగా మంత్రులు అనుసరింపగా ఆ స్థానానికి విభీషణుడు వచ్చాడు. సౌమిత్రి అంకంలో వున్న రామచంద్రుణ్ణి, దుఃఖార్తుడైన లక్ష్మణునీ, వానరులనూ చూచాడు. ఆ స్థితి విభీషణునికి అర్థంకాలేదు. రాముడు శోకాకులచిత్తుడై, పరధ్యానంగా ఎందుకు వున్నాడో వివరం తెలియక అతడు కూడా ఆవేదనపాలై కారణం ఏమని అడిగాడు. సౌమిత్రి రాక్షసపతినీ, కపులనూ, రవి పుత్రుణ్ణీ చూస్తూ, నీళ్ళతో నిండిన నేత్రాలతో "ఏం చెప్పేది? ఇంద్రజిత్తుచే యుద్ధ మధ్యంలో సీతామాత హత్యచేయబడిందని హనుమ చెప్పగా విని అతిదుఃఖంతో అన్న మూర్ఛితుడైనాడు. ఆయన పాటు మాకు అందరికీ కష్టకారణమైంది" అని ఇంకా ఏమో చెప్పబోతున్న సౌమిత్రిని ఆపి "అర్థమైంది. హనుమంతుడు చెప్పినమాట అంబుధి ఇంకిందన్నట్లు వుంది. కాని, విశ్వసనీయంగా లేదు. హనుమ భ్రాంతి పడవచ్చు. జరిగిన సన్నివేశం సత్యం మాత్రంకాదు. రావణుని హృదయం నాకు తెలుసు. తానే చంపని సీతాదేవిని

71/170

నాతో వచ్చే కపిసేనకు నాయకుడై లక్ష్మణుడు రావాలి. సౌమిత్రిచే వాడు చేస్తున్న సవనమందు భంగంకావాలి. అనంతరం అతని అస్త్రంతో వాడు చావాలి. శత్రువు సమాప్తకర్ముడైతే వాడు త్రిమూర్తులకే అవధ్యుడు. హోమం పూర్తికాగానే అగ్నిదత్తరథ సారథి శరశరాసనాలతో అదృశ్యుడౌతాడు. అప్పుడు వాడు వేసే బాణాలు, వాడువేసే, అగడాలు దివిజులకే సాధ్యంకావు. యుద్ధంలో నీ లక్ష్యానికి అందడు. ఎదుటికి రాడు. ప్రమాదం తెలిసి తెచ్చుకుంటాము" అని విభీషణుడు ఆతురతతో రాముని వేడుకున్నాడు.

## రావణిని చంప లక్ష్మణుని పంపమని విభీషణుడు రాముని కోరుట

రాముడు సౌమిత్రి మాటలవలెనే విభీషణుని మాటలు కూడ విన్నాడు. కాని స్వస్థుడు కానందున సరిగా గ్రహించక తికమకపడి "మిత్రుడా! నీవిప్పుడేమని నాకు చెపుతున్నావు? ఇప్పుడు నా మనస్సు గ్రహణధారణలకు తగినట్లుగా లేదు. శ్రమ అనుకోకుండా ఇంకోసారి చెప్పు" మని అడిగాడు. క్రమంగా ధృతిమంతుడవుతున్న రామునిచూచి, విభీషణుడు మెల్లగా ఇలా చెప్పాడు. "రామచంద్రా! నీవింతకు పూర్వం నాతో చెప్పిన ప్రకారం మన సైన్యాన్ని పునర్వ్యూహనంచేసి వుంచవలసిన ప్రదేశాల్లో వుంచదగినవారినివుంచి పార్శ్వభంగం జరిగితే ఆదుకునేందుకు అందుబాటులో కొంత కొంత సైన్యాన్ని కాపుంచి శక్తి కల్గినంత వరకు అభేద్యంగా మొగ్గరింపచేశాను. ఇది నీకు చెప్ప వచ్చాను. విషయం తెలియక నీవు విచారంలో మునిగి వున్నావు. రావణి మాయాసీత కథతో హనుమను భ్రాంతిలో ముంచి దుర్మార్గుడు శత్రునాశనానికి నికుంభిలలో హోమం చేయబోయాడు. మర్మం తెలియని మారుతి నీకు సీత వధింపబడిందని చెప్పటానికి యుద్ధం మాని వచ్చాడు. వాడిపాచిక పారింది. తన సైన్యాన్ని చుట్టూ కాపుంచుకుని, కానరాకుండా సవనం చేస్తున్నాడు. ఆ చేసే విధానం మనకు మన్నించరానిది. మన్నిస్తే మరణం కోరితెచ్చుకున్నవాళ్ళమవుతాం. అది మధ్యలో భంగమైతే వాడే చస్తాడు. అందుకు తగిన వుపాయం తెలుసు. నీవు ఉదాసీనంగా వుండటం శత్రువులకు విజయాన్ని చేతికందించటం, స్వజననాశనాన్ని

వాంఛించినట్లుగా పరిణమిస్తుంది. నీవు ముందు పూర్వస్థితిపొందాలి. నీవు కోదండధారివికాకపోతే మాగతి ఇంద్రజిత్తు బాణాలకు లక్ష్యంగా వుంటుంది. జానకిని గ్రహించాలనే కోరిక నీకు నిజంగా వుంటే, రాక్షసరాజు సంహారం చేయి. ఆ పనికి ముందు నావెంట లక్ష్మణుని పంపు. నికుంభిలలో హవనం చేస్తున్న శక్రజిత్తు వ్రతమధ్యంలో యుద్ధానికి వచ్చే యత్నం నేను చేస్తాను. కపులు రాక్షసుల చంపి హోమకుండాన్ని ధ్వంసం చేస్తారు. సౌమిత్రి ద్వంద్వయుద్ధంలో ఇంద్రజిత్తుని చంపుతాడు. ఇక రావణుడు తప్ప మనను ఆపేవాడు లంకలో లేడు. రావణి చస్తే రావణుడు చచ్చినట్లే. "ఎవడు నీవు చేస్తున్న హవనాన్ని విఘ్నం చేస్తాడో వాడే నిన్ను చంపుతాడని బ్రహ్మ వరం ఇచ్చేటప్పుడు చెప్పాడు. కాబట్టి సౌమిత్రిచే క్రతువిఘ్నం చేయించి తర్వాత శిరఃఖండనం చేయిస్తాను. ఇప్పుడే ప్రారంభించాడు. ముగియక ముందే మనం శక్తికలవాళ్ళం, పౌరుషవంతులం! ముగిస్తే మన చరిత్రలే ముగుస్తాయి. వానరులమంతా విగ్గగాలే ముగుస్తుంది. నాకు వాడి మాయలు మర్మాలు అన్నీ తెలుసు. అదృశ్యుడై రథస్థుడై ఆహవంలో నిలిస్తే వాడు అజేయుడు. ఆలస్యం చేయకుండా సౌమిత్రిని రావణివధార్థం పంపు. ప్రతి వచనం చెప్పవద్దు" మళ్ళీ విన్నవించాడు విభీషణుడు.

## రాముడు రావణిని చంప సౌమిత్రిని నికుంభిలకు పంపుట

రాముడు దానవ శ్రేష్ఠుని మాటలు శ్రద్ధగా ఆలకించాడు. ముందు వెనుకలు పరిశీలించాడు. ధర్మాతిక్రమం వుందేమో తీవ్రంగా శోధించాడు. పగవాని బలశక్తియుక్తులు లెక్కించాడు. పరమార్థాన్ని దర్శించాడు. లక్ష్మణుణ్ణి చూశాడు. "అనఘా! హనుమ జాంబవంతాది యూథపులతో కూడి సైన్య ముఖ్యుడైన కిష్కింధాపతి నాయకుడుగా నీవు ప్రతిపక్ష సంహారం నిమిత్తం నికుంభిలకు పో. నీవెంట మంత్రి చతుష్టయంతో విభీషణుడు వచ్చి కర్తవ్యాన్ని నిర్దేశిస్తుంటాడు. అతడు చెప్పినట్లు ఆహవం నడిపించు. చేత వలసిన విధి అతడే బాగా ఎరిగినవాడు" అని అనుమతినిచ్చాడు. అద్భుత విక్రముడైన లక్ష్మణుడు అన్న అనుమతి ఈయగానే శత్రుభయంకరచాపం చేతికి తీసుకున్నాడు. అతనితోపాటుగ విభీషణుడు కూడ ధనువును ధరిం

డాడు. ఖడ్గకవచ తూణీరాలు దాల్చి, సమరసన్నద్ధుడై అన్నకు ప్రణమిల్లి పాదాభివందనం చేశాడు. "విజయోస్తు!" అంటూ రాముడు దీవించి తమ్ముని కౌగిలించి శిరం మూర్కొన్నాడు. అన్న అనుగ్రహాన్ని ఆశీర్బలాన్ని పొందిన లక్ష్మణుడు ఉత్తేజితుడై, "అన్నా! ఇప్పుడు నీ తమ్ముని విక్రమం చూడు. నా ధనువునుంచి వెడలే మార్గణాలు గుంపులుగట్టి సరస్సులో ప్రవేశించే హంసల్లాగా రావణాత్మజుని మేనులో ప్రవేశిస్తాయి. లంకపై గాలివానవలె శరపరంపర వ్యాపిస్తుంది. సదనం ధ్వంసమైపోతుంది. దానితో ఇంద్రజిత్తు కూడా ధ్వంసమైపోతాడు. ఇంతవరకు నీ అంగీకారంకోసం ఆగాను. ఇంకెక్కడి ఇంద్రజిత్తు?ఇంకెక్కడి మాయా నాటకం!" అని హనుమదాదులు వెంటరాగా, విభీషణుడు మార్గం చూపగా నికుంభిలకు ప్రయాణించాడు. మార్గమధ్యంలో భల్లూకపతి తన సైన్యంతో వచ్చి చేరాడు. అందరు కలసి ఏకరూపంగా పోయిపోయి, శస్త్రభయంకరమైనదీ, విస్తృతమైనదీ, కేతనోగ్రమైనదీ, గాఢజవంకలదీ, దీప్తిమంతమైనదీ, కారుమబ్బులకు గాదిలి చుట్టమైనదీ అయిన ఇంద్రజి సేనావారాన్ని చూచాడు. ధనువును వామహస్తంతోనూ, శరాన్ని దక్షిణ హస్తంతోనూ పట్టుకుని ధూర్తుడైన రావణి యజ్ఞాన్ని నాశం చేసే సంకల్పంతో విభీషణుని నిర్దేశంకోసం నిరీక్షిస్తూ స్థిరంగా నిల్చున్నాడు. వానర సైన్యాధిపతులు ఎప్పుడు తమకు ఆజ్ఞ వస్తుంది? ఎప్పుడు నిశాచరుల హతమారుస్తాం? అనే తహతహతో, ప్రహరణసాధనాలు ధరించి దీక్షితులై వున్నారు. దళపతుల ఆదేశంకోసం నగచరులు ఎదురుచూస్తున్నారు.

## కపులు ఇంద్రజి సేనతో పోరుట

విభీషణుడు తన పక్షంలో వున్న సైన్య సంసిద్ధతను ముందు చూచాడు. తర్వాత ఎదిరి పక్షం సైన్యాన్ని పరిశీలించాడు. "రామానుజా! నీ ముందేమి చూస్తున్నావు?" "గాఢంగా క్రమ్మిన జలధర నీలవర్ణం చూస్తున్నాను." "అంతేనా? ఇంకేమైనా కనుపిస్తూందా?" "అంతే. ఇంకేమీ గోచరించటంలేదు." "అదే ఇంద్రజిత్తు సేనావాహిని. మాయచే మనకు కనుపించకుండా చేశాడు. దాని మధ్యంలో రావణాత్మజుడు, భీకరుడు, క్రూరుడు, వంచకుడు, దుస్సహ పరాక్రముడు, ఖలుడు, జగద్భయంకరుడు, అధముడు హోమం చేస్తున్నాడు. నీ దివ్యాస్త్ర పాటవంతో ప్రథమంగా ఆ రక్షణ

వ్యూహాన్ని పాయలు పాయలుగా బ్రద్దలుకొట్టు. అది విచ్ఛిన్నం కాగానే ఆ పాపి దృష్టి గోచరమవుతాడు" అని త్వరపెట్టాడు. వెంటనే లక్ష్మణుడు చాపం సజ్యంచేసి టంకారి శత్రు విదారకంగా గుణం ధ్వనించి మండలీకృత చాపంతో శరవృష్టి కురిపించాడు. సౌమిత్రి శర ప్రయోగం చేసే దిక్కుగా శాఖా మృగ సైన్యం లంఘించి యుద్ధానికి తలపడింది. రాక్షసులు కూడ చేత మెరయు ఖడ్గ పరశ్వధతోమర శూలాది సాధనాలతో వానర సైన్యాన్ని ప్రతిఘటించారు. లంకానగరం నాల్గు దిక్కుల ఎడతెరిపిలేని సంకుల సమరం జరిగింది. విరిగిన ఆయుధాలతో, పగిలిన పర్వత శకలాలతో, తునియలైన వృక్షాలతో రణ రంగం బీభత్సంగా మారిపోయింది. నిశాటు లెంత పోటు చూపినా, వానరుల ధాటికి, లక్ష్మణ బాణాగ్నికి సమిధలై కాలిపోతున్నారు. దహించబడుతున్నారు. అంతకంతకు మహోదధివలె పొంగి వస్తున్న అగచర సైన్యాన్ని, ప్రళయ సమయ నిర్గత బడబానలంవలె వస్తున్న సౌమిత్రి శర ముఖాన్ని అడ్డగించటానికి ప్రాణాలనే దైత్యులు పణంగాపెట్టారు. కనుమూసి తెరిచే లోపల అజేయంగా నిర్మించిన రాక్షస రక్షణ వ్యూహం నామరూపాలు లేకుండా పోయింది. చచ్చినవాళ్ళు చావగా, హతశేషులు దిక్కు తెలియక గమ్యంలేక పారిపోతూ ప్లవగుల బారిపడి ప్రాణాలు విడుస్తున్నారు. దురహంకారి, దుష్టబుద్ధియైన ఇంద్రజిత్తు సైన్యంపాటుచూచి, సహనంమాని, దురాగ్రహంతో లేచివచ్చి, పూర్వరథాన్ని అధిరోహించి, శరశరాసనాలు చేకొని, కాలరుద్రుడో అన్నట్టు కపులపై రాపాడుతుంటే, రాక్షస సైన్యం మళ్ళీ అతని బాట నాసరాకుంటా చుట్టూ వడి కట్టినట్లు నిల్చింది. విచ్చిపోయిన చీకట్లు మళ్ళీ విజృంభించినట్టుగా రాక్షసులు క్రమ్ముటంలో రావణినిగుర్తించలేక మారుతి మంటలు క్రక్కుతూ, వృక్షాన్ని పూని నిశాట సైన్యంపై దూకి నిర్ధూమ ధామం చేయసాగాడు. ప్రాణాలకు తెగించి రాక్షసులుకూడా హనుమను అనేక భీకర శస్త్రాలతో ప్రహరించి బాధించారు. అయినా వజ్రకాయుడు లక్ష్యపెట్ట లేదు. చరణాలతో, కరాలతో, ముష్టులతో, నఖాలతో, శిలలతో, వృక్షాలతో వైరి సైన్యాన్ని పీన్గు పెంటలు చేశాడు. అప్పటి హనుమద్యుద్ధం అమరులకే ఆశ్చర్యం కల్గించింది. అహితాహి వైనతేయుడు హనుమ విజృంభణానికి అసురులు ఆగలేక కాలికి బుద్ధిచెప్పారు. పోటులో ఘోరంగా తనవారు మరణిస్తుంటే తాళలేక ఇంద్రజిత్తు "సారథీ! ఆ మహాకపికి ఎదురుగా రథంపోనియ్యి.

జాగుచేస్తే సైన్యం పూర్తిగా నాశనమవుతుంది. త్వరగా తోలు" అంటూ తొందరచేశాడు. సారథి రథం ముందుకు దూకించాడు.

## ఇంద్రజిత్ హనుమంతుని ఎదిరించుట

వస్తూనే వక్రముఖుని పట్టి దారుణ మారణాస్త్రాలు కుంభవృష్టిగా కురిశాడు. ఆ దైత్యుడు వేసే బాణాలని ఒడిసి పట్టి గోగుపుల్లలవలె, గొప్ప దంట్లవలె విరిచి ముక్కలు చేశాడు. అంతకంతకు ఆగ్రహంతో ఆకారం పెంచుతూ హనుమంతుడు "ఓరీ దుష్ట నిశాచరుడా! ఇది మాయా యుద్ధం కాదురా. ప్రత్యక్ష కదనంలో నిల్చి వున్నానని, నీ ఎదుట స్థిరజీవి, వజ్రకాయుడు, అంజనాపుత్రుడు నిల్చివున్నాడని ఒక్కసారి గురుతు తెచ్చుకుని మరీ యుద్ధం చేయి. నీవు పిరికిపందవుకాకపోతే, నా సమక్షంలో కనుపించుతూ పోరు. భీరుడవైతే మాయను ఆశ్రయించు. అదికూడ ఇక నా ముందు సాగదు. నేను నీ బ్రహ్మాస్త్రాన్ని రెండు సార్లు కోరి గౌరవించాను. అది నన్నేమీ చేయలేదు. అదే నీ జీవితానికి ఆధారం. దాన్ని ఇంతకు ముందే వాడుకున్నావు. ఇక నీవు వేసే శరాలు శక్తిరహితాలు. ప్రయోగించు. ఏ ఏ శరసంధానం ఎంతెంత పనిచేస్తుందో నీవే చూడు. పారిపోకుండా పోరాడు. నీచుడా! నాపోటు తిని బ్రతికితేగదా బాణాలు వేయడం? నీబంటుతనం చూపటం" అని నిందావాక్యాలతో వాణ్ణి రెచ్చగొట్టాడు. ఆజన్మవంచకుడైనా, హనుమ ములుకులవంటి పలుకులతో చేస్తున్న కార్యం మరిచి రావణి చాపం ఎత్తి శరం సంధించాడు. ఆ సమయంకోసమే వేచివున్న విభీషణుడు, సౌమిత్రిని పిలిచి "సౌమిత్రీ! సరిగాచూడు. వాడే మాయావి ఇంద్రజిత్తు. హనుమతో పోరుతున్నాడు. వెంటనే నీవు సమీపించి శితశిలీముఖాలతో శరీరం చీల్చు" మని చూపించాడు.

## సౌమిత్రికి ఇంద్రజిత్ హోమంచేసే మర్రిని విభీషణుడు చూపుట

లక్ష్మణుడు విభీషణుడు చూపించినవైపు పరీక్షగా చూశాడు. కాని లక్ష్యానికి అందలేదు. అదిగమనించి అసురేశుని తమ్ముడు వెంటపెట్టుకుని దగ్గరలోవున్న వనంలో ప్రవేశించి "సౌమిత్రీ! ఇప్పుడు స్పష్టంగాచూడు.

జలధరసదృశంగా కనిపిస్తున్నదే అదే రావణి హోమంచేసే న్యగ్రోధం. ఇక్కడవాడు భూతబలులిస్తాడు. సమంత్రంగా అగ్నిదేవుణ్ని అర్చించి శరపత్రమధ్యంలో నల్లమేకను బలిఇచ్చిహుతంచేస్తాడు. తర్వాత తనరథాన్నీ గుర్రాలనూ, అస్త్రశస్త్రాలు అందులో వ్రేలుస్తాడు. అప్పుడు అగ్నిసంతసించి, ప్రదక్షిణంగా జ్వాలలు పరగించి స్వయంగా హవిస్సు గ్రహించి అంతర్థానమై అభేద్యమైన దివ్యశరశరాసన హయరథాలు ప్రసాదిస్తాడు. అవి గ్రహించి అదృశ్యరూపంతో యుద్ధం చేస్తాడు. ఆ సమయంలో వాడిచే చావలసిందేకాని, వాణ్ణిమాత్రం ఎవరూ చంపలేరు. ఆమాయాబలంతో వాడు కొందరిని చంపుతాడు. కొందరిని బంధింపుతాడు. కొందరిని చిత్రవధ చేస్తాడు. వాడి సంకల్పానికి వికల్పం అంటూ అప్పుడుండదు. హనుమనెట్లో కనుబ్రామి మళ్ళీ మర్రి వద్దకు వస్తాడు. వాడిక్కడికి రాకముందే నీవు రథాశ్వసారథి యుక్తంగా చంపాలె. ఏమరుపాటువద్దు. లేకోయి వాడు నీచే చావటం తథ్యం. యజ్ఞమధ్యంలో లేచివచ్చాడు. యజ్ఞదీక్ష భంగమైంది. అది నీచేతనే జరిగింది కనుక నీచేతనే చస్తాడు. ఊఁ త్వరగా-త్వరగా-సంధించుశరం. మ్రోగించుగుణం!" అంటూ ప్రోత్సాహపరిచాడు. లక్ష్మణుడు తత్‌క్షణం కోదండ గుణాన్ని జగద్విలయంగా మీటాడు. ఆధ్వని విని అసురపతిసుతుడు హోమ ప్రదేశానికీ, తనకూ మధ్య నిల్చిన పగగొన్న శేషాహి సౌమిత్రిని చూచాడు. ఆతని ప్రక్కనున్న పినతండ్రిని కూడా అప్పుడే చూచాడు. ఇంతలో లక్ష్మణుడు "క్రూరకర్ముడా! రావణీ! నీకోసం వెదకుకుంటూ వచ్చాను. నీ దురదృష్టంవల్ల దృష్టిపథంలో నిల్చావు. నాకు రణాతిథేయం ఇవ్వు. నీమాయకు ఇక స్వస్తిచెప్పి నిల్చి యుద్ధం సాగించు. నీరోజులు చేరువైనై. దుర్మార్గం ఎంతకాలం చలామణి అవుతుంది? పాపకార్యాలవల్ల కలసి వచ్చే ఫలం, తాటాకులమంట వంటిది. నీచుడా! నిలుచో. ముందుకురావే"వని బాణపోట్లులాగా సూటిమాటలన్నాడు. రావణి రూపం దాల్చిన కోపంగా మారాడు.

## ఇంద్రజి విభీషణుని నిందించుట

"ఓ కృతఘ్నుడా! ఎక్కడపుట్టావు? ఎక్కడపెరిగావు? నాతండ్రికి సాక్షాత్తు తమ్ముడవు. ప్రత్యక్ష ద్రోహం తనయునిపట్ల ఎందుకు తలచావు?

నీదేం జన్మం? పుట్టియున్న భావం నీవు శూన్యం. స్వజాత్యభిమానం గగన కుసుమం. స్నేహభావం కుందేటికొమ్ము. ప్రమాణబుద్ధి మేడిపువ్వు. ధర్మ చింతనం తెల్లనికాకి. దుష్టబుద్ధీ! నీవు నాతండ్రితోబుట్టువనికూడ తోచలేదా? అయినవాళ్ళను వదలి కానివాళ్ళ కాళ్ళుపిసితే నిన్నుచూచి నామనస్సు ఖేద పడుతున్నది. ఎక్కడిది లంకావాసం? ఎక్కడ నరవానరసేన? అయ్యయ్యో! నీమాత్రం భేదంకూడా తెలియలేదా? చదివావు శాస్త్రాలన్నీ. ఎందుకు కాల్చనా? నీమలిన బుద్ధిపరత ఎందుకుంటుంది? తనవైన వాళ్ళు గుణహీన లైనా, పరులు గుణవంతులే అయినా, బుద్ధికలవాడికి తన వాళ్ళే కావలసిన వాళ్ళు. పరులెప్పుడూ పరులే. ఇంతమాత్రంకూడా ఎరగవా? ఓరికులద్రోహీ! ఆత్మీయుల నాశంకోరి ఇతరుల చేరే మూర్ఖుడు కాలగతిలో తానూ వాళ్ళచేతనే చెడతాడని ఎందుకు తలచవు? దయాదాక్షిణ్యాలు విడిచిపెట్టావు. బరితెగించావు. ఇంత కులక్షయ కార్యానికి నీవు గాక ఎవరు దిగుతారు? తల్లి కడుపు చెడ బుట్టావు. నీ ముఖంచూస్తేనే నిరయం వస్తుంది. నా వంటివాడు నీ కొడుకైతే ఈ పాడుపని చేయగలవా? తుమ్మకొమ్మ గొడ్డలితోకూడి స్వజాతి నాశ నానికి తోడ్పడినట్లు నీవు శత్రువుల పంచచేరి నీ ఆత్మీయుల మర్మాలు తెలిపి కులనాశనం చేస్తున్నావు. ఈ సారి నిన్ను మాత్రం బ్రతకనిస్తానా?" అని ఇంద్రజిత్తు విభీషణుని తూలనాడాడు. ప్రక్కనున్న సౌమిత్రి సంక్షుభిత సాగరంవలె కోపంతో చాపమెత్తాడు.

## విభీషణుడు ఇంద్రజిత్తుకు ప్రత్యుత్తర మిచ్చుట

తారతమ్యం లేకుండా పినతండ్రిని రావణి దుర్భాషలాడుతుంటే సౌమిత్రి చాపం సజ్యం చేశాడు. విభీషణుడు సుమిత్రానందనుణ్ణి ఆపి, "రావణ పుత్రా! నయవంచకా! విపక్షజ్ఞాన విమూఢచేతస్కా! ఏం ప్రేలుతున్నావు? ఈనాటితో నీ చావు తథ్యమని తలచి అందరు నిందనాపై ఆరోపించి పలికావు. పుట్టినప్పటి నుంచి నా శీలం ఎటువంటిదో నీ తండ్రికి తెలుసు. ఆపై నీకూ తెలుసు. జన్మించింది క్రూర రాక్షసకులమైనా గుణం చేత రాక్షసుణ్ణి కానే? చిన్నప్పటినుంచీ దారుణ కర్మలు నాకు రుచించవు. నేను వంశద్రోహినీ, కులనాశకుడనని నిందించావు. అందుకు కారణం ముందు నీ తండ్రి. తర్వాత నీవు. ఆనాడు సభలో యుద్ధం వద్దని చెప్పాను. రాముడు

సత్య పరాక్రముడని చెప్పాను. సీత సామాన్య స్త్రీ కాదని చెప్పాను. ఆమెను రామునకిచ్చి సంధిచేసుకోమని చెప్పాను. యుద్ధం కులక్షయానికి కారణమని చెప్పాను. నీవు నీ తండ్రిని సమర్థించావు. అతను నన్ను నిష్కారణంగా అవమానించి దాయాదివని వెళ్లగొట్టాడు. లోగడ మీరు దుష్టకార్యాలు చేస్తుంటే నేను కల్పించుకున్నానా? పగవాళ్లతో చేతులు కలిపానా? మీ కర్మానికి మిమ్మల్ని వదిలాను. అయినవాళ్లని నీచంగా చూచి పరాభవిస్తే, వెళ్లిపొమ్మంటే ఎందుకు వాళ్లను ఆశ్రయించుకుని బ్రతకాలి? అప్పుడులేని బంధుప్రీతి అవసానకాలంలో వచ్చింది కాబోలు! ధర్మహీనుణ్ణి, కలుషచిత్తుణ్ణి కరగత సర్పాన్ని విడనాడినట్లు బుద్ధిమంతుడు విడిచి శర్మాన్ని పొందుతాడు. పరధన పరదారాపహరణాలు, మిత్రజన సంశయాలు మూడున్నూ వినాశహేతువులని నీచుడా! నీకు మాత్రం తెలియదా? మహర్షుల హింసించావు. దేవతలతో ఎడతెగని పోరుచేశావు. అసూయా, గర్వం, పరద్రోహమూ సహనం సంపన్నాశన కారణాలని పెద్దలు చెప్పలేదా? అయినా అన్నీ సహించాను. అన్నను దైవంగా ఆరాధించాను. నీ తండ్రి సుగుణాలను ఈ దుర్గుణాల పర్వతాన్ని మేఘంవలె కప్పుకొన్నై. ఏమొగంతో నన్ను నిందిస్తున్నావు? మీ చేతులతో చరిత్రను మీ కంఠాలను బిగించుకున్నారు. ఇక లంకలేదు. నీవులేవు. నీ తండ్రిలేడు. నీకు నేటితో ఆయుః పరిపూర్తి అయింది. వ్యర్థ భాషణాలెందుకు? అతి మానివి. బాలుడవు. మతిహీనుడివి. మానవ మర్యాదలు తెలియని పరమ మూర్ఖుడివి. యమపాశ బద్ధుడివి. నీకు తోచినట్లు ప్రేలు. ఆరిపోయేదీపం గప్పుమన్నట్లు, అవసాన కాలంలో సంధిలక్షణాలున్నట్లు, నీ దుర్భాషలు సరిపెట్టుకున్నాను. ఎంత తిట్టినా, ఏడ్చినా మళ్ళీ మిత్రిని చేరలేవు. నీ యజ్ఞం ధ్వంసమైంది. దానితో నీ చావు సంసిద్ధంగా వుంది. నీ ఎదుట వుంది లోకోత్తర మానవ రూపధారి లక్ష్మణుడు. నిన్ను చంపక మరల అన్నను చూడను. నీవు సహజ శక్తులతో తలపడవలసిందే. కూట యుద్ధం కొనసాగించలేవు. చేస్తూ మానిన యజ్ఞం చస్తూనే పోయి యమలోకంలో పూర్తిచేయి. వానర శ్రేష్ఠులూ, దాశరథులూ కనుపిస్తూ కయ్యంచేసి చావక బ్రతకటం నీకు కాదు నీ తండ్రికి కూడా సాధ్యంకాదు" అని సమాధానం చెప్పాడు.

# రావణ సౌమిత్రుల సంభాషణం

ఆగ్రహావేశపరుడైన హనుమ అంతలో లక్ష్మణుని చేరవచ్చాడు. "మహాత్మా! ఇక ఇంద్రజిత్తు మరణించటం తప్ప మళ్ళీ మర్రి చేరలేదు. సంగ్రామం తీవ్రంగా సాగుతుంది. వాడు రథస్థుడు. సమానంగా యుద్ధకర్మ జరగాలి. నీవు నా భుజస్కంధంపై ఆరోహించు. వాని రథం, హయాలు, సారథి దివ్యాలు కావు. కనుక నీవే పాదచారుడవు కావటం న్యాయం. నన్ను వాడేమీ చేయలేడు. వాని అస్త్ర శస్త్రాలు నాపట్ల వ్యర్థం. నన్ను నేను కాపాడుకుంటాను. నీవు మాత్రం వాని మరణంతో కాని యుద్ధం విరమించవద్దు" అని సగౌరవంగా ప్రభుమిత్రుని భుజంపై ఎక్కించుకున్నాడు. ఇంద్రుని జయించిన పరాక్రమవంతుడు రావణి పినతండ్రి మాటలకు నిరుత్తరుడైనాడు. "శేషం కోపేన పూరయేత్" అన్నట్లు రోషభరితుడై, దుష్టహృదయుడై, ఉగ్రుడై, ప్రళయాంతకునివలె భయంకర చాపమెత్తి, కరకటంకరాంతులు చిమ్ము తుండగా, ఉదయ భాస్కరునివలె ప్రకాశిస్తూ, హనుమ మూపునైన ఆసీనుడై యున్న శత్రుహింస సమర్థుడగు సౌమిత్రిని చూచి "మానవా! నీవు, నేను మింటనుంచి సంధించే శరవృష్టి ఎలా తప్పించుకుంటావు? దూదిని అగ్ని దహించినట్లు, నిన్నూ, నీ బలాన్నీ దహిస్తాను. క్షణాలలో యమసద నానికి అతిథులవుతారు. మీలో నన్నావే నిలువలేదని ఇదివరకే నిరూపించాను. నీవు బహుశా మరచిపోయావు. నా నాగాస్త్ర బంధితుడవై అల్ప ప్రాణంతో పలాయనం చేయటం? స్మృతిలో వుంటే చావుకోరే వచ్చావా? లేక యమ. కాలభుజంగంతో ఆటలాడ వచ్చావా? ఎంత అమాయకుడవు!" అని సౌమిత్రిని ఆక్షేపించాడు. లక్ష్మణుడు చిన్నగా నవ్వి "ఆగరా! వికత్థనాలు ఎవరికీ ప్రీతికావు. ఇంతవరకు జరిగిన యుద్ధంలో నీవు మాయలోగాక నిలిచి ఎవరితో యుద్ధంచేశావోచెప్పు? నా అన్న అనుమతించడు. నీ మాయయుద్ధాలు ఇప్పుడిక్కడ నీ ఎదుటగా వున్న ఇద్దరినీ బంధించలేవు. మేం నీ బ్రహ్మాస్త్రానికి బద్ధులవటం పరమేష్ఠిపైగల భక్తికారణం కాని, నీ ప్రయోజకత్వానికి కాదు. ఇప్పుడు ప్రయోగించు. నీకే తెలుస్తుంది. పరమపూజ్యుడైన పినతండ్రిని నిందించావు. అతని దోషమేమి చూచి దూషించావు? రాజనీతి తెలిసిన ప్రాజ్ఞ లెవరూ రణం వాటిల్లనుందని వస్తే, ధర్మాచరణపరత శత్రువుకు జయించే

మార్గం చూస్తారు; కాని, మీలాగా ఆత్మీయుల్ని, అంతరంగికుల్ని అవమానించి వెళ్ళగొడతారా? అవమానింపబడ్డవాడు ప్రతీకారం చింతించడా? అందులో తప్పేముంది? అప్పుడు నీ తలకు ఈయనవే ప్రమాదం వస్తుందని తోచలేదా? అహంకారివి. ఆత్మశ్లాఘపరాయణుడవు. నీ శక్తిపై మితిమీరిన విశ్వాసంతో తండ్రిని సమర్థించావు. ఇప్పుడు విచారిస్తే ఏంఫలం? ఏవేవో ప్రగల్భాలు పలికావు. ఎవరు విని సంతోషిస్తారని? ఆ రాత్రి మాకు కనుపించకుండా మాయతో మమ్మల్ని బాధించి బంధించావు. అప్పుడుకూడ నా అన్న నన్ను ఒప్పుకోమన్నాడు. కనుక బ్రతికిపోయావు. ఇప్పుడు నాకు సంపూర్ణ స్వేచ్ఛ ఇచ్చి దీవించి అన్న పంపాడు. ఇక ఇప్పుడు నీ ప్రతాపం చూపు. చూడాలనే నేనూ వచ్చాను. నీవేత పరాభూతుడనైనానని ఆక్షేపించావు. నీ నాగపాశాలు సురాసురులకు సడలింప సాధ్యం కాదనే గర్వం ఇప్పుడేమైంది? మాకట్లు మేమే విప్పుకున్నాం కదా? ఇది తెలిసి ఇంకా ప్రేలుతావెందుకు? దొంగగా పోరాడే నీవూ శూరుడవేనా? పెద్ద మాటలతో పనేముంది? నీ శరలక్ష్యంలో నిలిచివున్నాను. నీ పూర్వ శక్తులన్నీ ప్రదర్శించి నన్నేం చేస్తావో చేయి. నేనుకూడ నీవెంత విలుకాడవో చూస్తాను. వ్యర్థ ప్రసంగం మాని కార్యరంగంలోకి దిగు" అని ఆశరపతిసుతుని ఉన్మత్త వాక్యాలతో అధిక్షేపించాడు.

## ఇంద్రజిల్లక్ష్మణుల యుద్ధం ప్రారంభం

లక్ష్మణుని ప్రతివాక్యం రావణి పౌరుషాన్ని రెచ్చకొట్టింది. కోపఘూర్ణితనేత్రద్వయుడై, నిశితాశుగాలను పెక్కింటిని ఎడతెరిపిలేకుండా అద్భుతంగా ప్రయోగించాడు. అతడు వైచిన శరప్రకరంచే ధూమంలేని వహ్నివలె సౌమిత్రి ప్రకాశించాడు. అతని అస్త్రలాఘవం పరికిస్తూ ప్రతిక్రియ మానుకున్నాడు. దానితో దానవుడు పొంగిపోయి "మానవా! నీ గర్వం దించాను కదా? ఇకనైనా తెలివితెచ్చుకో"మని ఆకాశం బ్రద్దలయ్యేలాగా అర్భటించాడు. "మానిత మద్ధనుర్గళితమార్గణకుండలి మండలం నీ ప్రాణసమీరణాన్ని ఇప్పుడే ఆహరిస్తుంది. నక్కలు, డేగలు, గ్రద్దలు, గుంపులుగా వ్రాలి నేల దొరగిన నీ కళేబరాన్ని ముక్కలు పొడుస్తూ, పరస్పరం కలహిస్తూ భక్షించుగాక. కవచం ముక్కలై, ధనుఃఖండితమై, పరిహృతశీర్షమై,

ఖండనంలో చాకచక్యం ఒండొరులు ప్రదర్శించారు. పరస్పరం బాణవర్షంలో స్నాతులై చూపరులకు ప్రీతిపాత్రులవుతున్నారు. భయం కల్పిస్తున్నారు. వేసే బాణం వేస్తుంటే విరిగిపోయే బాణం విరిగి పోతుంటే, ఒకడు వేసే లోపల ఇంకొకడు బాణాలతో బాధిస్తూంటే, జయ నిర్ణయం దివ్యులకేనాక నిర్ఘాంతపడి చూస్తున్నారు. వాసవ శంబర యుద్ధం పునరావృతమైనట్లున్నది వారి పోరాటం. "భవిష్యత్కార్యక్రమం వారిపైనే ఆధారపడి వున్నదా?" అన్నట్లు ద్విగుణితోత్సాహంతో, తెంపూ పెంపూ చూపించారు.

## ఇంద్రజి సౌమిత్రి శరాలచే నొచ్చుట

సమరం సాగుతున్నకొద్దీ పట్టుదల పరాంకోటిని చేరుకోసాగింది. సౌమిత్రి శ్రవణావతంసంగా మౌర్వీలాగి అమోఘనారాచాన్ని శత్రువుపై వదిలాడు. అది భూమ్యాకాశాలను కంపింపచేస్తూ వచ్చి లక్ష్యాన్ని తాకింది. ఆగుణటంకారా కర్ణనంతో దండివిలుకాడైన రావణి బెండువడైనాడు. మోములో తేజం సురిగిపోయింది. వెంటనే వెల్లనై వికృతి పొందింది. భీత చిత్తంతో రామానుజుని వదనం వంక చూచాడు. ఆ వచ్చిన అవకాశం గమనించి విభీషణుడు సౌమిత్రి వద్దకు వచ్చాడు. "సుమిత్రానందనా! ఊర్మిళాహృదయేశా! రామానుజా! జయం మందే. ఇప్పటి వాడి లక్షణం గమనిస్తే త్వరలోనే గత ప్రాణుడవుతాడని తేలింది. సంకోచించవద్దు. సడలకుండా సమరం సాగించు. ఊఁ!త్వరపడు"మంటూ హెచ్చరించాడు. ఆ యనఘుని ప్రోద్బలంతో శతగుణిత శక్తిమంతుడై, అగ్నిశిఖలకు అనుగు తోబుట్టువులైన అంపగముల పాములు పుట్టల్లో దూరినట్లు అతని శరీరంలో దూరనేశాడు. వజ్రసదృశమైన సౌమిత్రి వాడిములుకుల వేడిమికి వ్యాకుల సర్వేంద్రియుడై, వ్యధాకుంఠిత భవత్కార్యుడై శక్తి తూలి, కొంతసేపటికి తెప్పరించుకుని, నిష్కంపంగా, నిర్లక్ష్యంగా, నిరుపమాన తేజోవిరాజితంగా ఎదుర నిల్చిన లక్ష్మణుని గాంచి, "ఓ దురభిమానమానవా! తొలినాటి యుద్ధంలో చొప్పదంట్లవలె మీ భ్రాతల నాగపాశంతో బంధించి దుమ్ములో దొరలాడించిన నన్ను ఇంతలోనే మరచావా? తెలిసే మరణించవచ్చావా? ఒకవేళ ఆనాటి యుద్ధంలో నా శక్తి పూర్తిగా నీకు తెలియకపోతే ఈనాడు నీకు తెలిపి మరీవధిస్తాను" అని శరసప్తకంతో లక్ష్మణునీ, పదింట హనుమం

డనీ, నూరింట విభీషణునీ కొట్టాడు. ఆ బాణాలను గడ్డిపోచకిచ్చే గౌరవం కూడా ఇవ్వక మందహాసం చేస్తూ, "వాగ్బలం చూపిన వైరిశ్రేష్ఠా! ఇవి ఏం శరాలు? ఈ ఆయుధాల ఆసరా చూసుకొనేనా అంత వాగ్బలం చేశావు? పరులను జయించాలన్న పట్టుదలకలవారు ప్రాకృతులపై వేసే బాణాలు ఎదిరించి నిల్చినవారిపై వేస్తారా? అందులో హనుమద్విభీషణ సౌమిత్రులపైనా? ఈ శరాలకు పక్షులుకూడా చావవు. భయంకరులైన ప్రత్యర్థులు చస్తారా? ఇంతేనా? ఇంకేమైనా చేస్తావా? నీ శిలీముఖాలు శరీరం తాకుతుంటే చీమకుట్టినట్లయినా లేదు. ఎటువంటి బాణాలు వేయాలో చూపిస్తా" నంటూ సౌమిత్రి శరద్వయంతో హేమ కవచాన్ని బ్రద్దలు కొట్టాడు. ఆ ఖండిత కవచఖండాలు మింటినుంచి తారకలు రాలినట్లు రథంపైబడి అక్కడనుంచి భూమిపైపడి దుమ్ములోపడి కలిసిపోయినై. "ఇంద్రజీ! ఇది మాయాసమరం కాదు. ప్రత్యక్ష సమరం. చాటున నిల్చి శక్తిహీనుడుకూడా బలవంతుణ్ణి బాధించవచ్చు"ని పరిహసించాడు సౌమిత్రి.

## ఇంద్రజిల్లక్ష్మణులు ఘోరంగా పోరుట

తనుత్రం త్రుంచి తన్నుపహసించి నవ్వుతున్న లక్ష్మణుని కొరకొర చూస్తూ రావణి ప్రతిరోని మార్గణాలను ప్రతిపక్షిపై ప్రయోగించాడు. సౌమిత్రి అలవోకగా వాటినన్నింటినీ ఖండించి యమపాశసదృశాలైన ఇషీకాలను తనువు గాడిపారగావేశాడు. అస్త్రవిద్యా మర్మజ్ఞుడైన రావణి అన్నింటినీ ప్రతిహతం చేసి విజృంభించాడు. పరసహస్రంగా భయంకర నారాచాలను సౌమిత్రి ప్రయోగించి ప్రతిఘటించి నిల్చాడు. ఈ విధంగా సమ సమరం కొంతకాలం సాగింది. ఆ పోరులో అన్యోన్యాస్త్రదారిత సర్వాంగులై నెత్తురుకారుస్తూ, బాధను ఓరుస్తూ, జయవాంఛతో బహుకాలం సమరం సలిపారు. ఒకప్రక్క ఊటకాల్వలవలె శరీరంనుంచి నెత్తురు ఓడికలు కట్టుతున్నా, ఇంకోప్రక్క తీవ్ర శరాలు నూతనంగా గాయాలు కలిగించి బాధ రేపుతున్నా, తెగపడి ఆకాశాన్ని అంబుదాలు ఆవరించినట్లు శరాలతో ఒకరినొకరు ఆవరిస్తూ శౌర్యధైర్యాల్లో తుల్యులై క్షణక్షణ ప్రమాదప్రదంగా దానవమానవ పుంగవులు దారుణ యుద్ధం చేశారు. ఉభయులు వేసే అస్త్రాలు రోదసికానరాకుండా కప్పుగా ఏర్పడుతున్నై. విరిగిన బాణాలు మేట్లుమేట్లుగా

ప్రోగుపడుతున్నై. సడలని శరసంధానంతో, ఎడని విశిష్ట పరాక్రమంతో, తెంపులేనిలాఘవంతో, ఇంపుగూర్చే ధనుర్విద్యా విలాసంతో, పోరిపోని రోషంతో, వజ్రఘోషంలాగా, జలపాత ధ్వనిలాగా, మేఘగర్జనంలాగా, జ్యాటంకృతులు ధ్వనించగా పోరాడారు. పరస్పర గర్జలతో, పరస్పర శరసంఘర్షలతో, పరస్పర చాపోట్వటంకారంతో, ఖండితశరపాతంతో కలిగే రావం బధిరతా పాదకంగా, రక్త సిక్త దేహాలతో పుష్పితాశోకతరువుల్లాగా పొలుపొందారు. ధనుర్ముక్తమై వచ్చే బాణాలు కొన్ని గర్భంలో దూరి వెన్నున వెలికివచ్చి నేలలో దూరాయి. కొన్ని మధ్యలోనే తునిగిపోయాయి. కొన్ని ప్రతిపక్షి శరాలను పొట్టపెట్టుకున్నై. బాణకాంతులు అగ్ని ద్వయం లాగా, బాహుసంపద, దర్భల్లాగా, దాశకంఠి దాశరథుల సమరయజ్ఞం సాగింది. ఆ క్రతువు దేవదానవ మానవామోదంగా జరిగింది. ఒక్క ఆకైనలేకుండా పూలుమాత్రమే కలిగిన రక్తాశోకద్వయంలాగా, బూరుగుచెట్ల జంటలాగా, పరస్పరజిగీష పరాంకోటినందుకొనగా ఇద్దరు బహుకాలం యుద్ధం చేశారు. ఆ ద్వంద్వయుద్ధంలో సంగర పరిశ్రముడైన శక్రజిత్తు పొంగు భంగింపగా, అపరాజిత విక్రముడైన సౌమిత్రి విజయం పొందగా కనురెప్పవేయకుండా కలహాన్ని గమనిస్తూ విభీషణుడు రామానుజుని కనుసన్నల్లోనే మెదలుతున్నాడు.

## విభీషణుడు కపులను ప్రోత్సాహపరచుట

అన్యోన్య ప్రతిఘాత నైపుణులైన రావణి సుమిత్రానందనులు ఘీంకరిస్తూ తలపడే దంతావళద్వయంలాగా సంకీక పోరుతుంటే, సౌమిత్రి చొరవ తీసుకుని శితధారా ఘోరనారాచాలను శత్రువుపై సంధించాడు. విభీషణుడు తన సహజ శాంత గంభీర ముద్రతో సచివులతో కపులను నక్తంచర సేనపై నడిపి నేలకు కోలకు తెస్తున్నాడు. ఏనుగుల మధ్యనున్న మదగజంలాగా ఇంద్రజిల్లక్ష్మణుల పోరు గమనిస్తూ కపులను లక్షించి "కీశనాయకులారా! వైరితూల వాతూలులారా! దశకంఠునికి ఊతమూ, ఇతనితో వచ్చిన సైన్యం మాత్రమే శేషం. వీడు మరణిస్తే, సైన్యం తనంతతానే చస్తుంది. లంకేశ్వరు డొక్కడే మిగులుతాడు. మనకు యుద్ధం ముందు తేలికగా సాగుతుంది. ఈ వంచకుడు లక్ష్మణుని దాటి రాలేడు. వీడు లేకుండా రాక్షసులు మిమ్మేం

చేయలేరు. చచ్చిన వాళ్ళకంటే వీళ్ళేమీ అధికులు కారు. మీ మీ శౌర్య సంపద వెదజల్లి శత్రు సైన్యాన్ని మట్టుపెట్టండి. కుంభకర్ణ కుంభ నికుంభ ప్రహస్త సుప్తఘ్న ధూమ్రాక్ష వికట సంహ్రాది దుర్ధర జంబుమాలి వజ్రదంష్ట్ర మహామాలి తపన దమయజ్ఞ కోప ప్రఘసాశని ప్రథ ప్రఘస రశ్మికేతు జంఘ ప్రజంఘులు, అగ్నికేతుడు, అర్క శత్రుడు, చక్రమాలి, కంపనుడు, ద్విజిహ్వుడు, అకంపనుడు, తీక్ష్ణవేగుడు, సుపార్శ్వుడు, ధీర నిఘ్నుడు, దేవాంతకుడు, నరాంతకుడు, మీచే హతులైనారు. ఈ సేనగాని, ఇతడు కాని మీకేం లెక్క? అనాయాసంగా లోక సంత్రాసకరులైన మహా వీరుల మట్టిపాలు చేసిన మీకు వీడు ఏపాటి? సముద్రం ఈదిన మీకు గోష్పదం అగుతుందా? చిర కీర్తి సంపాదించండి. రాముడను నమ్మిన బంట్లు వానరులన్న ప్రథ విశ్వంలో నిలిచేట్లు ప్రవర్తించండి. మీరు చేయవలసిన కార్యం రాక్షస సైన్యనాశం ఒక్కటే. నా అన్న కొడుకును నేను స్వయంగా చంపటం యుక్తం కాదు. ఐనా, రామ కార్యార్థం దయమాలి వధించవచ్చు. దోషం ఏమాత్రం లేదు. కాని, పుత్రవాత్సల్యంతో నా కళ్ళు దుఃఖ బాష్పాలతో నిండి దృష్టి హరిస్తున్నై. పిట్టి రామానుజుడే చంపుగాక. మీరు నిర్వ్యాపారులుగా ఎందుకుండాలె? రావణి సైన్యాన్ని రణభూమికి బలిచేయండి" అని ఉత్సాహ వాక్యాలు పల్కి ఉసికొల్పాడు. ద్వంద్వ యుద్ధం చూస్తూ నిల్చిన అగచర వాహిని నిశాచర నిమ్నభూమిపై పరవళ్ళు త్రొక్కుతూ ప్రవహించింది. జలధరాన్ని చూచి మయూరాలు క్రేంకృతులతో నాట్యం చేసినట్లు రక్షస్సైన్యాన్ని చూచి వానరసైన్యం గర్జిస్తూ సమరం సాగించింది. ఇంతలో జాంబవంతుడు తన భల్లూక వరూథినితో నిశాటుల తాకాడు. వాళ్ళ లెక్క చేయకుండా ఉక్కుమిగిలి వానరుల డొక్కలు శస్త్రాలతో చీలుస్తూ ఎదురు దాడి చేశారు. భల్లూక సైన్యం వైరి బాణాలను ఒడిసిపట్టి చేతులతోనూ, పండ్లతోనూ విరిచివేస్తూ, పైబడి గోళ్ళతో రక్కుతూ, పళ్ళతో కొరుకుతూ, మోచేతులతో పొడుస్తూ, శరాలు తాకకుండా మీదికి ఎగురుతూ, నేలను వంగుతూ వింత యుద్ధం చేస్తుంటే దేవతలు తెల్లబోయి చూస్తున్నారు. రక్కసులు అవి ఆడుతున్నవో, ఆహవం చేస్తున్నవో గుర్తించలేక నివ్వెరపోతున్నారు. హనుమ కూడా సౌమిత్రికి అడ్డంలేకుండా, లక్ష్య భంగం కాకుండా పెనువృక్షంతో పెట్టుక వందలు వేలుగా యమసదన సంపర్క

సార్థం మహోత్సాహులను మాటామాత్రే సద్దుతున్నారు. తన్నుతాకిన పిన తండ్రిని నిలువరిస్తూ, లక్ష్మణుని శరాలు ఖండిస్తూ ఇంద్రజిత్తు మెరపు యుద్ధం చేస్తుంటే, పావని యుద్ధంమాని లక్ష్మణునికి వీలుగా నడవసాగాడు.

## రావణి రామానుజులు రెండోసారి తీవ్రంగా పోరుట

వర్ష ఋతువులో నీరదాల సంచారానికి సూర్యచంద్రులు కనుమరుగైన విధంగా ఆ వీర యుగళం పోరుతూంటే శరాసారంలో మరుగైపోయింది. దొనలనుంచి శరాలు తీయటం, ధనువున కూర్చటం, లాగటం, వేయటం, చేతులుమార్చటం,లక్ష్యాన్ని చూడటం, దూరం తప్పుకోవటం, దగ్గరకు రావటం తెలియబడకుండా లాఘవం చూపించారు. శరాలు చాపనిర్ముక్తాలవుతుంటే ఇతరం ఏమీ కనిపించటంలేదు. ఎటు చూచినా, వచ్చే బాణాలు, విరిగే బాణాలు, ఘర్షించే బాణాలు, తనువులతాకే బాణాలు తప్ప, ప్రయోక్తలు మాత్రం దృష్టిగోచరం కావటంలేదు. పరస్పరం ప్రయోగించే బాణాలు భూమ్యంతరిక్షాల నడుమ పందిరివలె ఏర్పడి క్షితితలాన్ని చీకటిలో ముంచుతున్నై. వాళ్ళ బాణ వేగాలు, వాళ్ళ శౌర్య విజృంభణలు, వాళ్ళ హస్త లాఘవాలు, వాళ్ళ తెంపు, వాళ్ళ పెంపు, వాళ్ళ సొంపు పైనుంచి చూస్తున్న మునీంద్రామరులకు జయాన్నిగూర్చి "ఇదమిత్థం" అని తేల్చ శక్తిపోయి కళ్ళప్పగించి చూడటమే సాధ్యమైంది. అనిమిష శబ్దం ఇప్పుడు సార్థకమైందని అనుకోవటం తృప్తి కూర్చింది. సూర్య ప్రకాశం లేనిచోట్ల బాణప్రసరం చేత దృగ్భీకరంగా సంతమసం వ్యాపించింది. నెత్తురు కాల్వలై పారింది. క్రవ్యాద సంతోష గర్జలు నిండినై. అనలుడు వెలుగలేదు. అనిలుడు వీవ లేడు. మహర్షులు ఎలుగెత్తి "స్వస్తిలోకేభ్యః" అని ఆశీర్వదిస్తున్నారు. యుద్ధంచూస్తున్న ఖేచరబృందం సహచారిణులతో దూరంగాపోయి చూస్తూంది. జగద్భీకరంగా సాగుతున్న ద్వంద్వ సమరంలో సుకృతహస్తుడైన శూరుడు సౌమిత్రి అసురశేఖరుని హాటకాలంకృత నీల సైంధవ చతుష్టయాన్ని శర చతుష్కంతో శక్తి హరించాడు.

## సౌమిత్రి ఇంద్రజిత్తు సారథిని చంపుట

వేడిమికి పిడుగుకుతోడై, వాడి మిగిలిన రెక్కల బాణంతో వాడిమగడైన ఇంద్రజిత్సూతుణ్ణి శిరచ్ఛేదంచేసి క్షితిపై కూల్చాడు. వెనువెంటనే శత్రువు

చేతిలోని చాపాన్ని నరికాడు. సారథి మరణించటం, ధనువు విరగటం ఒక్కసారే జరిగినా ఆ వీరుడు ఎదమియలేదు. తానే రథం తోలుతూ, వేరే చాపం ధరించి వైరిపీడనం సలుపసాగాడు. రథిసారథిగా రణం సాగిస్తున్న రావణినైపుణ్యానికి అందరూ మెచ్చి శ్లాఘించారు. రావణి రథం తోలుతున్న సమయంలో హస్తంలోని వింటిని సౌమిత్రి నరికాడు. మళ్ళీ చాపం గ్రహించేలోపల గుర్రాలను బాధించాడు. ఇంతచేసినా ఇంద్రజిత్తు యుద్ధ విముఖుడుకాలేదు. సారథికై చింతిస్తూ, ఆతడు లేనిలోటు తీరుస్తూ, బహుముఖంగా తలపడుతున్న వైరుల భంగిస్తూ, క్షణం విరామం కొనకుండా చాకచక్యంతో శరాసారం వర్షిస్తుంటే ఆకాశచరులు, అగచరులుకూడా ఆతని పరాక్రమాన్ని అగ్గించకుండా ఉండలేకపోయారు. శత్రువులవత్తిడి అధికమైన కొద్ది రెండు కార్యాలు సమంగా సాధించటం కష్టమైపోయింది. సారథిపోవటం దక్షిణ బాహువు విరిగినట్లయింది. మానసిక క్షోభతో వదనం విషణ్ణమైంది. ఆతని వెల్లపాటుగాంచి శాఖాచరులు రామానుజుని అభినందించారు. కాని, వాళ్ళ సంతోషం ఎంతోకాలం నిలువలేదు. పలల ప్రదేశంలో బోరగలు ప్రవాలినట్లు ఇంద్రజి చాపంనుంచి అసంఖ్యాకంగా బాణాలు తనువులపై ప్రవాలి రక్తంతో క్రీడ సలిపినై. ఇప్పుడు ఇంద్రజి రథిగానే వ్యవహరిస్తున్నాడు. గుర్రాలు సారథిలేక యజమాని ఇబ్బందిపడుతుండటం గుర్తించి, తమ తమ శక్తుల కూడ తీసుకుని భూమికి అంటకుండా తామే రథాన్ని నడుపుతున్నై. వాటి చంక్రమణంలో లక్ష్మణుని లక్ష్యాలు నిలవటంలేదు. రావణి విశృంఖల విహారం చేస్తున్నాడు. ఇది గమనిస్తున్న వానర నాయకులైన శరభ గంధమాదన రభస ప్రమాథులు నలుగురు సాహసంతో రథంపైకి రివ్వునదూకి హయాల నాలిగింటినీ చంపారు. రథాన్ని పొడిపొడిగా బద్దలుకొట్టారు. రెప్పపాటులోవచ్చి తోడివారుమెచ్చుకొనగా లక్ష్మణుని చెంతకువచ్చి నిల్చారు. హతతురంగుడు, హతసారథియైన ఇంద్రజిత్తు ధనువుగొని ధరణిపైనిల్చి ఎదిరించాడు. లక్ష్మణుడు క్రూరనారాచం లలాటంపై నాటాడు.

## కపుల వంచించి రావణి రథికుడై వచ్చుట

రథహీనుడై పదాతిగా నిల్చికూడా రావణి తేరి చూడరాని శక్తితో లక్ష్మణుని నానా హింసలకు గురిచేశాడు. మానం, మచ్చరం, విసుమానంగా

యోధులు పోరుతుంటే, సైన్యాధిపతులు సైన్యాన్ని శత్రువులపై దూకించి సంకుల సమరం సాగించారు. ఉభయ సైన్యాలు తమతమ యజమానుల రక్షించుకుంటున్నై. అంతలో నిశాటులు ఇంద్రజిత్కి బాసటగా నిల్చి వైరి భీకరంగా పోరి వెనుకకు నెట్టారు. తమవాళ్ళ ప్రభుభక్తికి రావణి ఎంతో మెచ్చుకున్నాడు. “నిశచరులారా! మీరు చూపుతున్న తెగువతనం నాకెంతో తృప్తి కల్గించింది. సకలదిశలు సంతమసంతో నిండినవి. మనవాళ్ళెవరో, పరాయి వాళ్ళెవరో గుర్తించలేకుండావుంది. ఇప్పుడుమీరుఇంకోసాహసకార్యంచేయాలి. నా రాకపోకలుశత్రువులకుతెలియకుండా, కపులుతికమకపడేలాగా దడిగట్టినట్లు గుంపుగాకలసిపోరుసాగించాలె. నేను మాయాయుద్ధంమొదలుపెట్టాననే భ్రాంతి వానరులకు కలగాలి. క్షణంలో నేను రథసారథి సమేతంగా తిరిగి వస్తాను. రాగానే వీళ్ళ సంగతి చూస్తాను. నేను లంకలోకి పోతున్నానని తెలిస్తే నన్ను అడ్డుకుంటారు. అప్పుడు నాకు రణం భారమవుతుంది. మీ శక్తి సామర్థ్యాలు ప్రదర్శించే అదను వచ్చింది. నామాట నిలబెట్టండి” అని వాళ్ళ మధ్యన నిల్చి ఏకధాటిగా అసంఖ్యాక శరాలను శత్రువులపై ప్రయోగించి మోహంలోనుంచి తన సైన్యాలను ఉత్సాహపరిచి ముందుకు దూకించి తప్పుకున్నాడు. చూస్తుండగానే కనుమరుగైన ఇంద్రజిత్తు మళ్ళీ మాయాబల సంపదతో మరణదేవతను ఆహ్వానిస్తాడని మర్కట వీరులు భీతిపొంది పలాయనం చేయసాగారు. వేయికళ్ళతో విభీషణుడు గమనిస్తున్నా వంచించి రావణి లంకకు పోగానే తంత్రీ ముసల ముద్గర గదా శూల కరవాలాది శస్త్రపూర్ణం, ఉత్తమహయమండితం, హితసారథికం, సాలంకృతం, సధ్వజం అయిన రథాన్ని సమకూర్చాడు. రథాధిష్ఠితుడై రావణి ఉదయభానుడువలె ప్రకాశిస్తూ భటవర్గం సేవింపగా, భండన భూమికి వచ్చాడు. వచ్చిరావటంతోనే వానరులను చించిచెండాడు. విభీషణుని, రామానుజుని ఆశీవిషోపమ శరాలతో ధైర్యకంపకాలను బద్దలు కొట్టాడు. రక్షసులు ఒక్కసారి విజయ శంఖాలు పూరించి వైరులపై విరుచుకు పడ్డారు. అతని ఘనరాగమనంతో ఊపిరిపీలుస్తున్న కపులకు గుండెల్లో వేలసంఖ్యలో అగ్నిపర్వతాలు బ్రద్దలైనై. సుమిత్రాతనయ విభీషణ వానరవరులు మనస్సుల్లో ఇతడే యోధశేఖరుడని పలుమారు మెచ్చుకున్నారు.

# లక్ష్మణుడు ఇంద్రజిత్తును నొప్పించుట

అవమానం భరించలేక, కోపం తగ్గక బంటీరాగా ఇంద్రజిత్తు కపిరాజుల మూర్ఛపోయేలా శిలీముఖాలు కురిసి అంతరాళానికి పంపసాగాడు. వాళ్ళు ఆశరనాయకుని చేతి చేవను నిల్వలేక, నిల్చి బ్రదుకలేక సౌమిత్రి ముందుకుదేరాడు. తన్ను శరణుపొందిన తరుచర వీరులు సంతసింపగా వైరి చేతిలో చాపాన్ని ఒక్కబాణంతో ముక్కలు ముక్కలు చేసి సౌమిత్రి హసించాడు. ఇంద్రజి ఆగ్రహం హద్దులు దాటగానే రెండవ ధనుస్సు వెంటనే గ్రహించి శరం సంధిస్తుంటే సౌమిత్రి మార్గణత్రయంతో మళ్ళీ దాన్ని నరికి, రెక్కలున్న పాములవలె పంచశిఖాలను ప్రయోగించి వక్షాన్ని చీల్చాడు. ఆ శరాలు వజ్రంవంటి కవచాన్ని భేదించి గుండెల్లోనాటి వెన్నున వెడలి రక్తం త్రాగిన బలుపుతో ధరణిన్ వ్రాలినై. భిన్నవర్మమైన రావణి రొమ్ము నుండి రక్తం స్రవిస్తున్నా వెనుకంజవేయక కాలభుజంగ సన్నిభాలైన కరకుటంపరగుంపుతో సౌమిత్రి సర్వాంగాలు నొప్పించాడు. అయినా సౌమిత్రి లక్ష్యపెట్టక రావణి రథాన్ని వెనుకకు మరలించాడు. విశ్వమంతా వెంట వగిలి ఒక్కొక్క బాణంతో దైత్యవశపతుల గర్వమార్చి మూడు దీవాంతర భల్లాలతో ఇంద్రజిని కొట్టాడు. వాడు ఓడబోక దుస్సహమార్గణాలతో వేసి చూపాడు. వాటిని నడుమనే నరికి సారథి శిరాన్ని ఖండించాడు. సుశిక్షితాలైన హయాలు సారథిలేని లోపాన్ని సమర్థిస్తూ రథాన్ని లాగుతున్నై. అవి ప్రత్యర్థి లక్ష్యాన్ని తప్పిస్తూ, యజమానికి లక్ష్యాన్ని సాధిస్తూ మండల భ్రమణం చేస్తుంటే అంతా విస్మయం పొందాడు. గుర్రాలున్నంత వరకు శత్రుసాధ్యం కాదని తెలిసి సౌమిత్రి హయాలను గుండెలవరేట్లు కొట్టాడు. ఆపాటు తప్పుకుని దైత్యేశతనయుడు కులిశాభములైన క్రూర శరాలను లక్ష్మణునిపై చిమ్మి, వెంటనే మూడు బాణాలు ఫాలంపై నాటాడు. గుండెతాకిన బాణాలు సౌమిత్రి అభేద్య కవచాన్ని తాకి తునియలై పోయాయి. ఆ బాణత్రయంనాటిన సౌమిత్రి త్రిశృంగశైలంగా శోభించాడు. ప్రతిగా అయిదు నారాచాలు ఇంద్రజి ఫాలంపై గుచ్చాడు. ఈ విధంగా ఆరని ఈసున ఒకళ్ళనొకళ్ళు జల్లెడలాగా శరీరాలు అయ్యే పర్యంతం గెలుపు కోసం పోరాడారు. ఇంద్రజి పోతునే విభీషణుని బాణత్రితయంతో నొసలు

పగులనేసి, కపినాయకుల ఒక్కొక్క బాణంతో శక్తిహీనుల సలిపాడు. తోక త్రొక్కిన కాలభుజంగంవలె విభీషణుడు రావణి బాణఘాతంతో చెలరేగి గదతో గుర్రాలను కూల్చాడు.

## రావణి రామానుజులు దివ్యాస్త్రాలతో పోరుట

విభీషణుని గదాప్రహారంతో అజానేయ చతుష్టయం నీల్గంగానే ఇంద్రజిత్తు ధరణికి లంఘించి శక్తి శరాన్ని ధనుష్పనవాచిగి ఆకర్ణాంతంలాగి విభీషణుని వక్షం వ్రయ్యలుగా వేశాడు. లక్ష్మణుడు విభీషణుని ఆ శరం తాకకుండా పది శిత శరాలతో దాన్ని ఖండించాడు. వెంటనే విభీషణుడు ఉగ్రశిలీముఖాలతో అన్న బిడ్డను హడలగొట్టాడు. ప్రతిగా పినతండ్రిని కాలదత్తమైన భీషణాస్త్రాన్ని వేసి రావణి చంప యత్నించాడు. లక్ష్మణుడు స్వప్న కుబేరదత్త దివ్యాస్త్రాన్ని ప్రయోగించి నిలుపరించాడు. ఇద్దరు యోధులు శ్రవణావతంసంగా లాగివిడిచిన ఆ దివ్యాస్త్రాలు ధనుర్ముక్తం అవుతూ క్రౌంచపక్షుల ధ్వనులు కలిగించుతూ, నిప్పులు గ్రక్కుతూ, పటుగువేగాన్ని పొంది పడిపడిగా అంబరంలో ఢీకీలుముని ఢీ కొట్టుకుని విస్ఫులింగాలను వెదజల్లుతూ గ్రహద్వయంలాగా పోరి పోరి శతధాచ్ఛిదంగా భూతలంపై సురిగిపోయినై. రావణి సౌమిత్రులు తమ దివ్యాస్త్రాలు నిష్ప్రయోగమై పోయినందుకు సిగ్గుపడ్డారు. రామానుజుడు ఆగ్రహం నిగ్రహించుకోలేక వారుణాస్త్రాన్ని వైరిపై వేశాడు. రౌద్ర శర ప్రయోగంతో రావణి దాని శక్తిని అపహరించాడు. వెను వెంటనే "లోకాలెల్ల భస్మీపటలం చేయవలెనా?" అన్నట్లు పావకాస్త్రాన్ని అభిమంత్రించి ప్రతిపక్షనాశనాన్ని సంకల్పించి చాపనిర్ముక్తం సలిపాడు. ఆ అస్త్రజ్వాలలకు వాతావరణం దుస్సహతాపం పొంది ప్రసరించినంతమేర ప్రాణాలు బలిగొంటూ వస్తుంటే, లక్ష్మణుడు మాతాపిత్రుల సంస్మరించి సౌరాస్త్రాన్ని వేసి దాన్ని వైరి గుండెలు గుభేలుమనేట్లుగా ధ్వంసం చేశాడు. పావకాస్త్రం భగ్నంకాగానే పాకశాసన వైరి పావకుడులాగా మండి శాంబరీశక్తి సంబంధమైన ఆసురాస్త్రాన్ని వైచి ఆర్భాటం చేశాడు. అది తీవ్ర ముసలముద్గరముసుంఠిగదా పరిఘాది శస్త్ర సంతానాన్ని కోటానుకోట్లుగా విరచించుతూ రామానుజ సహితంగా రవిపుత్ర సైన్యాన్ని సంహరించటానికి భీకరరూపంతో రాసాగింది.

దాన్ని శేషాంశభవుడు స్వస్వరూపసంధానంతో రౌద్రాన్ని స్తుతించి శర ప్రయోగం చేశాడు. రెండూ దివ్యాస్త్రాలు. ఇద్దరూ శక్తిసంపద కలవారు. ఇద్దరూ స్పర్థతో వున్నారు. ఇద్దరూ విజయాకాంక్షులు. రామానుజ చాపనిర్గత రౌద్రాస్త్రం క్షణంలో ప్రళయకాల రుద్రమూర్తిగా ప్రతిభాసించి, విలయ తాండవం చేస్తూ ఆసురాస్త్రాన్ని అడ్డగించింది. గగనచరులు, భూచరులు, భూతకోటి భయంతో సౌమిత్రి పృష్ఠభాగాన్ని ఆశ్రయించి నిర్భయుల్నై నిలిచారు. ఆ భయంకరాస్త్రాలు ఒకదానినొకటి తాకుతుంటే, లోకాలు దిల్లపోతున్నై. సప్తసాగరాలు ఘూర్ణిల్లుతున్నై. కులాచలాలు కుతిలపడుతున్నై. ఇంద్రుడు సుపర్వ గంధర్వాహి గరుడయక్షమహర్షి బృందంతో వచ్చి లక్ష్మణుని హెచ్చరికతో సహస్రాక్షనామం సార్థకంగా సంరక్షిస్తున్నాడు.

## లక్ష్మణుడు ఇంద్రజిత్తును వధించుట

ఉభయయోధప్రయుక్తమైన దివ్యాస్త్రాలు ఘోరాతి ఘోరంగాపోరతుంటే లక్ష్మణుడు వైరి వధ చింతించాడు. "వీడు సర్వాసురమంత్రితాస్త్రాలు కలవాడు. అలసిపోడు. ఇక ఉపేక్షకుతావులేదు. వీనితో విజయోత్సవమో, వీరస్వర్గారోహణమో జరిగి తీరాలి" అని దృఢనిశ్చయంచేసి, పూర్వం హరి సురాసురయుద్ధంలో నిశాచర సంఘాన్ని ఎలా సంహరించాడో, ఆవిధంగా శత్రుక్షయంకారి, వహ్ని స్పర్శం, అసమసుపర్వం, సారపత్రం, సుసంస్థితం, హాటక వికృతం, అరినాశనకరం, దుర్నివారం, దుస్సహం, విబుధ పూజితం, విషధరప్రఖ్యం, ఇంద్రదేవతాకం ఐన ఐంద్ర శరాన్ని కార్ముకోత్తమములో, పురుషోత్తముడు దిగిచి "ధర్మాత్ముడు, సత్యసంధుడు, దాశరథి, రామచంద్రుడు పౌరుషంలో అప్రతిద్వంద్వుడే అయితే, ఓఐంద్ర శరమా! ఈ రావణినిచంపు" మంటూ, నిజ కార్యసాధనకు సత్యభాషణాలను స్మరించి, దృఢముష్టిసృష్టిలాఘవాతి వేగాలతోరావణి కంఠం లక్ష్యంగానిగిడించాడు. అవి దిఙ్మధ్యాంతరాకాశాలను కలిగిస్తూ, సూర్యసంకాశమై, మహోద్ధతితో పోయి లక్ష్యమైన రావణాత్మజుని మూర్ధం సశిరస్త్ర కుండలంగా హరించింది. అంతలో మూడు దివ్యశరాలు, అంతర్ధానమైపోయినై. ఖండిత శీర్షంహేమరుచి దీపితమై, రుధిరోక్షితమై, బిగి చెడకుండా, తేజం మాయకుండా ధరణిపడి బాలసూర్యునిభ్రాంతి ప్రకాశింపుతూంది. ఈలోగా విభీషణ వానరులు, భిన్న

శరాసనం భిన్నవర్మం, కృత్తశిరంబైన తనూగిరి నేలపడ వృత్రవధనాడు దేవతలు వాడిరాయాన్ని మోదినట్లు మోది నేలకూల్చారు. శరాసనం ధరించిన దాది శత్రుభీకరుడై, జయలక్ష్మీ కరగ్రహణదక్షుడై, పొందిరి నోని పౌరుష పరాక్రమాలతో నిలింపుల, దానవుల, పన్నగుల ముప్పతిప్పలుపెట్టి మూడు చెరువుల నీరు త్రాగించిన మహాధనుర్ధారి ఇంద్రజిత్తు తారరాలినట్లు సమర భూమిలోరాలి, అస్త్రవిద్యావిశారదుల హృదయాల్లో తుఫాను రేపాడు.

## ఇంద్రజిత్తు మరణానికి లోకంబులు సంతసపడుట

ఆహవంచూస్తున్న అమరులు, అప్సరసలు, మహర్షులు, యక్షగంధర్వులు, ఆనందం పుక్కిలింతలుగాగా ఆనందకోలాహలం చేశారు. ఆడారు. పాడారు. ఈ నాటికి దశకంఠుడు రెక్కలూడిన పక్షియైనాడు. ఇక సుఖంగా, స్వేచ్ఛగా జీవించ వచ్చునని తృప్తిగా నిట్టూర్చారు. తమ నాయకుడు దుర్మరణం పాలుకావటం చూచిన దైత్యులు వానరుల దాడికి తట్టుకోలేక. చేతిలో సాధనాలు జారిపోగా, పైపంచలు అడ్డం పడగా ప్రాణభయంతో కొందరు లంకకు పారిపోయారు. కొందరు లక్ష్యం లేకుండా పరుగెత్తారు. కొందరు సాగరంలో దూకారు. దినకరుడు అస్తగిరి చేరగానే కిరణ సహస్రం అతనితో పోయినట్లు పడిన ఇంద్రజిత్తును చూచి సైన్యం కాలు నిలుపలేక కాందిశీకులవలె రణభూమినీడి లంకకు పోయింది. సర్వం కోల్పోయి మండి మండి చల్లారిన అగ్నివలె, వెలిగి వెలిగి చల్లబడిన జగచ్చక్షువువలె రా[illegible] ప్రధనభూమిలో ప్రశాంతి పొందాడు. ఇంద్రజిత్తు మరణం విని ఇం[illegible] సమరక్షేత్రానికి వచ్చి తన విరోధిచావును కళ్ళారాచూచి తృప్తిపడ్డాడు. దేవతలు దుందుభులు మ్రోగించారు. ఆకాశం నిర్మలమైంది. భాస్కరుడు స్వీయప్రకాశం పొందాడు. జగత్సందోహం శాంత సుఖమయమైంది. రావణద్వేషులు సంతసించారు. గంధర్వులు పాడగా, అప్సరఃకాంతలు ఆడారు. కల్పవృక్ష సంతానం సుమాలను వర్షించింది. నీరధులు స్వచ్ఛమైనై. దిక్కులు తెలివిగొన్నై. ఇంద్రజిత్తు మరణవార్త విన్న లోకం ఏలువెంట వచ్చి ఆ మహాయోధునిమాచి కన్నీరుకార్చిపోతూంది. కొంత లోకం సౌమిత్రిని కొండాడింది. దేవతలు, మహర్షులు రామానుజుని ప్రీతి పూర్వకంగా

ప్రశంసించి దీవించారు. ఇక విధాత సృష్టి ప్రశాంతంగా జీవించగలదని అంటూ ఐక్యకంఠంగా ఆనందాశ్రువులు రాలుస్తూ అన్నారు.

పొంగివస్తున్న ఆనందంతో జాంబవత్పవనపుత్ర విభీషణులు అభంగ పరాక్రముడై, అరిలోక భయంకరుడైన ఇంద్రజిని ఇహలోక సౌఖ్యానికి దూరంచేసిన లక్ష్మణుని అనేక విధాల సంస్తుతులు చేశారు. శత్రువైనా శక్ర శత్రుసేసిన సమరం, దాన్ని ప్రతిఘటించి విజయం సాధించిన సౌమిత్రి ధనుర్విద్యా కౌశలం విపులంగా వివరించేస్తూ అభినందించారు. ఇక ప్లవగుల సంతోషం పట్టపగ్గాలు, విడువ వీలులేకుండా పోయింది. అరిచారు. తోకలు నేలకేసి కొట్టారు. కిచకిచ నవ్వారు. దూకారు. లంఘించారు. లంకా నగరం అదిరేట్లు పరుగులు తీశారు. పూలకొమ్మలు విరిచారు. రామానుజునికి ప్రసవాభిషేకం చేశారు: స్తుతించారు. వాళ్ళలో వాళ్ళు ఆలింగనం చేసుకున్నారు. సాగిన సమర కథనం చిత్రవిచిత్రంగా చెప్పుకున్నారు. "లక్ష్మణుడు జై. సుమిత్రానంద వర్ధనుడు జై. ఊర్మిళా హృదయేశుడు జై" అంటూ చుట్టూ ప్రదక్షిణం చేశారు. పాదాలపై వ్రాలారు. వీళ్ళ కోలాహలం ఇలా సాగుతుండే ఇంద్రజి మరణవార్త ఆలస్యంగా విన్న దేవతలు నమ్మలేక రణభూమికి వచ్చి, తాము నిజంగా ఇప్పుడు బ్రతికున్నామనే విశ్వాసం మొలకెత్తగా మృతనాయకుంగాంచి పరితృప్తులైనారు. రావణి హతశేష సైన్యం నాయకమరణ శోకంతో సుడిగాలిలో తిరిగే ఎండుటాకువలె చిత్తక్షోభతో లంకానగరం చేరింది.

## రావణి వధవిని రాముడు లక్ష్మణుని ప్రశంసచేయుట

మసకు వెలిసిన దినంలాగా యుద్ధభూమి తేటపడింది. లక్ష్మణుడు ప్రసన్నుడైనాడు. సమీపంలోవున్న మారుతి విభీషణుల హస్తాలను గ్రహించి "పూజ్యులారా! రామ రవిపుత్రుల దర్శనార్థం పోదామా?" అని అడిగాడు. వారు అందుకు అంగీకరించారు. ఇంద్రుని చేరబోయే బృహస్పతివలె పూజ్యులు అనుసరించి రాగా, నగచరులు విజయసూచక సింహనాదాలు చేస్తుండగా రామచంద్ర చరణ సన్నిధానానికి వెళ్ళాడు. భయభక్తులతో పాదాభివందనం చేశాడు. వినమిత శిరస్కుడై వైరివధ స్పష్టంగా విన్నవించాడు. విభీషణుడు ఆపుకోలేని ఉత్సాహంతో జరిగిన సమరం ఆమూలం

చూదం అద్భుతంగా అభివర్ణించి చెప్పాడు. ఆ శుభవార్త విన్న రామ చంద్రుడు "లక్ష్మణా! నాకు తమ్ముడవనిపించుకున్నావు. నిన్ను హృదయంతో మెచ్చుకున్నాను. నాయనా! నాపైగల బరువు మహామంతులు దించి మేలుచేశావు. ఈతని మరణం ఎలా సాధించాలా అని ఆలోచిస్తున్నాను. నీకు శుభంకలగాలని చింతిస్తున్నాను. భగవంతుడు మన పాలిట వున్నాడు. నా మనశ్శల్యం నీచేత పరిహరింపబడింది" అని గాఢాలింగనం చేసుకుని లజ్జతో మోమువాల్చిన తమ్ముణ్ణి తన అంక పీఠంపై నుంచుకుని వ్రణ రక్త శరీరాన్ని తన జనాభయ ప్రదానమైన దక్షిణ హస్తంతో మృదువుగా దువ్వుతూ, అది ప్రేమభావమో, కృతజ్ఞతాభావమో తెలియరాని విధంగా అశ్రువులతో శిరస్సు తడిపాడు. ఆ బంగారు దేహం శరాఘాతాలతో జల్లెడ లాగా కనుపిస్తుంటే మాటిమాటికి వాటివంక చూస్తూ ఆ గంభీరమూర్తి వెచ్చ నూర్చాడు. శరాన్ని పుణుకుతూ, బాధ ఉపశమించేట్లు అనునయిస్తూ, ఆ బలవత్తర శాత్రవుడు నిన్నెంత బాధించాడని గ్రుక్కనీళ్ళు గ్రుక్కుకుంటూ గుండెను చేర్చుకుంటూ చాలాకాలం గడిపాడు. "నాయనా సౌమిత్రీ! నీవు నీ తల్లికడుపు చల్లదనంచేత దివిజులు సాధింపలేని విజయాన్ని సాధించి నాకే కాక విశ్వానికే ఆనందం పంచావు. రావణి మరణంతో రావణుడు మరణించినట్లే. అతని త్రిలోక విజయానికి ఈతడు దక్షిణ బాహువుగా వుండేవాడట. అటువంటి జగద్భయంకర మూర్తిని నీవు సంహరించటంతో నేను సత్యంగా జయం సాధించానన్న మాటే. మనకోసం ఈ విభీషణ హనుమంతులు చేసిన సాహసం ఇటువంటిదని చెప్పటానికి నాకు మాటలే చాలటంలేదు. మూడు రాత్రులు, మూడు పగళ్ళు నిద్రాహారాలు మాని, విశ్రాంతి లేకుండా పోరి శత్రువును సంహరించారు. ఈ పూజ్యులకు నేను ఋణపడ్డాను. తనయంత వాడు, దానవ లోకైక వీరుడు మరణించాడన్న వార్త తెలియగానే ఇంట గడపలేడు. కదనానికి కదలివస్తాడు. వచ్చి నాకు రణాతిథ్యం ఇస్తాడు. ఇచ్చిన వెంటనే అతడు చస్తాడు. నీవిప్పుడు ఇంత విజయం సాధించిపెట్టినందువల్లనే కదా నా కార్యం తేలిక అయింది? నేను మళ్ళీ మీ వదినతో రాజ్యాన్ని గ్రహించే అవకాశం అబ్బింది? నాయనా! "సోదరులంటే దాశరథులే సుమా" అనే కీర్తి సాధించి పెట్టావు" అని ఆశ్వాసించి, పునరాలింగనం చేసుకుని "పూజ్యుడా! సుషేణా! ఈ భ్రాతృవత్సలుని, రామానుజుని, మహా

మరిని, త్యాగమూర్తిని స్వస్థుణ్ని చేయి. ఆ విధంగానే విభీషణ వాయుపుత్రుల
దళపతుల యథారోగ్యవంతులుగా సల్పు. ఇంకా విచారించి ఆహవరంగంలో
నొచ్చిన మనవాళ్ళ నందరినీ సుఖవంతులుగా నొనరింపు" అని చెప్పాడు.
రాముని వాక్యాలు విన్న సుషేణుడు ఓషధీరసాన్ని కలిగినతోలుసంచి తెరచి
సౌమిత్రికి వాసన చూపించాడు. వెంటనే శరీరంలో నాటుకున్న విరిగిన ములు
కులు చేతితో తీసివేసినట్లు శరీర నిర్గతాలై జల్లున రాలిపడినై. మరుక్షణంలో
గాయాలు మాని చిహ్నలు కూడా లేకుండా అదృశ్యమయినాయి. అనంతరం
రామాజ్ఞప్రకారం అందరికీ చికిత్సచేశాడు. అందరు స్వస్థులైనారు. లక్ష్మణుడు
నిరామయుడు కాగానే, వనచరులు, భల్లూకపతులు, దళనాయకులు, విభీషణ
రవిపుత్రులు ఎంతో సంతోషించారు. రాముడు తన తమ్ముడు పూర్వస్థితి
పొందటంతోనే చంద్రోదయవేళ వార్థివలె పొంగిపోయాడు.

## రావణి మరణానికి రావణుడు శోకించుట

రామచంద్ర స్కంధావారంలో ఆనంద దేవత నృత్యం చేస్తుంటే,
లంకలో రావణమందిరం శోక దేవత మూర్తి వహించినట్లుంది. హతశేషుల
వల్ల ఇంద్రజిత్ మరణం విన్న మంత్రులు రావణునిచేరి, ఘోరంగాశోకిస్తూ
"ప్రభూ! జరగరాని ఘోరం జరిగింది. చెప్పటానికి నోరు రావటంలేదు.
దళపతులు నెన్నె చూడలేక దుఃఖంలో మునిగి వున్నారు. సైన్యం కొంత
చేరింది. తక్కింది ఏమైందో తెలియదు. నీ తమ్ముడి తోడ్పాటుతో లక్ష్మ
ణుడు పోరిలో మాంసాశనుల మహారత్నాన్ని పొట్టపెట్టుకున్నాడు. ఇది
ఏమి వైపరీత్యం? తిరుగులేని వీరుడు. జన్మంలో ప్రుక్కటం తెలియనివాడు.
శ్రమలేకుండా శక్రుణ్ణి పాదాక్రాంతుణ్ణి చేయించిన ప్రచండ ధనుర్విద్యా
పారగుడు. నీ పుత్రుడు మేఘనాదుడు లక్ష్మణునితో తలపడి శత్రు
వ్యూహాన్ని ఛేదించి, హావడి పుట్టించి, వీరజనభావిత లోకంలో విశ్రాంతి
పొందాడు" అని చెప్పి కన్నీరు మున్నీరుగా ఏడ్చారు. దారుణమూ,
హృదయ విదారణం అయిన తనయుని జీవిత పరిపూర్తిగాథ చెవి సోకీ
సోకకుండగనే పంక్తిముఖుడు విసంజ్ఞుడై ఘోరమూర్ఛలో మునిగి నేం
ద్రెళ్ళాడు. దీర్ఘకాలం స్మారకం లేకుండా వుండి, శైత్యోపచారాలతో తెలి
వొందాడు. భరించరాని పుత్రశోకం దాహింపగా వసవసవి ఏడ్చాడు.

"హా తనయా! హా మహారథవర్యా! హా రాక్షసవ్యూహవిరముఖ్యా! నా బంగారు కొండా! నా భాగ్యదేవతా! నా నోములపంటా! నా తపఃఫలమా! ఇంద్రజిత్! ఎంత అన్యాయం చేశావు? ఘోరావమానంతో క్రుంగి కృశించిపోతున్న నన్ను సంతోషపెట్టటానికై అమూల్యమైన నీ పుట్టుక త్యాగం చేశావా నా తండ్రీ? నేనెంతపాపిని? నా అధర్మకాంక్షారతి అనితరసాధ్యమైన నీ అపురూప ఉన్నతినే ఆహుతికొన్నదా? బిడ్డా! ఎందరు వ్యతిరేకించినా నన్నే సమర్థించి పుత్రనామం సార్థకం చేసుకున్నావు. అందుకు తగినట్లుగా ఆత్మార్పణం చేసుకున్నావు. రావణుడంటే లోకవిద్రావణుడన్నయశం నీవల్లనేకదా వచ్చింది? నీ అప్రతిహత బాణవిద్యా కౌశల్యానికి అష్టదిక్పతుల దివ్యాయుధాలు మోకరిల్లి ప్రశంసించినవే? సౌమిత్రి బాణాలు నిన్నెలా చంపినై నాయనా? అభేద్యాలు, బ్రహ్మదత్తాలు అయిన దివ్యసాధనాలన్నీ ఏమైనై? నీ మాయను ఛిదగలదే? రెండుసార్లు విజయంతో లంక ప్రవేశించింది నీ వాక్కుదవేదా? నీపై కొండంత ఆశను పెంచుకున్న నాగతి దుర్గతిగా మార్చావా? కులపర్వతాలను కూలద్రోసే నీ బాహుబలం ఎలా వ్యర్థమైపోయింది? త్రిలోక విజేతవైన నీ శక్తి అల్పమానవుని అస్త్రాలను ఆపలేక పోయిందా? ఇంద్రవరుణాదులు నాకు పూజ్యులు. అనుచరులు. ఇంతలో నీవంటి బంగారుతండ్రిని కాలగతి పొందించటానికి ఎలాసాహసించాడు? వీరలోకంలో నీస్థానం ప్రత్యేకం, ప్రముఖం, ప్రశస్తం, సుస్థితం. శౌర్యోన్నతులకు, మర్త్యామర్త్యులకు, మహా వీరులకు, ఆత్మీయులైన వారికోసం త్యక్తప్రాణులైనవారికి, సంగ్రామ జీవులకు ఇవి అర్హమైనవే, వాంఛనీయమైనవే. నా దిక్కులేని జీవిత విధాన్ని తర్కించుకునే ఏడుస్తాను. నీవు కలిగినప్పటినుంచి నా కనుసన్నల్లో మెలిగి, నా కన్నులు పండించి, నా కన్నాకుత్తై, నన్ను యశోజలధి వీచి విహారంలో తేల్చావు. ఇప్పుడిక నాకు దిక్కెవరు? దేవతలకే సాధ్యంకాని నాగపాశ బంధాలు త్రెంచుకున్న వాళ్ళని తెలిసి కూడ నా దుర్మోహానికి బలిచేసుకున్నాను. నీ ధర్మం శత గుణితంగా నెరవేర్చి వీరలోకం చేరావు. ఇహంలో ఇంత ప్రేమ చూపిన నీవు నన్ను వదలి పరంలో ఒంటరిగా సుఖించ వాంఛించావా? ఇప్పుడు అమరులు, కపిప్రభులు, ఋషులు, వేదమార్గానుయాయులైన మర్త్యులు గుండెలపై చేయిపెట్టుకుని నిద్రిస్తారు. నాకిప్పుడు పోయిందేముంది? పురాలున్నై, ధామాలున్నై, నగరాలున్నై. నాకవాసం పదవర్త

ఉంది. అంతఃపురం ఉంది. ఆత్మవిగ్రహం ఉంది. ఆజ్ఞాధికారం ఉంది. ఇదంతా నీతో వచ్చింది. నీతోనే పోయింది. నీవు ఒక్కడివే లేవు. నాకు లోకాలే లేవు. సర్వం శూన్యమైంది. అయ్యయ్యో నాయనా! నిరంతర వేదఘోషంలో, నృత్త గీతాభినయ వాద్య విశేషనాదాలతో కర్ణానందం కలిగించే లంకానగరంలో, కరీంద్రులవాసి దిక్కేదిసకరిణాం వెక్కసపు ధ్వనుల్లాగా రాక్షసాంగనల దుఃఖం పొంగి ఘోషిస్తుంటే వింటూ బ్రతుకుతున్నాను తండ్రీ! నా హృదయతంత్రీ! మేఘనాదా! నన్ను, యావ రాజ్యాన్ని, లంకా నగరాన్ని, రాక్షసాళిని, నీ హృదయేశ్వరులనూ, సుహృత్తులనూ వదలి ఒక్కడవే మహాప్రస్థాన యాత్ర ఎలా చేశావు? నాపై నీ మమకారం, భక్తి గౌరవాలు ఏమైనై? నాకు జరిపే ప్రేతకార్యానికి నీవేకదా అర్హుడవు. ఇప్పుడు నాపట్ల విధివిపరీతమై నన్ను బ్రతికించి నిన్ను బలితీసుకుంది. నా విరోధులైన రామ లక్ష్మణులు, రవిపుత్ర విభీషణాదులు విజయులై, నాకు మనశ్శల్యాలై బ్రతికివుండగా, ఏమని నన్ను తీవ్రవేదనలపాలు చేస్తూ ఊర్ధ్వలోక సౌఖ్యాలను ఎందుకు వాంఛించావు తండ్రీ?" అంటూ ఎన్నడూ ఎరుగని గర్భబాధతో ఏడ్చాడు. "నా అనురాగం మరిచేదేనా అనీ, నిర్జిత నిర్జరాళిసేనా అనీ, బాహువీర్య విదిత శక్రప్రభా అనీ, దారుణ ఓదార్పుట తగదా అనీ" అంగలార్చాడు.

## రావణుడు తన పరాక్రమం రాక్షసులకు చెప్పుట

ఆ అధిక దుఃఖం ఆగ్రహంగా మారింది. గ్రీష్మంలో జ్వలిస్తున్న సూర్యునకు తైక్ష్ణ్యం కలిగించినట్లు మండుతూ, భయంకర జలచర సంతానంతోనిండిన సాగరంవలె క్షుభితుడై, కుటిలభ్రుకుటి విక్షేపంతో చూడ భయంకరమూర్తిగా పరివర్తనంపొందాడు. అతని నోరు ఇంగలాలుగ్రక్కే మృత్యు నోరు తలపించింది. సహజంగా ఎర్రగావుండే కళ్ళు కోపతీవ్రతతో ఇంకా ఎరుపెక్కినై. ప్రకృతి భీకరంగావుండే శరీరం కినుకతో రుద్రరూపాన్ని పొందింది. మండుతున్న వత్తివుండి మండే నూనెబొట్లు రాలినట్లు కళ్ళనుండి నీళ్లురాలినై. రాక్షసవేష్ట్యమానఘోర యంత్రంలాగా దంతాలు కొరుకుతున్న చప్పుడు, కాలాంతకుని గతిభయంకొల్పే చూపులు అక్కడవున్న అసురుల

తిలకించి గుండెలదరి గుంపులై పారిపోసాగారు. పారిపోతున్న పరివారాన్ని బంధు సుహృదమాత్యులను ఆపి భయంతీరేలాగా, ధైర్యం కలిగేలాగా తన శక్తిని విపులంగా చెప్పసాగాడు. "రాక్షసశ్రేష్ఠులారా! వినండి. వర్ష సహస్రాలు ఘోరంగా తపంచేసి విధాతను మెప్పించాను. తపోబలంతోనూ, ధాత ఇచ్చిన వరాల బలంతోనూ, దేవదానవ యక్ష గంధర్వ పన్నగాదులవల్ల భయం లేకుండా వున్నాను. వజ్రహతి మొక్కపోయే బ్రహ్మదత్త కవచం కలిగి వున్నాను. ఆయన చేతనే పొందిన దివ్య శరాసనం ఇంకా నన్ను వీడి పోలేదు. ధనుర్ధారినై, స్యందన స్థితుడనై సాటిజోడు లేకుండా సమరాలుచేసి యశస్సు ఆర్జించాను. విరించి ప్రసాద శరచాప కవచధారినై సంగరంలో నిలిస్తే ఇంద్రాదులు పాదాక్రాంతులైనారు. రామలక్ష్మణాదులు నాకేమిలెక్క? తెండి నా ధనువు. తూర్యనాదాలు దిశలునిండ పూరించండి. రామలక్ష్మణుల సమరంలో చెండి వస్తాను" అని దిగ్గజ కర్ణకఠోరంగా హుంకరించాడు.

## రావణుడు సీతను చంపబోవుట

ఒకవంక గర్వశోకం కాలుస్తుండగా, ఇంకోవంక దుర్మోహం ఆజ్యం పోస్తుండగా "ఓ నిశాచరులారా! నా కొడుకు వనచర వంచనార్థం కృత్రిమ సీతను ఖండించాడు. నేను విరక్త అయిన ఆ క్షత్రియాంగనను నిజంగానే వధించి నా పీడ తొలగించుకుంటాను" అని పుష్పమాలాలంకృతమై, నిజరుచిర ధిక్కృత జ్యోత్స్నమై వెలుగుతున్న చంద్రహాసాన్ని చేకొని సీత వున్న అశోక వనానికి ఆగకుండా పోయాడు. మంత్రులు, కులకాంతలు, పరిచారకులు కొంపరతొంపరగా అనుసరించారు. వెంట పోతున్నవాళ్లు పరస్పరం బిగ్గరగా "ప్రభువంటే సామాన్యుడా? సకలదిక్పాలుర, దైవతవీరుల ఆహవంలో పరాభూతుల చేశాడు. వాళ్లలో సేవలు కొన్నాడు. ఇంతటి విక్రమాఢ్యుని దృష్టిలోపడి మానవులైన రామలక్ష్మణులు ఏమైపోతారో ఎవ్వరికి తెలుసు? దేవతల జయించి దివ్యరత్నాలెన్నో తెచ్చాడు. బలంలో, విక్రమంలో పదునాల్గు లోకాల్లో మన ప్రభువుకు సాటి మరెవ్వరున్నారు? అకారణంగా అశోకవనానికి ఎందుకోపోతున్నాడు. ఏదో ప్రళయం సృష్టిస్తాడు" అని ప్రశంసల వర్షం కురిపించారు. ఆ ఘోష గాలిలో కలిసిపోయింది కాని, కోపమూర్ఛిత హృదయసాగసుడైన పంక్తిముఖుని చెవిసోకలేదు.

మంత్రులు, బంధువులు, స్నేహితులు, బుద్ధిమంతులు అడ్డపడి ఎంత వేడుకున్నా రోహిణిని వెంటనంటే గ్రహంలాగా సీతను చేరబోయాడు. అందరు లోలోపల "ఏం జరుగుతుందో" అని భయంతో వెంట నడిచారు. అతని ఆకారం, అతని గమనం శ్రేయస్కరంగా లేదు.

## రావణుని చూచి సీత దుఃఖించుట

అంగలు వాచివేస్తూ నడకొంచపడి నడచివస్తున్నవాణ్ణి, చంద్రహాసం చేతిలో ధరించినవాణ్ణి, కోపదుఃఖాలతో కుములుతున్నవాణ్ణి, అయినవాళ్ళు మాటిమాటికి అడ్డుపడుతున్నవాణ్ణి, రావణుని రాముపత్ని, పరమపతివ్రతామతల్లి, సీత చూచింది. ఇంతకు పూర్వం వచ్చినపుడూ, రావచ్చినపుడూ పరికించి భయం పొందింది. "వీడు వధ్యుడై వచ్చినట్లున్నాడు. తెలియరాని మనోవేదన ఏదో కలతని బాధిస్తూంది. ప్రతిక్రియ చేయడం చేతకాక నన్ను చంపవస్తున్నట్లున్నాడు. అతడిచ్చిన గడువింకా ముగియలేదు. ఏదో ప్రమాదం సహించరానిది నావాళ్ళవల్ల వచ్చి వుంటుంది. అందుకు వాళ్ళను ఏంచేయలేక కసికొద్దీ నన్ను చంప వచ్చాడు. చిక్కులకు చిక్కైన మహాబాహుడు, సత్యపరాక్రముడు దాశరథి నాకు దిక్కయివుండగా, అనాథవలె ఈ ముక్కిడిరక్కసుడు నన్ను చంప చూస్తున్నాడు. పతిదేవతనైన నన్ను ఎన్నోసార్లు వేడుకుని, నాచేత ఛీకొట్టబడి, నిరాశుడై, వేసరి, మోహకోపాలు ప్రేరేచ, అవమాన భరంతో క్రుంగి, పగపట్టుకుంటానికి నా ప్రాణాలు హరింపవలెనను కాబోలు. లేకపోతే ఈ కరవాలం ఎందుకు? బంధుమిత్రుల అడ్డగింపులెందుకు? కలతనికీ ప్రళయకాల రుద్రరూపం ఎందుకు? వీడిరాక నన్ను చంపటకే. సత్యం. ఇది ముమ్మాటికి సత్యం. నేను అలక్ష్యంగా భావించి నా వాళ్ళనే హత్యగావించి చెప్పవచ్చాడేమో? ఛీ ఛీ! నాకోసం నావాళ్ళు అంతమైనారేమో? శాంతం పాపం. నాపుట్టుకతో ఎంత వైపరీత్యం పుట్టింది? లోకంలో నా గాథకంటె ఇంకొకటెక్కడవుంది? నావాళ్ళు తన కొడుకును చంపితే ఆ దుఃఖంతో నన్ను చంపవచ్చాడేమో, వాళ్ళను ఎదుర్కొలేకపోయాడు. ఈ క్రోధంలో నన్ను నిజంగా చంపుతాడు. నా భర్తను దర్శించే యోగం నా జీవితానికి ఇకలేదు. నా బ్రతుకు ఈనాటికోసరి. నేనెంత బుద్ధిహీనురాలను? మతిమంతుడైన హనుమ

71170

యోగ్యమైన అభ్యర్థన త్రోసిపుచ్చి నా మరణాన్ని నేనే కొనితెచ్చుకున్నాను. ఆపూజ్యుడు చెప్పినట్లు ఆనాడే అతని మూపుపైనెక్కి వెళ్ళినట్లయితే, నానాథుని అంకసీమలో అనురాగవాక్యాలు ఆలకిస్తూ ఆనందంపొందుతూ వుండేదాన్ని. ఈ దుష్టునిచే దుర్మరణం పొందే గీత నానొసట వ్రాసి వుండగా ఆ మంచి బుద్ధి ఎందుకు కలుగుతుంది? అందుకే స్త్రీ బుద్ధి ప్రళయాంతకమని పెద్ద లన్నారు. అభిమానంతో అల్లరివేసినా సత్యం సత్యమే. ప్రకృతి ధర్మం ప్రకృతి ధర్మమే. పాపం! వృద్ధురాలు, భర్తృహీన, నా అత్త ఎంత ఏడు స్తుందో? ఒక్కగాని ఒక్క బిడ్డడు. ఆహవంలో హతుడైనాడని వింటే, ఎంత కాలానికి తనకు సంతానం కలిగిందో, బాలుని శైశవం, క్రీడయా, ప్రజలకు ముద్దు బిడ్డడై, పొందిన ముద్దు ముచ్చట్లూ, యౌవన దశలో చూపిన భక్తి ప్రేమ గౌరవాలూ, సత్యవ్రతనిష్ఠా, ధర్మకార్యాసక్తీ, త్యాగభావం తలచి తలచి, గుండెలవిసి 'ఇంకెక్కడి కొడుకని' తన దుర్యోగానికి దుఃఖిస్తూ, శ్రాద్ధకార్యాలు తీర్పించి తాను చిచ్చులోనో, నీళ్ళలోనో పడి జీవిత శేషం ముగించుకుంటుంది. ఇంత అనర్థానికి మూలం ఆ జగజంత, అసతి, కుబ్జ, మంథర. అది కూడా కాదు. పాపంపండిన నేనే. ఆనాడు పతివద్దన్నా వెంట వచ్చాను. పరిశుద్ధుడైన మరదిని అనరానిమాటలన్నాను. నేనేకాక విశుద్ధ చరిత్రుల అష్టకష్టాలపాలు కావించాను" అని తలపోస్తూ కంటికి కడివెడు నీళ్లుగా ఏడ్చింది.

## సుపార్శ్వుడు రావణునకు నీతి తెలిపి మరలించుట

వ్యాఘ్రం వెంట తగిలిన గోమాతవలె సీత ఏడుస్తుంటే, ఆమెనుచూచి హృదయం జాలితో నిండగా, ధీమంతుడు, శుచిమంతుడు, ఉత్తమమంత్రి, సుపార్శ్వుడు, బంధువులు నిరోధించగా నిలిచిన ప్రభువును సమీపించి, మర్మ చ్ఛేదకాలైన మాటలు పల్కసాగాడు. "ప్రభూ! ఏం చేయబోతున్నావు? బ్రహ్మ కులంలో జనియించావు. కుబేరునకు తమ్ముడవైనావు. వేదాన్ని పారంముట్ట వల్లించావు. చేయతగిన వ్రతాలు చేశావు. ఈయతగినవారికి ఈవులిచ్చావు. స్నాతకుడవై, నిత్య నిర్దోచితకర్మశీలివై, త్రిలోక విజేతవై, పరులు తేరిమాడరాని, భావింపరాని లంకానగరాధినాథుడవై దక్షిణ నాయకుడవై, మహా త ప స్సం ప న్ను డ వై, విశేష తపశ్చర్యా

పరిత్యక్త విధాతవై, పద్మాసనానుగ్రహ లబ్ధ దుర్లభ వరసందోహుడవై, నిరంతర శివపూజా ధురంధరుడవై, చివరకు దిక్కులేని ఒక దుఃఖభాగినిని, అదృష్టహీనను, భయభ్రాంతను, బలాత్కృత భర్తృప్రణయదూరను చంపటం యశఃకారణమని భావించావా? ఈమె చావుతో యుద్ధం ముగుస్తుందా? చచ్చిన లోకైక వీరుడు ఇంద్రజిత్తు బ్రతికి వస్తాడా? ఒడలు తెలియని కోపంతో ఎంత పాపానికి ఒడిగట్టావు? ఇదియేం ధర్మమని అబలను, మానవిని చంపసిద్ధపడ్డావు? ఈ మానవతి రూపసంపద చూస్తూ, ఈమె శీలాన్ని గుర్తిస్తూ, చంపటానికి నీ చేయి ఎలా లేచింది? నీకీ బుద్ధి ఎలా పుట్టింది? శూరులమైన మా సాయంతో విరోధులైన రామలక్ష్మణ రవిపుత్రులపై నీ ఆగ్రహవహ్ని విడిచి పెట్టు. అప్పుడు నీ శౌర్యాన్ని లోకాలు ప్రశంసిస్తాయి. ఈనాడు కృష్ణపక్ష చతుర్దశి. ఈ సమయంలో అభ్యమిత్రుడవై (శత్రువులపై దాడి వెడలేవాడు) రణసన్నాహాలు సాగించి, రేపు అమావాస్య రావటంవేళ, సరథుడవై, ససైన్యుడవై సమర క్షేత్రానికి చని విజయం పొందు. శూరుడవు, ధీరుడవు, సారతరకృపాణివి, నీవిక స్యందనస్థితుడవై, రణప్రాంగణంలో రాముని వధించి సీతను గ్రహించు. అంతేకాని ఫలకారికాక ప్రమాదకారి అయిన స్త్రీ హత్యకు ఎందుకు పాల్పడగావు?" అని నయవినయ నిశ్చయోపదేశ విధంగా బోధించాడు. దుష్ట సంకల్పుడూ, దుర్మోహుడూ అయిన రావణుడు ధర్మ్యమైన మంత్రి మాటలు మన్నించి లంకచేరి అప్పటి కప్పుడు సభను తీర్చించాడు.

## రావణుని మూలబల యుద్ధం

మహా సభామధ్యంలో హేమ సింహాసనాసీనుడై అమరులు సేవించే ఇంద్రుడులాగా భాసించాడు. సభ నిశ్శబ్దంగా వుంది. అందరు ప్రభువు నోటి వెంట వచ్చే వాక్కులు విన కుతూహలంతో వున్నారు. దుఃఖదైన్యాలు మొగంలో ముప్పిరిగొనగా, సభనంత పారచూచాడు. "సభాస్తారులారా!" అని సంబోధిస్తుంటే కడుపుశోకం పెచ్చు పెరిగి కన్నీరు మున్నీరుగాచేసి అవరోధం కలిపించింది. కంఠం గాద్గద్యమైంది. తనువు తూలింది. మహా విక్రముడు కనుక ఆ శోచనీయదృశ్యాన్ని అణచుకుని అంజలించాడు. "కార్యఘటకులారా! హయ హస్తియుతం, స్యందన సైన్య విరాజితం అయిన

సమూహంతో దాటి వెడలి రావణ్ణి ఒక్కడినే పట్టుకుని ప్రావృషం ఘోషా వలె శర పరంపర వర్షించి, అందులో ఆతని ముంచి చంపండి. మీరిప్పుడే భండన భూమికి పయనించండి. రేపు నేను మీకు ప్రాపుగా రథినై వస్తాను. శేషం మిగిలితే నేను చెండివేసి శత్రు శేషం లేకుండా చేస్తాను. మీవల్ల రామ లక్ష్మణులు హతులు కాకపోతే నేనే చంపి జగం మెచ్చేలాగా జయంపొంది లంకానగరంలో మీకు ఆనందం పొందేలాగా సత్కరిస్తాను" అంటూ మేఘ ఘోషంలాగా పలికాడు. అనంతరం అంతా "జయలంకేశా! జయవిజిత సురేశా! జయ విష్ట తపస్స్తృప్తప్రతాపాకీశా!" అంటూ కదలి వెళ్ళారు. సాగరం చెలియలికట్ట దాటినట్లు నానానీకంతో సేనాపతులు, సితపట్ట సంతానంతో, పరిఘాది బహువిధ ప్రహరణ సాధనాంతో రణభూమికి వచ్చి వానర సైన్యంతో తలపడ్డారు. తెలతెల వారుతుండగా దివిజారి బృందం హఠాత్తుగా వచ్చి తాకటంతో సంతోషంతో ప్రమత్తులైవున్న ప్లవగవీరులు మొదట్లో వెను తగ్గినా, క్రమంగా బలాన్ని పుంజుకున్నారు. వ్యూహ నిర్మాణం క్షణంలో జరిగించారు. క్రమపద్ధతిలో కదనరంగం కల్లోలినిగా మార్చారు. దానవులు ఎదుర దానవులతో ఉభయపక్షాలు సైన్యనష్టం పొందినై. నష్టాన్ని పూరించుకుంటూ, గంటకు మిగిలి చండ యుద్ధం చేశారు. గదలతో, ఖడ్గాలతో, శూలాలతో, ముసలముద్గరాలతో నిశాటులు భీకరంగా ప్రహరిస్తుంటే, వనాటులు మహీరుహాలతో, మహీధరాలతో ఘోరంగా ప్రహరించారు. ఒకరికి వొకరు తీసిపోక, ప్రాణాలపై తీపిలేక, ప్రభువుల విజయార్థం పోరుతుంటే రక్తం ఏరులై పారింది. చరణ ఘట్టన సముద్భూత ధరణీధూళిపై రక్తనదులు ప్రవహించి శమింపచేసినై. ఆ రక్తనదుల్లో రథాలు మారతీరాలకు పయనించే నౌకల్లాగా కనుపట్టినై. సమరసమయం తక్కువైనా సైన్యనాశం ఇతఃపూర్వం ఎరుగనంతగా జరిగింది. కరికళ కూటాలు, తురగఝషాలు, (చేపలు) తుంగశరీర నౌకలు, కేతన ఘనమహోర్ములు, హతకళేబర డిండీరాల (నురుగుల)తో రక్తవాహినులు రణభూమి ముంచెత్తినై. నెత్తురులు కారుతున్నా, దెబ్బలు తగులుతున్నా, శరాలు నాటుతున్నా మడమ త్రిప్పకుండా వానరులు శత్రువుల కూల్చి కూలి పోతున్నారు. ఎట్టకేలకు వనచరవీరులు రాక్షసులకు పైచేయి కాగలిగారు. జానుగులకు, నాసికలకు, కనురెప్పల వెంట్రుకలకు, శరీరాలకు, గోళ్ళ

తోనూ, దంతాలతోనూ పొడిచి, కొరికి, నరికి, ఛేదించి, బాధించి విజయం సాధిస్తున్నారు. పండిన వృక్షానికి పక్షులు పరిగెత్తినట్లు ఒకొక్క దానవుని పైకి వందల సంఖ్యలో వానరులు పరచి నేల దొరగిస్తున్నారు. ప్రతి వీరులైన రాక్షసులు ఊహించక పరశ్వధ శూల కృపాణ పట్టిశ పరిఘా గదాలతో వానరులను కూల్చారు. చీల్చారు. నొంచారు. త్రుంచారు. కుప్పల పడగా, డీలుపడగా, కొండల ముంపగా, తల్లడిల్లగా, చెతగొనగా పారద్రోలారు. సురవైరులు విజృంభించగానే, హరి సంతానం విరిగి పారిపోయి ఆర్తశరణ్యుడైన రాముని శరణుజొచ్చారు. తనవారి పాటు, శత్రువుల పోటు చూచి రాముడు కోదండం చేపట్టాడు.

## శ్రీరాముడు మూల బలాన్ని చంపుట

ధనువు దాల్చిన దాశరథి నారి సంధించి శత్రుకోటిలో చొరబడ్డాడు. శరవర్షం కురిపించాడు. సూర్యుణ్ణి మేఘాలు దరిచేరలేనట్లు, దవాగ్నిని దాయరానట్లు, ప్రవాహాన్ని సమీపించలేనట్లు రాముని రక్కసులు చెంత చేరలేక పోయారు. దవానలం చెలరేగి కాననాన్ని కాల్చినట్లుగా రాముని అగ్ని బాణాలు రక్షో వీరుల తాకి అగ్నిలోపడ్డ మిడుతల గుంపులాగా చేసినై. ఇదమిత్థం అని నిర్ణయించరాని జవంతో రాముడు శర ప్రయోగం చేస్తుంటే ప్రళయ ఝంఝామారుతాన్ని అడవి ఆగలేనట్లు అసురులు ఛిన్నాభిన్నంగా, విధ్వస్కన్నంగానై చూడరానట్లు రణభూమిలో రాలి పోయారు. కూలే తల, తూలే తల. వ్రేలే తలలు ఒక వంక, దగ్ధభగ్న పీడిత తనువులై గుట్టలుపడుతున్న సైన్యం మరొకవంక కనుపించటం తప్ప, రాముడుగాని, ఆయన కోదండంగాని, శరంగాని కనుపించటంలేదు. ఇంద్రజిత్తు మాయాయుద్ధాన్ని అప్పుడే రాముని యుద్ధం తలపించింది. శత్రువులకు రివ్వున ప్రమోతలతో వచ్చి రొమ్మున నాటుకున్న బాణాలేకాని రాముడెక్కడ నుండి వేస్తున్నాడో దృష్టికందటంలేదు. ఇంద్రియ వ్యవహార్థం అదృశ్యంగా శరీరంలో నిల్చిన ఆత్మలాగా తోస్తున్నాడు. ఆ ధనుఃపాటవం ఇట్టిదని దేవతలే చెప్పలేకపోతున్నారు. రాముడు గాంధర్వాస్త్రం ప్రయోగించి పర భయంకర మహా రక్షస్సైన్యాన్ని సమ్మోహితమై దిగ్భ్రాంతిలో మునిగేట్లు చేశాడు. ఆ అస్త్ర ప్రయోగంతో అయోమయమైన అసుర సైన్యం ఎవరికి

వాడు ఎదుటివాడు రాముడని భావించి అన్యోన్యం పోరి అసువులు విడిచింది. ఈ ఏనుగులు కూలుతున్నై. ఇక్కడే రాముడున్నాడంటే, కాదు కాదు హయాలు ఆ వైపు కుప్ప తెప్పలుగా కూలుతున్నై. అక్కడే రాముడున్నాడని కొందరన్నారు. అది కానేకాదు. అక్కడా, ఇక్కడా లేడు. అదిగో అటు చూడండి. రథాలతో రథికులు నేలపాలవుతున్నారు. అక్కడున్నాడని అన్నారు మరికొందరు. ఆ విధంగా అనుకుంటుంటే అశుగాలు వచ్చి తాకటంతో అయ్యో! ఇక్కడే రాముడున్నాడురా దేవుడా అంటూ కొందరు చచ్చిపడుతున్నారు. ఆ నడుస్తున్నవాడు, ఆ వైపుపోతున్నవాడు, ఇటు నవ్వు చూస్తున్నవాడు, ఆ కత్తి ఎత్తినవాడు, ఆ శరప్రయోగం చేసే వాడు రాముడే అని తల్లడిల్లిపోయారు. చివరకు నీవే రాముడవు, నీవే రాముడవు, చిక్కావు. నిన్నిదే చంపుతున్నానంటూ వొకరిని వొకరు పొడుచుకుని చచ్చారు. వొకరికి పెక్కుమంది రాములుగా, పెక్కుమందికి వొక్క రాముడుగా అనితర సాధ్య ధనుఃపాండిత్యంతో, అలాత చక్రంవలె, జవ గమనశక్తిచే ఇంద్రజాల భ్రాంతి కల్పిస్తూ రాముడు యుద్ధం చేశాడు. అంగనాభి, సత్త్వార్చి శరారం, నేమిచాపం, జ్యానిస్స్వనరవం, తేజోబుద్ధి, గుణ జ్వాలం, దివ్యాస్త్రధారం, దీపితం, రాక్షసాంతకం అయిన రామచక్రం కాలచక్రంగా పరిభ్రమించి, పదివేల సైన్యం, పవనవేగంగల రథాలు పదినూర్లు, గజ సహస్రాలు, అసంఖ్యాక హయాలు, సాదులు, యోధులు, పదాతులు పూర్ణ శతసహస్ర యుగ్మకంగా మూలబలాన్ని మూలముట్టుగా హరించింది. మూడుం ముప్పాతిక ఘడియలో వాడిగల వేటములతో నిస్సహాయుడై, పాపచారియై, లోక కంటక పరాక్రమములైన రావణుని మూల బలం రాముడు నిశ్శేషం చేశాడు. లంకా రక్షణం తప్ప, యుద్ధ సంకటంలో బతని మహారథులు, అస్ఖురిత పరాక్రములు, లెక్కకందని వారు సత్య పరాక్రముడైన రాముని కోదండ పాండిత్యానికి ప్రాణాలర్పించి ప్రశంసించారు. హతశేషులు, హతరథులు, హత తురగులు, హతకేతనులు కాందిశీకులై దాపులప్పి కన్నులొట్ట పోయినట్లు లంకకు చేరారు. క్రుద్ధుడైన ఫాలాక్షుని సమిద్ధాక్రీడం అన్నట్లు రాముని యుద్ధం సాగటంచూచిన సిద్ధర్షి దేవతాగణం వినతులు చేసింది. సూర్యోదయపూర్వం రణభూమికి వచ్చిన మూలబలం సూర్యోదయం అయ్యేసరికి చంద్రోదయానికి చెదిరిపోయిన చీకట్లు

లాగా రాముని శరవాతూలానికి చెదరిపోయింది. రావణుడు తాను వచ్చేవరకు రణం సాగిస్తారని నమ్మి పంపించిన మూలబలంకథ గాథగా ముగిసింది. మళ్ళీ రణాంగణం ప్రశాంతంగా మారిపోయింది. ఇంతలో శత్రువులు వచ్చే జాడ లేనందున శ్రీరాముడు శాంతించి, ధనువున గుణం సడలించి లక్ష్మణుని కందిచ్చాడు. అంతవరకు పిండిబొమ్మల్లాగా నిల్చి సమరం చూస్తున్న రవి పుత్రునీ, రాక్షసరాజునూ, హనుమంతునీ, జాంబవంతునీ, ద్వివిదమైందులనూ, మిగిలిన కీశవీరులనూ చేరపిలిచి, శ్రీరాముడు చిరునవ్వులతో "పూజ్యులారా! నా చేసిన యుద్ధాన్ని చూచి మీరు ఆశ్చర్యం పొందుతున్నారు. నిజమే. ఈ అస్త్రవిద్య, శక్తి, కల్పాంతకుడైన త్రిలోచనునికీ, నాకూ తప్ప మరెవ్వరికీ లేవు. ఇప్పటికి మనం విశ్రాంతి తీసుకుందాం. ఆపై సంగతి కొంతకాలం ఆగి ఆలోచిద్దాం" అని చెప్పాడు. అంతగా సాగిన ఆ భయంకర యుద్ధంలో రాముని శరీరం కసిగందలేదు. చచ్చిపడిన రాక్షసవీరుల పరాక్రమం అంతా ఏమైందో ఏమో. పొడుపు కొండపై తోచే పొడుపులాగా వెలుగుతున్న రామ చంద్రుణ్ణి దేవతలు, మహర్షులు, శాఖాచరులు ప్రశంసలతో ముంచివెత్తారు.

## రాక్షస కాంతలు ఘోరంగా ఏడ్చుట

ప్రాణాలతో లంకచేరిన భటవర్గం, సాశ్వం, సనాగం, సధ్వజంగా మూలబలం రామబాణాగ్నికి ఇంధనమైపోయిందని చెప్పింది. ఆ వార్త వినగానే ఇంటింటా శోధనానికి మారుగా శోకదేవత విలయతాండవం చేయసాగింది. ఆ లంకానగరం ఎంతమేర వ్యాపించి వుందో అంతమేర ప్రత్యణువు కంపించి పోయింది. హతపతులు, హతసుతలు, హతబాంధవులై అసురకాంతలంతా నేలబడి పొర్లాడుతూ, గుండెలు, మోములు కొట్టుకుంటూ, తలలు పీక్కుంటూ హా అని సముద్రఘోష లుప్తంకాగా ఘోరంగా ఏడ్చారు. ఒకరితల ఒకరు కొట్టుకున్నారు. ఒకరిని ఒకరు కౌగిలించుకున్నారు. పోయినవాళ్ళ గత గాథలు త్రవ్వి పోసుకున్నారు. "నిత్యకల్యాణం, పచ్చ తోరణంగా, స్వర్గాన్ని మించి సుఖ భోగాలతో తేలించే లంకా నగరానికి ఎంత గతి పట్టించావే ముప్పనాతిముండా?" అని కొందరు ఏడ్చారు. "ఎందుకుపోయిందో ఆ ముసలి పక్కి? ఆ మిట్టపండ్లు, ఆ వ్రేలాడేపొట్ట, చేటంత చెవులు, దబ్బనాల్లాంటి గోళ్ళతో, చింపిరితలలతో, గూనితో, మిడి గ్రుడ్లతో,

సువనష్టపు (మృతనష్టం) అంటం ఒలకపోస్తూ మిడిమేలంగాపోయి అడివిలో ఎక్కడో తలదాచుకుంటున్న ఆ రాజపుత్రుణ్ని, మన్మథ మన్మథుణ్ని, పూర్ణచంద్రవదనుణ్ని ఏమని పలచింది? ఈ ముండకు అంత యోగ్యతా? సకల భూత హితాసక్తుణ్ని ఈ లోకనింద్య కోరితే అతను నిరాకరించక పెనవేసుకుంటాడా? ఆ మహా సాధ్విని చంపబోతే ఇంత పరాక్రమవంతుడు ఊరకుంటాడా? అయినా ఊరకున్నాడు. అంతతో ఆగక ఈ ముక్కిడి లక్ష్మణునిపై ఎందుకు పడాలె? ఆయన ముక్కు చెవులేకాదు కంఠం కోస్తే సరిపోయేది. ఈ నగరానికి ఇంత దుర్గతి పట్టేదేకాదు. ఈ చెడిపెడు వివేకం ఎక్కడుంది? ప్రభువు సోదరినని పట్టపగ్గాలు లేకుండా తిరిగిందే కాని, మంచీ చెడ్డా ఆలోచించిందా? తానెక్కడ? ఆయనెక్కడ? ఈ కురూపి ముండకు ఆ సుధాకర వదనుడు కావాలా? నెరసిన తలవెంట్రుకల డొక్కు ఏమని ఇందిందిరాలకుని మోహించింది? అవినీతివర్తన ఏకపత్నీవ్రతుని ఆశిస్తుందా? ఈ తాల ప్రమాణ హస్త గజతుండ సన్నిభ బాహువుని ఆలింగనానికి ఆరాటం పొందిందా? తనకూ తన పాడు రూపానికి తగినవాడు రాముడా? రాక్షసుకే ద్రోసివేసేకే. ఇది లోకులువింటే నవ్విపోరా? తిట్టిపోయరా? ఇటువంటి ఆగడం ఎక్కడైనా ఎప్పుడైనా విన్నామా? కన్నామా? తాను చెడ్డ కోతి వనమంతా చెరిచినట్లు ఖరదూషణుల సమూలం నాశం చేయించింది. కడుపులో నిప్పు కదలకుండా కాపాడే రాజుకూ, రాముడికీ వైరం పెట్టింది. ప్రభువైనా ఆలోచించావా? వంశానికి పుట్టుకున్న కాలపాశంలాగా సీతను తెచ్చావు. తెచ్చి ఏమి ప్రేమిస్తున్నావు? బతికి వుండగా ఆమె స్వాధీనం కావటం మిథ్య. వృథా బలవద్విరోధం పెంచుకున్నావు. విరాధుడు ఆమెను కోరి వినాశం పొందాడు. ఇంతకంటే వేరే నిదర్శనం ఎందుకు?

పదునాల్గువేల బలవంతులైన రాక్షసులు తలపడి పేరు మాసిపోయారు. మదమత్తులు ఖరదూషణ త్రిశిరులు కాలధర్మం చెందారు. ఇంతకంటే గొప్ప నిదర్శనం ఇంకొకటి వుంది. యోజనబాహుడు, శోణిత భోజనుడు, ఘోరబలుడు కబంధుడు కాలునివాసంలో కాపురం పెట్టాడు. ఇంకా చెప్పాలంటే మేరునిభసాహసుడు, ఇంద్రుని పుత్రుడు, హరిని మెప్పించిన తపస్వాలి, వాలిని ఒక్క బాణంతో వధించిన రాముని వీరతకు ప్రబల ప్రమాణం. ఆయన పరాక్రమానికి ఎన్నని నిదర్శనాలు చూపించటం?

ఇప్పటికిప్పుడు అపారం, అసంఖ్యాకం అయిన మూలబలం మూడు గడియల్లో రామునిచేత నిర్ధూమధామం అయిందంటే, మానవాకారం దాల్చిన విష్ణువో, రుద్రుడో రాముడు కావాలె! ప్రభువు ధోరణిచూస్తే మనం ఈవిధంగావీనుస్తూ కూడ బ్రదికేట్లు లేదు. రేపు గడపటం, గడపటం మనకు తెలియదేమో. ఇందరం ఇక్కడ దిక్కుమాలి దేవెరిస్తుంటే, రామునివల్ల తనకు రాగల ప్రమాదం గుర్తించక వరబలం వుందని గర్వపడుతున్నాడు. చచ్చిన ఇంద్ర జిత్తుకు ఆ వరాలు ఎన్ని లేవు? ఆతను కూలిపోలేదా? యుద్ధానికి ఎలాగూ పోతాడు. ఆయన దృష్టిలో పడనూ పడతాడు. పడి చావనూ చస్తాడు. ఆయనకు విరోధిగా నిలిచిన వాళ్ళకు లోకంలో ఆశ్రయం ఇచ్చేవాడెవ డున్నాడు ?

ప్రభువు చేయించే ప్రతి రణంలోనూ ఉత్పాతాలు పెక్కు పుట్టు తున్నై. రేపు జరగబోయే సంగ్రామంలో రామునిచేత మన రాజు హతుడు గాక తప్పదు. ఎందుకంటే, బ్రహ్మను కోరినవరాల్లో అమర ఖగాహి రాక్షస సమూహంచేత చావులేకుండా మాత్రమే కోరబడింది. కాని, నర వానరులను అందులో చేర్చలేదు. గర్వం కన్నుగప్పింది. బుద్ధిభ్రంశం కలిగించింది. ఆ ఫలం ఇప్పుడు నరవానరుల రూపం ధరించి వచ్చింది. రావణ వధతో రాక్షస కులం నామరూపాలు లేకుండా పోతుంది. పూర్వం వరబలంతో ప్రభువుపెట్టే హావడికి ఓర్చలేక దేవతలు ధాతతో మొరలు పెట్టుకొనగా "దానవులు, రాక్షసులు ఈనాటినుంచీ భయంతో మెదలుతారు" అని చెప్పాడు. ఆ మాటలకు తృప్తిపడక ఈశ్వరుణ్ణి వేడుకున్నారు. ఆ భక్తసులభుడు అమరులను ఆదరించి "మీ మేలుకై అసురహంత్రియైన ఇంతి పుట్టుతుంది. దానవుల నాశనానికి షుత్తులాగా, రాక్షస నాశనానికి ఆ యింతి తోడుపడు తుంది పొం"దని చెప్పి పంపాడు. ఆ ఇంతే ఈ సీత. కాకపోతే లోగడ ఎంతమంది స్త్రీలను బలాత్కరించి తెచ్చాడు? వాప్పుగాని, వాళ్ళ వాప్పుగాని ఏం చేశారు? ఈ పరమ మూర్ఖుడు ఏం అనుభవించాడని ఇంత నాశనానికి ఇష్టపడ్డాడు? ఎరకోసం గాలంలో చిక్కిన చేపలాగా ఆశతోనే అసువులు అర్పించబోతున్నాడు. ఈతనికి బుద్ధి వక్రం. తెలివి శూన్యం. అహంకారం అధికం. నీతిమాట తలపెట్టని పాతకుడు. వీడి పాపం వీడితోనేపోక లంకనే నాశంచేసింది. ఏ పాపం ఎరుగని కులస్త్రీలకు యావజ్జీవితం దుఃఖం తెచ్చి

పెట్టింది. ఉదయకాల సముద్రుని లాగా భయంగొలిపే రామచంద్రునివల్ల కలిగే భయంనాపి రక్షించే దాతలు మూడు లోకాల్లో ఎవరూ లేరు. వారు చిచ్చులో తగులబెట్టనున్న వనకరేణువులవలె ఘోషపెట్టుతున్న మన రక్షణకోసం రామ కోపాగ్నిలో దగ్ధమయ్యే మహాత్ముడెవ్వడు? నీతిమంతుడు, వివేకంగలవాడు విభీషణుడు అర్థమైన కార్యం సకాలంలో ఆచరించి అంతకపాశం నుంచి విముక్తుడైనాడు. మనకా అదృష్టంలేదు. ఒకవేళ వుంటే విభీషణుడే రక్షించాలె. అంతవరకు మనం జీవించి వుండాలె" అని అసురకాంతలు అంతు లేకుండా ఏడ్చారు. ఆ ఏడ్పుకు దిశలు విదిశలు ప్రతిధ్వనించినై.

## పంక్తిముఖుడు పౌరుష వాక్యాలు పలుకుట

ఆర్తేశుల, ఆత్మబాంధవుల, ఆత్మతనూజులదాసి ఘోరంగావిడుస్తూ, తన దుర్గతికి మొగం మొత్తుకుంటూ, ఇంత అనర్థానికిమూలమైన దుష్ప్రవర్తనను ఆలోచిస్తూ, రావణుని దూషిస్తూ గోడు కుడుస్తున్న అంగనల ఘోష లంకేశుని కర్ణాల్లో నిశ్చయగా ప్రవేశించింది. ఆ సత్య వచనాలకు అమూల చూడం చలించిపోయాడు. కనులుమూశాడు. ధ్యానమగ్నుడైనాడు. గతజీవితగాథ సింహావలోకనం చేశాడు. "నేను బ్రహ్మ వంశంలో జన్మించాను. నా ప్రత్యర్థి క్షత్రియుడు. నా అగ్రజుడు ధనేశుడు. తమ్ముడు కుంభకర్ణుడు. పుత్రుడు ఇంద్రజిత్తు. ఇంతటి సౌభాగ్యం రామునకులేదు. నేను దశగ్రీవుణ్ణి. వాడు ఏకగ్రీవుడు. వింశతిభుజుణ్ణి నేను. ద్విభుజుడు వాడు. కామచరులైన దైత్యులు నా పరివారం. ప్లవగులు అతని పరివారం. సముద్ర మధ్యంలో వుంది నా రాజధాని. భూమిపై వుంది వాడి రాజధాని. ఘోర తపస్విని నా తల్లి. లోక ధర్మం కలది అతని తల్లి. నేను బ్రహ్మచే దివ్య వరాలను పొందినవాణ్ణి. అతడు లోక సామాన్య గుణ విశిష్టత గలవాడు. మాకు ఎక్కడా పోలికలేదు. సమస్థాయి లేదు. అయినా అతడే ఇంత నా శక్తిని నిగ్రహించాడు. సర్వం నిష్ఫలితం. విధి బలీయమై దైవబలం నాపట్ల దుర్బలమైంది. విధి అనుకూలించి అతనికి దైవబలం అధికమైంది. ఇప్పుడు నా కర్తవ్యం ఏమిటి? ఏ కొద్ది పరివారమో తప్ప సర్వం శూన్యమైంది. ఇందరిని పోగొట్టుకుని నేను జీవించి ఏం ప్రయోజనం? ఎవరికి సంతోష కారణం? సంతోషించేవారంతా సమర రంగంలో చావనే చచ్చారు. ఇప్పటికే

లోకం నన్ను మూర్ఖుడుగా ముద్ర వేసింది. ఎంతకాలం వున్నా ఈ సౌఖ్యాలూ, ఈ కష్టాలే కదా? క్రొత్త ఏముంది? నా తమ్ముడు పొందిన స్థానాన్నే నేనూ పొందుతాను. నా సేవ కార్యాల్లో పాలు పంచుకున్న వాళ్ళు నాతో పూర్తి అవుతారు. నేను నిజంగా మూర్ఖుణ్ణి, మోహం కలవాణ్ణి అయితే సీతను ఎందుకు బలాత్కరించలేదు? అప్పుడే శాప శక్తిచే చచ్చేవాడినేకదా? అప్పుడు నేనే చస్తాను. అనుయాయులంతా వుంటారు. దానివల్ల వచ్చేదేముంది? రాముని చేతిలో వీరుడుగా పోరి మరణిస్తే, స్వర్గం మోక్షం రెండూ వస్తై. నింద లేకుండా బొంది పోవన్నారు పెద్దలు. నాచే కొనితాబడిన సీత, సీత నా నాశన కారణం అవుతుంది. అది గాక దైవ నిర్ణయమైన కాలం ఒరిగి పోయింది. అవసానకాలం చేరువైంది. కనుకనే మహాశక్తిగల నా వారంతా నర మర్కటులచేత నాశం పొందారు. సముద్రంపై సేతువు సాధ్యమా? అయింది. నేను దైవాన్ని ద్వేషించాను. దైవం శిక్షించింది. దైవంలోనే లీన మవుతాను. ఇక నా స్థానం అక్కడ. ఇక్కడ కాదు" అని తన జన్మ సార్థక్యాన్ని గురించి భావించి నిర్ణయించాడు. ఆ నిర్ణయంతో అతనిలో క్షుభిత మవుతున్న శోకం దురాగ్రహంగా రూపొందింది. అగ్నిగోళాలై నేత్రాలు విస్ఫులింగాలు విరజిమ్మనై. భీకర భయంకరమైంది మోము. అతనిహాసాన్ని అసురులే చూడలేకపోయారు. పట పట పండ్లు కొరికాడు. ఫట ఫట రక్తం పెదవుల నుంచి స్రవించింది. మట మట లాడింది వదనం. కట కట పడింది హృదయం. సమీపంలోవున్న భటుల గుండెలు టపటప కొట్టుకున్నై. కోలాహల శూన్యంగా, శోకదేవతా సంచారంతో నిండిన ప్రదేశాన్ని, భటులనూ చూశాడు. ఆగ్రహంతో మాటలు తడబడగా భటులతో "మీరువెంటనే పోయి, మా ఆజ్ఞ తెలిపి మహాపార్శ్వ విరూపాక్షుల, మహోదర సహితంగా సైన్యంతో సమర భూమికి పొమ్మని చెప్పండి" అని చెప్పాడు. రాజాజ్ఞ మేరకు దళవాయులు సర్వసన్నద్ధులై వచ్చి వినయంతో నమస్కరించి నిలుచున్నారు.

"ఓ వీరులారా! హాని కాలం వచ్చిందని కలత పడకండి. జయాపజయాలు దైవాధీనాలు. జరిగినదానికి విచారించిన ఫలితమేముంది? మీ వెంట నేనూ వస్తాను. సంరక్త సూర్యకల్ప శరజాలంతో సమర భూమిని మండించి రామలక్ష్మణుల ప్రథమంగా అంమలో త్రేలుస్తాను. అనంతరం రవిపుత్ర

దాములతో, తోకళ్ళతో, గొడ్డళ్ళతో, గండ్రగొడ్డళ్ళతో యుద్ధ పరికరాలు కాక, ప్రహరించటానికి పనికివచ్చే సామాన్య సాధనాలతో తరలి వచ్చారు. దివ్యం, భీమం అయిన తేరెక్కి, సత్త్వగాంభీర్యాలు సముద్రమంతగాగల్గి అవని బద్దలయ్యేట్లు అసురనాథుడు అనితలానికి పయనమైనాడు. ఆయన వెంట మహాయోధాగ్రేసరులైన మహాపార్శ్వ మహోదర విరూపాక్షులు రథారోహణం చేసి, అర్పులు, బొబ్బలు పెడుతూ అనుసరించారు. సజ్యశరాసనుడు, శితశరపాణుడు అయిన దశకంఠుడు, జవనాశ్వాలు గల రథం కదలి ఘంటారావాలు చేస్తూండగా రామ లక్ష్మణులు కాస్తున్న ఉత్తరద్వారం చేరబోయాడు.

## రావణునకు అవశకునాలు అగుపించుట

లంకేశుడు ఉత్తరద్వారం చేరేసరికి వెలుగుతున్న భాస్కరుడు కాంతి మాసాడు. గాఢంగా చీకట్లు క్రమ్మినై. భూమి కంపం పొందింది. పర్వతాలపై నుంచి బండలు దొర్లిపడినై. సముద్ర తరంగాలు ఆకాశం అంటేట్లు లేచినై. పలాశ శకుంత సంతానం క్రూరంగా కూసింది. ఆకసం నుంచి రక్తధారలు పడినై. నక్కలు, తోడేళ్ళు గుంపులుగట్టి అశుభంగా అరచినై. రథకేతనాలపై గ్రద్దలు వ్రాలినై. గుర్రాలు కాళ్ళుజారి పడ్డై. వామ భుజం, వామ నేత్రం నిర్నిమిత్తంగా అదిరినై. స్వీయ వదనంలో కళ తరిగింది. కంఠధ్వనిలో గద్గద చేరింది. పిడుగుపాటుగా ఉల్క రాలి పడింది. జరగబోయే యుద్ధంలో ప్రమాదం తెలుపుతూ నక్కలు, కాకులు ఘోరంగా కూసినై. యుద్ధం కోసం లంకానగర ద్వారం చేరే యోధుల కందరికీ ప్రకృతి తన అసమ్మతి అవశకునాల ద్వారా తెలుపుతూనే వుంది. తెలిసికూడా గర్వంతో త్రోసివేసి పోయారు. పోయి కాలధర్మం చెందారు. ఇప్పుడు మళ్ళీ ఆ ప్రకృతి రావణుని హెచ్చరించింది. అయినా లక్ష్యపెట్ట లేదు. ముందుకే రథం నడిపించాడు. కాలప్రేరితుడైనవాడు శాస్త్ర సంప్రదాయాలను ఎందుకు గౌరవిస్తాడు? అతని దృష్టిలో అన్నీ పరిహాసాలుగానే భాసిస్తై. కాకుంటే పంక్తిముఖుడంతటి ప్రాజ్ఞుడు తనకశుభం చెపుతున్న దుశ్శకునాలను ఎందుకు త్రోసేస్తాడు? రావణుని రథం ద్వారం దాటింది. రాక్షసుల ఆర్భాటం మింటినంటింది. దానికి అధికంగా రథికుల ధనుష్టంకార

నాదం చెలరేగింది. మూలబలనాశంకాగానే వానరులకు ఊరటిచ్చింది. విశ్రాంతి పొందుతున్నారు. ఇంతలో వైరుల ఆర్భాటం వినవచ్చింది. వెంటనే కపులు యుద్ధానికి సిద్ధపడ్డారు.

## రావణుడు కపుల అసంఖ్యాకంగా చంపుట

ఇరువాగుల వారు ఎందుకో ఇది తుది యుద్ధంగా భావించారు. రావణ విజయంకోసం రాక్షసులూ, రాముని విజయంకోసం వానరులూ ప్రాణార్పణం చేయటానికి సంకల్పించారు. ఆదేం ఉత్సాహమో రెండు పక్షాలు రెండు సముద్రాలు, రెండు పర్వతాలు ఢీకొన్నట్లు ఢీకొన్నై. ఆగ్రహోదగ్రుడైన రావణుని రథం "భూసంచారం మాని గగన సంచారం చేస్తుందా?" అన్నట్లు వానర వాహినిపై వీరవిహారం చేసింది. కాంచనమండిత రత్నాంక నిశితాలైన బాణాలు పగవాళ్ళ శాపాలవలె ప్లవగులపై బడి ప్రాణాలు తీస్తున్నై. గుండెలుపగిలి నేలకూలేవారు, శిరాలు తెగి దొర్లేవారు, చేతులు తెగినవారు, డొంకలు చీలినవారు, ప్రక్కలు డొక్కలు పగిలినవారు, ముక్కులు, తోకలు ముక్కలుపోయినవారు, పెదవులు తెగినవారు, మొర్రో అని మొత్తుకునేవారుగా వనాట సైన్యం కనురెప్పపాటులో శ్మశానంగా మారిపోయింది. కత్తులతో నరికినట్లు, వాడికత్తో చెక్కినట్లు, రంపాన కోసినట్లు, ద్రోపుడు పట్టినట్లు, ఉలులతో మలచినట్లు, తరిమిమొనపట్టినట్లు, తురిమినట్లు, తరిగినట్లు, కొరడి మాడినట్లు, కార్చిచ్చు క్రమ్ముకున్నట్లు, పంక్తిముఖుడు వేటాడి కపుల రూపుమాపాడు. పంచశీర్ష భుజంగాకార కోదండ మండితుడై రావణుడు, విశ్వరూపం దాల్చినట్లు అన్నిదిక్కుల తానమై చిత్రవిచిత్ర గతులతో ఉరగ సంతానం వర్షించి అగచర సైన్యాన్ని చీకాకుపరచాడు. చిందరవందరొనరించాడు. గుణాన్ని మీటాడు. కపుల గుండెల్లో ములుకులు నాటాడు. అంబరనాథ రథో త్క్షిప్తమై ఆ శరవారం అగచర సైన్యాన్ని అగ్ని శలభాలను మ్రింగినట్లు మ్రింగింది. మారుతధూత మేఘాలవలె, దవానల దహ్యమాన కాంతార గజాలవలె రావణుని శరాసారానికి మర్కటులు, హరిసేనలు పోయిందే పోకగా పారిపోయారు.

## రవిపుత్రుడు రాక్షసుల చంపుట

గుల్మస్థానంలోవున్న సుగ్రీవుడు తన కపిసేన హతమైపోవటం, హతశేషులు పారిపోతుండటం చూచాడు. కడుపు మండింది. కళ్ళల్లో నీళ్ళు తిరిగాయి. తనతో సమానుడైన సుషేణుని తన స్థానంలోనే నిల్పి శూరులైన యూథనాయకులతో రణంలో ప్రవేశించాడు. రాముడున్న దిక్కుకు రావణుడు తోలించాడు రథం. కల్పాంత రుద్రుడులాగ కపి లోకపతి వీరనిశాచరులపై విరుచుకుపడ్డాడు. దళపతులు విజృంభించారు. నాయకులు సమరంలోకి రాగానే పారిపోయే ప్లవగ సైన్యం వెనుకకు తిరిగి మళ్ళీ సంకుల సమరంలోకి దిగింది. రక్షకుడైన రాముడు శరవర్షం కురిపించి శత్రు నాశనం చేసినట్లే, రవిపుత్రుడు రేగి శిలా పర్వత వృక్షం వర్షించాడు. ఆ ప్రహరణ సాధన శ్రేణి వేగానికి రాక్షస సైన్యం రక్తం క్రక్కింది. విచ్ఛిన్న శీర్షం, విభగ్నకాయం, విస్ఫోటిత శోణితం, విదారిత దేహం, విధ్వంసకరచరణజానుజంఘం, విదీర్ణ వక్షఃప్రదేశం, విపాటితాస్థి సంతానంబయి, క్షీయమాణమై, ప్రళయానిలాహతికి ఫలపత్ర పుష్పాలు రాలి మోడులై పడిన వృక్షజాలంలాగా రణభూమి బీభత్సంగా రాలిపోయింది. అంతవరకు వ్యూహ పాలనంచేస్తూ, రామాజ్ఞ లేక రణరంగంలోకి రాని రవిపుత్రుని క్రోధాగ్ని, రావణుని రాకతో, తన సైన్యం పోకతో, అంతకంతకు పుంజుకుంటున్న అవమానంకాకతో, వైరులు ఆపలేని ధాటితో పరవళ్ళు త్రొక్కింది. రావణుడు తన పక్షాన్ని బాధించి భంగించినట్లే, తాను కూడ వాడి పక్షాన్ని వేధించి, సాధించి బలిగొని పగ తీర్చుకున్నాడు.

## సుగ్రీవుడు విరూపాక్షుని చంపుట

శిక్షిత రాక్షసుడై ప్రళయాంతకుని వగిది తేరి చూడరాక నిశాట సైన్యాన్ని నామరూపాలు లేకుండా నాశనం చేస్తున్న మర్కటపతిని విరూపాక్షుడు నిల్వరించాడు. రథాన్ని దిగి గజాన్ని ఆరోహించాడు. జడివాన చందంగా వానరులపై, వానరపతిపై అమోఘంగా బాణాలు వర్షించాడు. విరూపాక్షుని రాక గాంచిన రక్ష సైన్యం తిరిగి కూడగట్టుకుని విజృంభిం

చించి. మళ్ళీ పోరు ఘోరాతిఘోరంగా సాగింది. అసురనాయకుని అస్త్రపాతంతో భానుపుత్రుడు బాగా నొచ్చాడు. మర్మాంగాలు మంట పెడ్తున్నై. ఆ మంటకు తోడు విపరీతంగా ఆగ్రహాగ్ని పెల్లుబికింది. "ఇక వీడు బ్రదికి వుంటే ప్రమాదం తప్పదు" అని భావించటం, పెనువృక్షం పెకలించటం, పటిసెల రాయివలె పైకి దూకటం ఏన్గు కుంభస్థలం పగలబాదటం వెంటనే జరిగిపోయింది. ఆ ప్రహారానికి ఆగలేని మాతంగం ధనుఃప్రమాణం ప్రక్కకు దాటి ఘోరంగా ఘీంకరిస్తూ కూలిపోయింది. గజంపై నుంచి వాడు క్రిందికి దూకి ఖేటం, ఖడ్గం ధరించి వానర నాథునిపైకి లంఘించాడు. సుగ్రీవుడు వాడు తన్ను తాకకుండా పర్వతాన్ని విసిరివేశాడు. వాడు దాన్ని తప్పుకొని ఒక్క లంఘనంలో సమీపించేకొలది కత్తిచేత ప్రహరించాడు. ఆ దెబ్బకు దిమ్మ దిరిగి కీశుడు మూర్ఛ మూర్ఛపోయాడు. ఆ మరుక్షణంలోనే తెలివి తెచ్చుకుని సంజాత రుషాతిరేకుడై, ముష్టి బిగించి, గాలి పూరించి బలంకొద్దీ గుండెలో గ్రుద్దాడు. తత్క్షణం, తనుత్రాణం, ఖడ్గం తునియలై పడేలాగా ఎగిరి కాలితో తన్నాడు. ఆ తన్నుకు అవశత్వం పొంది నేలపడి లేచి సుగ్రీవుని మూర్ధంపగుల నడిచాడు. దాన్ని తట్టుకుని దృఢ ముష్టి ఘాతంతో ఫాలం పగిలిపేట్లు రవిపుత్రుడు చేశాడు. ఆ తీవ్ర ముష్టి పీడనానికి నరాలుచిట్లి, తల పగిలి, నెత్తురు క్రక్కి, వికృత నేత్రుడై విసుమకొని నేలపై పడి ఊపిరి విడిచాడు. చచ్చేముందు విలవిల తన్నుకుంటూ వికారంగా అరుస్తూ గ్రుడ్లు త్రిప్పుతూ కూలిపోవటం అగచరులంతాచూచారు. ఆనందంతో కిలకిలారావాలు చేశారు. శోకంతో రాక్షసులు దశపతి చాపుకు వచ్చారు.

## సుగ్రీవుడు మహోదరుని చంపుట

ఈ విధంగా రెండు సైన్యాలు రోసుతో తలపడి నిదాఘ సమయంలో సరస్సుల్లో నీళ్ళు ఇంకినట్లుగా నశించిపోయినై. అంతలో పంక్తిముఖుని సైన్యం బహుభంగుల పరాస్తం కావడం, విద్విషద్భీకరుడు విరూపాక్షుడు మృత్యువుపాలు గావటం అనుకోకుండా జరిగిపోయింది. ఆ అనూహ్య పరిణామానికి అసురపతి అంతరంగం క్షోభించింది. "తనంతవారైన మంత్రుల్లో ఒకరు తలపులోకి రాకుండగనే యమాలయం చేరారు. మిగిలింది మహోదర

మహాపార్శ్వుడూ, తానూ. ఇది అంతా దైవవిపర్యాసం. ఇప్పుడు గతాన్ని ఆలోచించే వ్యవధిలేదు. రణ పర్యవసానం నా మరణం, రాముని విజయం. రోటిలో తలదూర్చి రోకటిపోటుకు భయమెందుకు? చివరంటా యుద్ధంచేస్తాను. జీవం విడుస్తాను" అని నిశ్చయం తీసుకుని "మహోదరా! మహా దర్పనిధీ! నా జయం నీ మీద నిల్చింది. నీ బలం పూర్తి శక్తిమంతమైంది. స్వామి ఋణం తీర్చే అదను వచ్చింది. నీ శస్త్రాస్త్రాలు ధారపోసి శత్రు సంహారం సాధించు" అని చెప్పాడు. మహోదరుడు ఆ పల్కులు మహా ప్రసాదంగా గ్రహించాడు. ఆత్మశక్తికి అనురూపత అప్రతిహత తేజుడుగా ఆహవంలో నిజ సైన్యంతో దూరాడు. వానర సైన్యాన్ని ఊచకోత కోసినట్లు కంఠాలు ఖండించాడు. శరాసారంలో ముంచాడు. వనచరులు వాని ధాటికి ఛిన్న పాదులై, భిన్నపాణులై, నికృత్తోరువులై, దిక్కుమాలి దీనులై రణరంగం రాలిపోసాగారు. "పారిపోకండి. భయపడకండి. నేనున్నాను. రండి. సమరం చేయండి" అంటూ అగచరపతి ఎలుగెత్తి పిలిచి, విపుల పాషాణం పెరికి విరోధిపై విసిరివేశాడు. దాన్ని వాడు బాణాలతో పగులగొట్టి, విశిఖాలతో ముంచి ఎత్తాడు. సుగ్రీవుడు వృక్షంతో వాటిని వారించి "చావరా రాక్షసా!" అంటూ గిర్రున చక్రంగా త్రిప్పి విసిరాడు. అసురుడు ఆ అనోకహాన్ని అంతలింతలు తునియలుగా నరికివేశాడు. సమీపంలో పడి వున్న పరిఘను అందుకొని ప్లవగేశ్వరుడు రథంపై దూకి సారథి హయ రథాలను మోదాడు. ఆ పరిఘా ఘాతంతో సాశ్వ సారథికంగా రథం చూర్ణితమై పోయింది. వెంటనే మహోదరుడు మండుతూ ఇనుప గద ధరించి ఎదిరించాడు. ఇరువురు గదా పరిఘలతో కొంతసేపు పోరాడారు. ఆ ద్వంద్వ సమరంలో రాక్షసవీరుడు గద విసిరి వేశాడు. రవిపుత్రుడు పరిఘను ప్రయోగించాడు. ఆ రెండూ ఒకదానినొకటి తాకి ఖండాలై ధరణీమీద పడిపోయినై. పరిఘ విరిగిపడగానే ప్లవగేశ్వరుడు ముసలం వేశాడు. రాక్షసుడు దాన్ని మరోగదతో మట్టుపెట్టాడు. మళ్ళీ సాధన వ్యాయం వ్యర్థం కావటంతో హుంకరించి కలియబడి ముష్టియుద్ధాన్ని సాగించారు. అవకాశం చూచి అసురుడు కత్తీ, డాలు గ్రహించాడు. సూర్యసుతుడు కూడా ఆ రెండాయుధాలు అందుకుని తలపడ్డాడు. ఉభయులు మండల చారణం చేస్తూ ఖడ్గాఖడ్గి ఖణిల్లని మ్రోగుతుండగా పోరాడారు. అవకాశంచూచి

అసురుడు ఖడ్గంతో కొట్టబోతూండే కపీశుడు డాలు పగిలేట్టు కత్తిరించినాడు. ఆ కృపాణం డాలులోనుంచి తీసేలోపల మరొక కరవాలం అందుకొని సురశత్రుమూర్ధాన్ని నరికాడు. సురారి పాటుచూచి నిశాటులు కాలికి బుద్ధి చెప్పారు. ఖరకరపుత్రుడు అరిని హరించి ఘనరవుడు నిజరాశిని వెళ్లినట్లు వెలిగిపోయాడు. సురగణమహర్షులాతని స్తోత్రం చేశారు.

## మహాపార్శ్వుడు అంగదునిచే హతుడగుట

మహోదర విరూపాక్షులు మర్కట ప్రభువుచే మరణించటం చూచి, మహోగ్రుడై మహాపార్శ్వుడు ఉగ్రసాయకాలు ప్రయోగించి అంగదుడు రక్షించే వ్యూహం గండికొట్టి లోపల జొరబడ్డాడు. అతని శరవేగానికి, గాలికి ఫలాలు రాలినట్లు కపికుంజరాలు సహస్ర సంఖ్యల్లో రాలినై. కొందరికి చేతులు తెగినై, కొందరికి చరణాలు తెగబడినై, కొందరికి ప్రక్కలు చెక్కబడినై. ప్లవగులకు ప్రాణాశలేకుండపోయింది. వానర మిగిలినవారు తలలు వ్రేలవేసి సమరానికి విముఖులైనారు. తన కాపులోవున్న కపిసేన సర్వనాశనం పొందటం, హతశేషులు విగతోత్సాహులు కావటం చూసి, పున్నమనాటి సముద్రంవలె పొంగి అంగదుడు పట్టిసం త్రిప్పివైచాడు. అది తాకి వాడు సారథితో సహ నష్టసంజ్ఞుడై నేలబడ్డాడు. జాంబవంతుడు పెనుకొండవేసి శతాంగాన్ని నుగ్గుచేశాడు. గుర్రాలను చంపాడు. నేలపడిన నిశాటుడు పర్వతంవలె పైకిలేచి అంగదుని మేను బాణవిద్ధంచేసి, బ్రహ్మసుతుని రొమ్మున మూడమ్ములు నాటి, ఋషభనాయకుని, గవాక్షుని, గవయుని గాయపరచేసి ఆర్చాడు. ఇంద్రుని మనుమడు అంగదుడు ఉమడించిన కోపావేశంతో పరిఘ పట్టి త్రిప్పి త్రిప్పి వేశాడు. ఆ వేగానికి వాడిచేతిలో శరశరాసనాలు జారిపడ్డై. శిరస్త్రాణం ఎగిరిపోయింది. ఒక్కగంతువేసి కోపంతీర గూబ అదిరేటట్లు కొట్టాడు. ఆ దెబ్బతో తలదిమ్మెక్కిన దానవుడు దారుణమైన దాన్ని, మనోజ్ఞమైన దాన్ని, తైలమర్దనముల వెలిగే దాన్ని, దైవంతో సమమైనదాన్ని గండ్రగొడ్డలి చేబూని అంగదుని వామభుజప్రదేశం గురిచూచి విసరాడు. అంగదుడు దాని లక్ష్యాన్ని వంచన పైకెగిరి తప్పించి వజ్రంవంటి ముష్టితో గుండెపై గుద్దాడు. ఆ పోటుతో అసురుడు హృదయసోలంగా పరాసుడై భువిపై పడ్డాడు. నాయకుడు చావగానే త్రిదశారాతులు, కలవల

పాటుతో కాందిశీకులై పరిచారు. రాక్షసులను వెన్నంటి తరుముతూ వానరులు చేసే గర్జలకు లంక సౌధప్రాసాదంపై, పంకి పిడుగుపడుతుందా అన్న విధంగా ఊగిపోయింది. హత సుత పతి బాంధవలైన అసురకాంతలు చేసే రోదనధ్వనితో కలసి రోదోంతరాళం ఆ ధ్వనితో నిండింది.

## పంక్తిముఖుడు ప్లవగుల నురుమాడుట

రాము సమ్మిన ముగ్గురు మహాయోధుల మరణంతో అసురనేత యాశాపాశం తెగిపోయింది. "ఇక తన విజయం స్వప్నదత్త వరమైంది. ఇక మిగిలింది తనకి మరణం ఒక్కటే. అది నైచ్యంగాగాక వీరోచితంగా పరిణమించాలి. సర్వపాపాలు వీరుడై పోరి సమరంలో ప్రాణాలు విడిస్తే ఇహంలో కీర్తి, పరంలో వీరలోక సుఖం లభిస్తుంది. రాముడు సంగ్రామ భీముడు. అతనితో పోరితే జయమైనా, అపజయమైనా నా కీర్తినీ, నా జన్మనూ చరితార్థంగా వెలిగిస్తై. సారథీ! మహామంత్రులు, అజేయులు ముగ్గురూ మడిశారు. అన్నివిధాల దైవోపహతుడనైనా, ఆత్మశక్తి వుంది. విధాత ఇచ్చిన వరబలం వుంది. రణరంగంలో రక్తనదులు పారిస్తాను. రామలక్ష్మణుల చంపుతాను. రవిపుత్రుని చిత్రవధ చేస్తాను. పోనీ మన రథాన్ని. తొందరగా పోనీ" అని వేగిరపెట్టాడు. "సుగ్రీవాంగద హనుమ జాంబవంత సుషేణ మైందద్వివిద నీల గవయ గవాక్షాది కీశ లోకేశులనే శాఖలతో విస్తరించినదీ, సీతా కుసుమ ఫలప్రదమైనదీ అయిన రామ భూమిరుహాన్ని మొదలంటి నరుకుతాను. తొందరగా తోలు"మని హెచ్చరించాడు. సారథి మహారథసంతో రథంతోలుతుంటే ఆ శతాంగధ్వనికి దిశావలయం ప్రతిధ్వనించింది. కాంతారనదీ మహీధర కదంబసమేతంగా వసుంధర వణికింది. సాగరం నేల అతిక్రమించింది. తామస బాణాలు ప్రయోగించి దగ్ధంచేయసాగాడు. ధాత్రు నిర్మితమైన దారుణ మార్గణ పరంపరకు తరుచర సైన్యం ఆ భీకరార్చులకు బూడిదెగా అయిపోతున్నది. మూకుమ్మడిగా మొగ్గరం విడిచి గుట్టలనక, మిట్టలనక అదే పోకగా పారిపోతుంటే పదఘట్టనతో రేగిన ధూళి అక్షి రోధంగా దిశావలయాన్ని చీకటిలో ముంచింది. పంక్తివదనునిచే ప్లవగ సైన్యం పొందుతున్న పాటుచూచి కూడా రాముడు రావణుని ఎదుర్కోలేదు. అతడు తన కభిముఖుడుగా లేడు. కపులు తన్ను శరణుగోరలేదు. ఎందుకైనా మంచి

దని, ఉపేంద్రుని గూడిన ఇంద్రుడులాగా, లక్ష్మణునిగూడి ధనువు ధరించాడు.

## శ్రీరామ రావణ యుద్ధం

వానర సైన్యం రణరంగం వదలిపోవటంతో రాముని వెదుకుతుంటూ రథం తోలించి సమీపించాడు. ఇంద్రధనుస్సువలె వింతకాంతులతో ప్రకాశించే మహా కోదండం ధరించిన ఆజానుబాహున్ని, వికసిత పద్మదళ విశాలాక్షుణ్ణి కాలాంతకాభున్ని చూసి "ఈ మానవుడే నావాళ్ళనందరినీ నాశనంచేసి, నన్నవమానించినవాడు. ఇప్పటి ఇతని మూర్తి ఇతఃపూర్వంకన్న దుస్సహంగా వుంది. నాచే ఇంత సైన్యం నాశం పొందినా, మేమ గంభీరుడుగా తమ్మునితో నిలిచి చూస్తున్నాడేగాని, నాతో తలపడడేమి. ఎంత నిగ్రహం? ఎంత కర్మనిష్ఠ?" అని క్షణం ఆలోచించి రథాన్ని అభిముఖంగా పోనియ్యమని సారథిని కోరాడు. ద్వాదశాదిత్య మండలంలాగా ప్రకాశిస్తూ ఎదుట వస్తున్న రావణుని రాముడు చూచాడు. తనవారు పగతునిచే నిహతులైనందుకు దుఃఖించాడు. ఇప్పటికైనా ఎదురుగా ప్రత్యర్థిగా వచ్చినందుకు పొంగాడు. తన ఆప్తుల ఋణం తీర్చుకునే అవకాశం అబ్బినందుకు హర్షం పొందాడు. ఆ ఆవేశంలో చాపం సజ్యం చేశాడు. గుణం మీటాడు. ఆ ధ్వనికి భూమి అదిరి బ్రద్దలైంది. నిశాటవనాటులు కుప్పగా కూలిపోయారు. ఆ సమయంలో రామలక్ష్మణుల మార్గణ మార్గాన్ని చేరుకున్న రావణుడు రవిచంద్రులనాసిన రాహువువలె కనుపించాడు. యుద్ధ ప్రారంభం నేను చేస్తానని లక్ష్మణుడు జ్వలదనలాభ శాతశర జాలాన్ని ప్రయోగించాడు. లక్ష్మణుడు వేసిన అన్ని బాణాలను, ఒకటి, రెండూ, మూడూ బాణాలతో పరిహరించి పదింట తక్కిన శరాలను భగ్నం చేశాడు. మరికొన్ని బాణాలతో లక్ష్మణుని మించి మందర గంభీరుడై, నిశ్చలుడై నిలిచియున్న రామునిపై శితవిశిఖాలను శిఖిశిఖాయమానంగా వేశాడు. అసురపతి వేసిన శరాలను అలవోకగా ఖండించి, నేర్పు చూపుతూ నిశిత మార్గణాలను అదనంగా కురిశాడు. రెండు కాండాలు చాపంలో తొడిగి ఏకరూపంగా మౌర్వీటంకారవిభిన్న దిక్తటంగా దర్పం చూపుతూ దశవదనునిపై వైచాడు. ఆ బాణ ప్రయోగానికి బ్రహ్మాండాంతర్గత భూతకోటి హాహాకార పూర్ణాస్యమైంది. త్రుటి కాలం నిస్తంద్రమూ, స్తబ్ధమూ అయింది.

రామ ప్రయుక్త శరపరంపర నాగులు గట్టి వాసుకి నాగఫణాలు కంపా సంతాన దీప్తమై ప్రకాశించినట్లు తోచింది. గవాక్షాలు (ఆవుల కన్నులు) ఆకాశంపై దొంతర పేర్చినట్లనిపించింది. మిక్కిలి జవంతో, శితముఖాలై గ్రద్ద రెక్కలతో గూడిన ఆ అతిరథముక్త సాయకాలు ఎడతెరిపి లేకుండా వస్తుంటే, సూర్యాస్తమయం కాగానే, మబ్బు పట్టగానే సాంద్రతిమిరం అలముకొన్నట్లు పట్టపగలు చీకట్లు అలముకున్నై. పరస్పర హనన కాంక్షతో వృత్రుడూ, ఇంద్రుడూ తలపడ్డట్లు కలిసి రామ రావణులు పోరు సాగించారు. ఆ యుద్ధం అచింత్యం, అద్భుతం, అనల్పం, అపూర్వం. వెనుక దేవాసుర యుద్ధం ఘోరంగా జరిగిందని చెప్పుకున్నవాళ్ళే, రామ రావణయుద్ధాన్ని చూచి సిగ్గుపడ్డారు. ఆ మహారథులు, మహాధనులు, సకల శాస్త్రశస్త్ర విశారదులు, కాడివారిద్దరి కోడెల విధంగా విడువక పోరుతుంటే భూమ్యాకాశాలు బాణాలతో కప్పుపడ్డై. వాతాహతికి వనధి భంగ ప్రాతం పొంగిన చందంగా వారివారిపై ఫలించని వచ్చే శరాలు సామ్యం పొందుతున్నై. రావణుడు రా ప్రయోగాసనముక్త శరాలు రామచంద్రుని ఫాలమధ్యంలో నాటాడు. రాముడా బాణాలను విలువనీయడు. మంత్రయుక్తాలైన క్రూరనారాచాలను పంక్తి వదలని ఫాలంపై పగులునట్లుగా వేశాడు. అతని ఫాలంలో నాటిన ఆయుధమ్ములు పంచఫణిభుజంగాలుగా ప్రకాశించినై. వెంటనే వేరే శరం కూడా వేసి నొప్పించాడు. ప్రతీకార భావం ప్రబలంగా రాక్షసపతి అసురాస్త్రాన్ని ఆకర్ణాంతం గుణం లాగి అనుసంధించి వదిలాడు. ఆ భయంకరాస్త్రం, పంచానన శార్దూల వాయస దక్షాయ్యకంక గృధ్ర క్రోష్టృ సృగాల పంచముఖ భుజంగ వదన శరాలను, రాహు మృగాస్యాలు, వృశ్చికాండజముఖ ప్రసారమేయ ముఖాలు గల బాణాలను వెనవెంటనే సృష్టిస్తూ, భూనభోంతరాళాలు నిప్పులతోనింపిస్తూ రావటం రాముడు చూచాడు. అసురాస్త్రశక్తిని ఆహరించేలాగా అగ్నిబాణాన్ని ప్రతిగా ప్రయోగించాడు. అది అగ్నిదీప్త ముఖాలు, అర్కముఖాలు, అర్ధచంద్ర పూర్ణచంద్ర ముఖాలు, నక్షత్రముఖాలు, ఉల్కాముఖాలు, ఖగముఖాలు, కేతుముఖాలుగల ఇషీకాలను సృజించి మధ్యలోనే నిలువరించి అన్నిందినీ హతమార్చి తానూ హతమై పోయింది. తన ఘోరమైన అస్త్రం దేవతలకే సాధ్యంకానిది మానవుడైన

మూర్ఛాడు. హతకేతన సారథి చాపరహితుడైన అసురనాథుడు అవనికిదాటి రథంలో వుంచిన శక్తిని లక్ష్మణునిపై పిడుగులాగా హుమ్మని గర్జిస్తూ విసిరాడు. అది చాపముక్తం కాగానే అక్కడికక్కడే శరత్రయంతో ఛేదించాడు. ఆ లక్ష్మణుడు రావణుని శక్తి బాణాన్ని సంహరిస్తే అది అంభంనుంచి జారి పడిన తోక చుక్కలాగా ముక్కలైపోయింది. అగచరులు అహంకార గర్జలు లంక అదిరేలాగా చేశారు. తమ్ముడు శత్రు సన్నిధిలో తలపడి రథహీనుణ్ణి చేశాడనే ఆగ్రహంతో సాటిలేనిదీ, శక్తిమంతమైనదీ అయిన శక్తిని వేయ బోతుంటే లక్ష్మణుడు విభీషణునకు అడ్డంవచ్చి రావణునకు దిక్కు తెలియ నంతగా శర పరంపర వర్షించి చికాకు కల్పించాడు. ఆశరపాతానికి శరీరం నొచ్చిన రావణుడు సౌమిత్రిని చూచి, "ఓ విలుకాడా! విభీషణుని మృతి నుంచి తప్పించిన నీ శౌర్యాన్ని మెచ్చాను. వాణ్ణి కాపాడావేకాని నీ ప్రాణం పోకడ చూచుకోలేదు. ఇపుడే ఆ ఫలితం నీవు పొందు. నీ వక్షం ఛేదించి ఉష్ణ రక్తం త్రాగి నా శక్తి సంతసిస్తుంది.

## లక్ష్మణుడు రావణుని శక్తిచే మూర్ఛిల్లుట

వాడు చస్తే నీవైనా బ్రదికేవాడివి. వాడికోసం పాపం నీవు చస్తున్నావు. నీవు మరణిస్తే నీ అన్న మరణిస్తాడు. ఇదిగో చావు" అని దారుణ రావం, భీషణాష్ట ఘంటాలసితం, అమోఘం, అరినాశకం, అప్రతిహతం, అజేయం, మయదైత్య శాంబరీ జాలకల్పితం అయిన శక్తిని వక్షం గురిచేసి లక్ష్మణునిపై విసిరాడు. ఆ శక్తి రాకనుచూచి రాముడు "స్వస్తి సౌమిత్రికి, శరమూ! వ్యర్థ శక్తి వి క మ్ము. శాంతి శ్శాంతి శ్శాంతిః" అని శాంతి వచనాలు పల్కిలించాడు. అయినా ఆ శక్తి బాణం ఆత్మార్పణం చేయ టానికి అతిరథుడై నిల్చిన లక్ష్మణుడు వేసొంద బాణం స్పృశింపకుండగనే గాటంగా వచ్చి వక్షాన్ని నాటింది. వెంటనే శరచాపాలు చేతినుంచి జారగా సౌమిత్రి మూర్ఛిల్లి భువిపై పడ్డాడు. తనలో అర్ధాంశం భంగమైనట్లు తమ్ముని పాటుకు దాశరథి తల్లడిల్లాడు. కనులనీరు కారుతుండగా, రెప్ప వాల్చకుండా ఆ సోదరుని ఆరారంచూస్తూ ఆక్రోశించాడు. అంతలో మనస్సు మార్చుకున్నాడు. "ఇది దుఃఖానికి కాలంకాదు. తమ్ముని మూర్ఛముంచిన పగవాడు తన ఎదుట నిలిచివున్నాడు. ప్రతిక్రియ చేయకుండానే బ్రదకడం

మహర్షులు కూడా నా రామకథను వర్ణింతురుగాక. త్రిలోకాల్లో నా యుద్ధగాథ స్మృతి వున్నంతకాలం శ్లోకరూపంగా గానం చేయబడుగాక."

## రావణుడు పరాజితుడై లంకకు పారిపోవుట

అని ప్రళయ సమయ పుష్కలావర్త మేఘ నిర్ఘోషంలాగా పలికాడు. సువర్ణ పుంఖాలుగల శరపరాలు అసురపతి శరీరం నిండా నాటాడు. రావణుడు ధనుఃపాటవం చూపుతూ దారుణ మారణ మార్గణాలను రామునిపై తుంపుర్లుగా ప్రయోగించాడు. రాముడు చండభుజాసంపన్నుడై కోదండం వర్తుళంగా బాణవర్షం కురిసి అస్త్రాలను ఖండించాడు. ప్రళయ దావానల దర్పితులైన రామ రావణులు ప్రయోగించే బాణాలు ఒకదానికొకటి తాకి కలిగించే చప్పుళ్ళకు సముద్రాలు క్షోభించినై. దిక్కుటి శ్రవణ పుటాలు బ్రద్దలైనై. గగనం ఆచ్ఛాదిత శరబృందమై గగనమై పోయింది. ప్రాణికోటి తల్లడిల్లింది. దిశాంత వీథులు దుస్సహాలైనై. ఒకదానికొకటి ఘర్షణతో రాలిపడిన శరఖండాలు కొండలుగా రాసులు రాసులుగా పేరుకున్నై. రాముని ఆగ్రహం మితిమీరింది. "ఏమి? రావణుడు ఇంతదాక తెగి నాతో పోరుతున్నాడు? ఇతడు నిజంగా ఇంతటి శక్తిగలవాడా? కాకపోతే రత్నాలవంటి యోధులు రాలినా అధైర్యపడక రణరంగానికి రాగలిగాడు. రథంమీద వున్నట్లే ధరమీద నిల్చి ద్వంద్వ సమరం అపరిమితంగా సాగిస్తున్నాడు. ఇక వీని ఆటలు సాగనీయను. ప్రాణాలను హరించటమో, పలాయనం చిత్తగించటమో వీడిప్పుడు చేసి తీరాలి" అని భావించి అగ్నిసమానాలైన అలుగులు పుంఖాను పుంఖాలుగా వేసి ఊపిరి సలుపకుండా రావణుని త్రస్తుం చేశాడు. గత్యంతరంలేక శీఘ్రగతి లంకకు పారిపోయాడు. "దేవదానవ మహాసంగ్రామంలోగానీ, ఇతర క్షేత్ర యాత్రల్లోగానీ ఓటమి ఎరుగని రావణుడు రెండోసారి పరాభూతుడై పారిపోయేట్లు చేయగలిగిన సత్యపరాక్రమ సార్థకనాముడు రాముడు ఒక్కడే ఒక్కడు" అని దేవతలు మహర్షులూ అతనిచే పీడితులైనవాళ్ళు కూడ ఎంతో సంతోషపడ్డారు.

## రాముడు మూర్ఛిల్లిన తమ్మునికోసం దుఃఖించుట

అంత భయంకర సమరం సాగిస్తూనే తమ్ముని ఒక కంటితో చూస్తూనే వున్నాడు. శత్రుకంటకుడు పలాయితుడు కాగానే అంతవరకు

## సుషేణుడు రాముని ఓదార్చుట

రామచంద్రుడు అంత డీలాపడిపోవటం లక్ష్మణునికి మాత్రమే తెలుసు. వానరులకు ఎవ్వరికీ తెలియదు. అందులో ఇప్పటి తన స్థితి అసలే తెలియదు. సుషేణుడు వినయంతో అమృతంవంటి మాటలతో ఓదారుస్తూ, "రామభద్రా! లక్ష్మీవర్ధనుడైన లక్ష్మణుని కోసం నీవంటివాడు దుఃఖించటం ఏమిటి? నాపై నీకు విశ్వాసం వుండదా? నేను సమక్షంలో వుండగా మృత్యువే జంకుతుంది. అవసరమైన పరీక్ష చేశాను. అన్నీ అనుకూలంగానే వున్నై. జీవనాడి చక్కగా స్పందిస్తూనే వుంది. మరేం భయంలేదు. నీవు శోకం మాని నిదానంగా నీ తమ్ముని పరిశీలించి చూడు. మొగం కళ తప్పలేదు. శ్వాస కోశాలు పనిచేస్తూనే వున్నై. వదనం అప్రభమై నల్లబడలేదు. సుప్రభం, సుప్రసన్నం, సొగసుగా వుంది. పాణులు అరుణ పద్మాలవలె మృదువులుగా వున్నై. కళ్ళల్లో ప్రతిబింబాలు కనుపిస్తున్నై. మృతిగన్నవారికి ఈ మంచి లక్షణాలుండవు. అన్నీ శుభలక్షణాలే కనుపిస్తున్నై. ఈతని ముఖమే ఈతను చిరకాలం జీవిస్తాడని చెబుతుంది. కనుక నీ తమ్ముడు మృతి చెందలేదు. సుప్రాణుడు సౌమిత్రి. ఇదిగో హృదయ కంపనం. ఇదిగో ఉచ్ఛ్వాసం. నీవే చేయిపెట్టి చూడు. ఇక నీవు శోకం మాను. నీ తమ్ముడు స్వస్థుడయ్యే మార్గం నేను చూస్తాను. కొంచెం కాలంలో తమ్మునితో కలసి ఆనందం అనుభవిస్తావు. అనంతరం రావణ వధ నీ చేతిమీదుగా జరుగుతుంది. సర్వలోక శాంతి సమకూడుతుంది" అని చెప్పాడు. రాహువిముక్త చంద్రబింబంగా రాముని వదనం వెలిగింది.

## హనుమంతుడు సంజీవని పర్వతం కొని వచ్చుట

రామచంద్రుని ముఖం ప్రఫుల్లం కాగానే "హనుమా! ప్రమాదం ప్రస్తుతానికి లేదు. నీవు పూర్వం కొనివచ్చిన పర్వతాన్ని వెంటనే తీసుకునిరా. నీకు తెలుసుగా మనకు కావలసిన విశల్యకరణి, సవర్ణకరణి, సంజీవని, సంధాన కరణులు అందులోవున్న సంగతి. నీవు మనోజవంతో ఆ మందులను కొనిరా. జాగు మాత్రం చేయవద్దు" అని తొందర పెట్టాడు. హనుమ ఒక్కసారి తండ్రిని స్మరించాడు. కుప్పించాడు. అంతలో అదృశ్యుడై పోయాడు. పర్వతపాదంలో

ప్రాకాడు. ఎంత వెదికినా ఉపసంహృతదీప్తులైన దివ్యౌషధులను గుర్తింప లేక పోయాడు. కాలం వ్యర్థం కారాదని పర్వతాన్ని బాహువులలో బంధించి ముమ్మారు ఊపాడు. పాదు కదలంగానే పైకి పెకలించి ఒంటిచేత నిల్పుకొని అంతరిక్షానికి ఉద్గమించాడు. ఆ మహాత్ముని ధైర్య సాహసాలకు ఔషధులు ప్రసన్నాలై ప్రకాశించినై. కోటి భానుమండలోదయం వలె దిశలు వెలిగిస్తూ పోయిన పర్వతాన్ని తెచ్చి సుషేణునకు సమర్పించాడు. కొండనే తెచ్చిన మారుతి మహాత్మ్యానికి వానరులు, రాక్షసులు కూడా ఆశ్చర్యచకితులైనారు. గూటిలో దాచిన బంతి వలె కొండనే కొనివచ్చిన మారుతి పాదాలపై పడి మర్కటులు నమస్కరించారు. ఇంత శక్తి సంపన్నులుండబట్టే రాముడు రాక్షసేశ్వరునితో రణంలోకి దిగాడని నిశాచరులు నిర్విణ్ణులై నిలిచి పోయారు. సుషేణుడు పర్వతారోహణం చేశాడు.

## లక్ష్మణుడు మూర్ఛ తేరుట

దివ్యమైన ఔషధులను సేకరించాడు. త్వరితో ఉపచారం చేసినాడు ఓషధులను శాస్త్ర పద్ధతిగా లక్ష్మణుని నాసికాగ్రం ముందుంచాడు. క్షణ కాలం ఉచ్ఛ్వాస నిశ్వాస సముదాయం ఆ శక్తిని అపహరించింది. నిద్ర లేచిన వాని రీతిగా లక్ష్మణుడు లేచి కూర్చున్నాడు. అందరూ, సకాలంలో మందులు తెచ్చిన మారుతినీ, ప్రయోగ కుశలత చూపించి సౌమిత్రిని బ్రతికించిన భిషగ్వరుని సుషేణునీ అభినందించారు. పునర్జీవితుడైన తమ్ముని "రా తండ్రీ! రా దక్షిణ బాహువంటివాడా! తమ్ముడా రా!" అంటూ గుండెలకు పొదువుకుని ఆనంద కందళితాశ్రుధారా సంసిక్త సర్వాంగునిగా చేస్తూ, "తమ్ముడా! నీవు నా కన్నులకు మళ్ళీ వెలుగు ప్రసాదించావు. స్తబ్ధమైన రక్తాన్ని మళ్ళీ ప్రవహింప చేశావు. నా సుకర్మలన్నీ చేరి నిన్ను బ్రతికించి నాకిచ్చినై. ఈ రాముడు మళ్ళీ సీతతో కలిసి జీవించే యోగం దైవం కలిగించి నన్నుద్ధరించాడు. అన్నా! నిన్ను వదలికొని, రావణుని చంపినా, సీతను గ్రహించినా, రాజ్యం పొందినా ఏమి ఫలం రాముడు సాధిస్తాడో నీవే చెప్పు. నిన్ను చూసుకొనే గదా అరణ్యవాస కష్టాలు మరచాను. నీవుండబట్టే కదా సీతా వియోగ తాపంతో మరణించకుండా జీవించ కలిగాను? నీ అందరల

పెవరితో నీవు పంపిన సందేశం మరచావా? ఇంత శౌర్యధైర్యం, ఇన్ని బాధ్యతలు, ఇన్ని శాస్త్రాలు నీకై వుండగా, నా కోసం నీవు యుద్ధంమానుతావా? ఆత్మహత్య చేసుకుంటావా? నేను ఇహలోక యాత్ర ముగించినా, నా ఆత్మ నీకు వచ్చిన అపకీర్తిని చూచి అనంతకాలం దుఃఖిస్తూ, నీచమైన జన్మలెత్తుతుంది గాని, పుణ్యాత్ములుండే శాశ్వత బ్రహ్మలోక నిత్యవాసం చేరదుకదా? నీ ప్రేమపాత్రుడైన తమ్ముడికిచ్చే కడపటి కానుక ఇదేనా? వాడి కోరలూ, వాడి గోళ్ళూ గల్గి క్షుధార్తితో గర్జిస్తున్న మృగేంద్రుని మూపుక్కోపడ్డ గజం ప్రాణంతో తప్పుకొనేటట్లు నీ ముష్టిఘాతంలో పడ్డ దైత్యుడు బ్రతికిపోలేడు. నాకది తెలుసు. "మరిపోయాను రానేమో" యని నీవు శంకించవద్దు. నీ శత్రువు జీవించాలని, జీవించడు. తనవారా రాజ్యంగా తగిన వాళ్ళను చంపాను. వాళ్ళల్లో ఎవరి చేతనైనా నా కార్యం సాధించబడితే సంతోషించదాననుకున్నాడు. తనంతవాడైన ఇంద్రజిత్తు మరణించిన తర్వాత తానింక ఇంట్లో వుండే స్థాయి తప్పిందనుకుని యుద్ధానికి వచ్చాడు. రక్షోనాయకుడు రావణుడింక నీతో పోరటం కష్టమని తెలిసి రథారూఢుడై రావటానికే లంకనుపోయి వుంటాడు. అంతేకాని, ప్రాణాలతో రాడు. ఆది ఇంద్రజిత్ మరణంతోనే మరణించింది. భానుడు అస్తమించకముందే పంక్తిముఖుని వధించు. ఆ కార్యం నీకు అభిమతమైతే, నీవన్న వాక్యాలు నెరవేర్చటం ధర్మమైతే, నేను చెప్పిన మాటలు నీకు హితమైతే సమరోత్సాహం దర్పగా. రామచరిత్ర ఆ రవిచంద్ర తారకంగా కీర్తించబడేట్లు చేయి" అని చెప్పాడు.

## రామ రావణుల నడుమటి యుద్ధం ప్రారంభం

తమ్ముని వాక్యాలు ఒక్కొక్కటి రాముని అగ్రహాన్ని ఒక్కొక్క మెట్టు పైకి ఎక్కించినై. రాముని హృదయంలో లక్ష్మణుని త్యాగమయ మూర్తి వెలితి లేకుండా నిండిపోయింది. ఆ మూర్తిని ధర్మపరిపూర్ణతను సాధ్యంకాదని జ్ఞానచక్షువుతో దర్శించాడు. కాని పారం కనిపించలేదు. "ఏమి లక్ష్మణుడు? ఏమి సోదరుడు? నేను నిగ్రహం కలవాడనైనా లౌకిక ధర్మాన్ని పాటిస్తున్నాను. నా తమ్ముని దాక్షిణ్యంతరాలు రెండూ అలాంటివే. నా పినతల్లి సుమిత్రమ్మ సాక్షాత్తు పరదేవత.

ఆమెకు లోకం ఫుంసేదు. ఇక నా సుదతులు లక్ష్మి స్త్రీ రూపంగా భాసించే దివ్యతేజం. ఆమెకు లౌకికా లౌకికాలు రెండూ లేవు. నా తమ్ముడు భరతుడెంతటివాడు! అతడు దక్కిన రాజ్యాధికారాన్ని తప్పిచేసి నా పాదుకలకు పట్టం గడతాడా!! తాను గృహస్థుగా వుండి జటావల్కల ధారణంచేసి ఇంద్రియాలను నిగ్రహించి నియమ పాలనం చేస్తున్నాడా!! ఇక సీతను గురించి ఏం చెప్పుకునేది? ఆగర్భ శ్రీమంతురాలై, అయోనిజయై నా కరగ్రహణం చేసి ఏం సుఖించింది? లోకం సంసార వాంఛతో భర్తవెంట బడ్డదనుకుంటారేగాని గృహిణీ ధర్మం ఏమిటో ఆమెకు తెలిసినంత లోకానికి తెలియదు. మేం వానప్రస్థులంగా వున్నామని ఎంతమంది ఎరుగుదురు? నా అరణ్యవాసం సుఖప్రదం చేయాలని సంకల్పించి సహచరిగా వచ్చిందనే పరమార్థం నాకుగాక ఇతరులకెలా తెలుస్తుంది? ఆమె అంగీకరించిన తర్వాతకదా తమ్ముడు నా వెంట వచ్చాడు? ఎంత ఓలమి లేకపోతే క్రూరరాక్షస పరివార మహోదవాసల మధ్యంలో ఇంతకాలం పతివ్రతగా బతకగలదు? ఆమెకుసాటి ఆమే. ఇక విభీషణుడు ఆత్మజన్మ సార్థక్యం చేసినవాడు. సత్యధర్మ పరిరక్షణకోసం భార్యా సుతాగ్రజుల వదలి వచ్చినవాడు. మిత్రుని సేవలో అరమరికలు లేకుండా కార్యసాఫల్యానికి పాటుపడుతున్నవాడు. పరమభక్తుడు. రాజ్యాశ నావల్ల కలిగిందేకాని అతనికి అదే పరమార్థం కాదు. అందుకోసం నా కడకు రాలేదు" అన్న పామరజనగ్రహణ దుర్లభమైన భావాలు లక్ష్మణుని ప్రేరణతో స్ఫురించినై. తమ్ముడు చెప్పిన మాటల్లో ఎంత ధర్మసూక్ష్మంవుందో తెలియబడింది. కాయం కాతెక్కింది. కన్నులు నిప్పులు క్రుమ్మరించినై. భుజాలు పొంగినై. చాపంకోసం చేయి తనంత తానే చాచింది. ముష్టిలో గ్రహించి నిలబెట్టింది. ఇంతలో రావణుడు రథారూఢుడై పగగొన్న ఫణిలాగా రానే వచ్చాడు. రాగానే వజ్రసన్నిభ మార్గణ సహస్రంతో రాముని ముంచాడు. అతడు వచ్చిన తీరు భాస్కరుని గవిసే తమోగ్రహంలాగా వుంది. అసురపతి అస్త్రతాడితుణ్ని చేశాడన్న ఆక్రోశంతో పావకనిభ శాతాశుగజాలం, తప్త జాంబూనదభూషణ భూషితం ప్రయోగించి తనువెల్ల వ్రణమయం చేశాడు. ఇది తుదికదనంగా, దేవ గంధర్వాది దివిజులు రణంలో మునిగిపోయిన రామరావణుల చూచి రాముడు పదాతి. రావణుడు రథస్థుడు. సమయుద్ధం కాదని ఇంద్రునికి విన్నవించుకున్నారు. అంతవరకు ఆవిషయమే

మనస్సునకు రాగా సురపతి ఆ మాటలు మన్నించి, కాంచనచిత్రం, ఘంటికా శత భూషితం, తరుణార్కనిభం, వైడూర్యమయకూబరం, ధర్మపరిష్కారం, సితచామరం, పతాక కాంతిమంతం, రవిబింబాభం, రుక్మవేణు కలిత ధ్వజం, సువర్ణశోభిత హయం, అయినట్టి రథాన్ని మాతలిసహితంగా మనుజోత్తము డైన రాముని సేవించగా పంపాడు. విశ్వసృష్టి మొదలు ఇంతవరకు ఎవ్వరికి యుద్ధార్థం పంపని రథం రాముని గౌరవార్థం, విజయార్థం పంపినందుకు, తమ విన్నపం మన్నించినందుకు దేవతలు శచీపతిని ఎన్నో విధాల కొనియాడారు. మహర్షులు దీవించారు.

## ఇంద్రుని పంపున మాతలిరథంతో రాముని చేరవచ్చుట

ఆకాశంనుంచి సూర్యమండలం దిగి వచ్చినట్లు మాతలి రథంతో క్రిందికి దిగి, దిగుతుండానే, చేతిలో చబుకుండగానే నమస్కారం చేశాడు. "రామచంద్రా! నీ విజయార్థం వేల్పులరేడు తన రథాన్నిపంపాడు. దయతో ఈ రథాన్ని స్వీకరించి రథికుడవై, ఈ ఐంద్రశరాసనాన్ని, వైశ్వానర సంకాశమైన ఈ వర్మాన్ని, శతకోటి సూర్యసమ శరసంతానాన్ని, శంపాలత వంటి ఈ శక్తిని ధరించు. నా సారథ్యంతో మహేంద్రుడు దానవుల మదం హరించినట్లు, నీవు రావణుని రణరంగంలో సంహరించు" అని విన్నవించుకున్నాడు. రాముడు ఆ వాక్యాలను శ్రద్ధాభక్తులతో విన్నాడు. దేవతానుగ్రహం కలిగినందున తనకు విజయం తథ్యం అనుకున్నాడు. మస్తకన్యస్తహస్తుడై రథానికి ప్రదక్షిణం చేశాడు. పరమపూజ్యులైన దేవతలకు మనసార మ్రొక్కాడు. చతుర్దశభువనాలు లక్ష్మీకటాక్షంతో రాణించగా రథారోహణం చేసి, ఇంద్రదత్త శరచాప వర్మాదులు గ్రహించి ధరించాడు. రామరావణులు రథారూఢులై రణక్షేత్రంలో అభిముఖులుగా నిల్చిన దృశ్యం చూచి అమరులు హర్షోత్ఫుల్లమనస్కులైనారు. రాముడు రథికుడుగా కనుపించగానే రావణుడు ఆగ్రహోదగ్రుడై, అసూయతో కన్నుల్లో నుంచి అంగార కీలలు క్రక్కుతూ గంధర్వాస్త్రాన్ని ప్రయోగించాడు. రాముడు అదే అస్త్రంతో అపహ్నుతం చేశాడు. దానవపతి దైవశరం వేస్తే మానవపతి ప్రతిగా అదే శరం వేసి అంతం చేశాడు. లోకభీకరమైన రాక్షసాస్త్రాన్ని గుణం చెవి

దాక లాగి రాముని లక్షించి విడిచాడు. అది బాణం వెడలగానే అసంఖ్యాకంగా భుజంగాలను సృష్టించింది. అవి విస్ఫురత్తంత్రులవలె, వదన వదనం మంటలు వెలార్చగా, వాసుకి పరిపించే ఆకారాలతో దిక్కులాక్రమించి, విషం క్రక్కుతూ మీదపడుతున్నై. రాముడు నిర్వికారుడై వాటి రాకను చూచాడు. గరుడాస్త్రం అభిమంత్రించి ఇంద్రచాప నిర్ముక్తం చేశాడు: ఆ దివ్యాస్త్రం ధనుర్నిర్గతం కాగానే, కార్తస్వరాత్మ్య కాక శరసహస్రాలను సృజించింది. అవి సరభస గతితోపోయి కాకోదర సంతానాన్ని హరించినై. దేవతల పావనసేవలు చేసిన దివ్యాస్త్రాలన్నీ వ్యర్థమై పోవటం అసురపతికి అవమానం పెచ్చు పెరిగింది. బ్రహ్మవరబలస్మరణ చేశాడు. తనకున్న దివ్య శక్తులన్నీ కూడగట్టుకున్నాడు. గర్జించాడు. వర్షించాడు. రోష సంరంభుడైనాడు. దుర్వార శరాలు వింట తొడిగాడు. రామునిపై, సారథిపై, సంధించి తనువుల నాటాడు. మరో శరంతో కాంచన కేతనాన్ని ఖండించాడు. ఇంకో ఇషీకంతో గుర్రాల శక్తిని కూల్చాడు. అపరిమిత విక్రముడై అసురనేత విజృంభిస్తుంటే, సిద్ధులు దేవగంధర్వచారణాదులు, వానరులు, విభీషణుడు, ఆతని అసాధ్య కార్యానికీ, అప్రతిహత ధనుర్విద్యా పాటవానికీ గుండెలవరగా శోకతప్తులైనారు. ఇప్పటి వాని ఉత్సాహం చూస్తే రాముణ్ణే కాదు, లోకాలనే దహిస్తాడన్న భయంతో వణకసాగారు. రామచంద్రుడు రావణ రాహుగ్రస్తుడు కాగానే, చంద్రునికి ప్రియమైన రోహిణిని బుధుడాక్రమించుకున్నాడు. ప్రజలకు అరిష్ట సూచకంగా అంబుధి ప్రజ్వలితమై, ధూమవ్యాప్తోర్మికా స్తోమమై సూర్యమండలం తాకేలాగా పెరిగింది. దినకరుడు, లోకబాంధవుడైన సూర్యుడు నీలవర్ణుడూ, నిష్ప్రభుడూ, ద్యుతిహీనుడూ, ధూమకేతుసంసక్తుడూ, కబంధ లక్ష్మణ సంయుతుడూ అయినాడు. రాముడు రామతడించి, బాణసంధానశక్తినే రావణుడాక్రమించగా దైన్యాన్ని పొందాడు. కోసలేంద్రుల కులతార వాసవాగ్ని దైవతం, విశాఖను బుధుడు ఆక్రమించాడు. వింశతిబాహువు, శరాసనధరుడు, పంక్తిముఖుడు మైనాక పర్వతం వలె నిశ్చలంగా నిలిచాడు.

మహోష్ట ఘంటం, కాలానలోపమానాయుధం కలిగి ఆ నభోమార్గమంతా స్వీయ ప్రభా కంపాలతల్లో నింపేస్తూ, అతి భయంకరంగా వస్తుంటే, రాముడు శక్తి మంతాలైన శరాలను అడ్డగించటానికి వేశాడు. కల్పాగ్నిపై జలం ప్రోక్షించిన విధంగా పోయి అవి ఎదుర్కొన్నై. ఫలితం? దహనుడు శలభ సమూహాన్ని దహించినట్లు, ఆ రావణి శూలం ఆహరించింది. అనంతరం అధికాధిక వేగంతో రామలక్ష్మణుల సమీపిస్తూంది. ఆ శూలమృత్యుముఖదంష్ట్రల్లో తన మార్గణ ప్రాణులు పడి నాశం కావటంతో ఇంద్రప్రేషితోరు శక్తిని సమంత్రకంగా ప్రయోగించాడు. ఇంద్రదత్తశక్తి రామమంత్రంతో ప్రజ్వలించింది. ఘంటానాదం దిశామాతంగ శ్రవణ దారుణంగాపోయి ఆ శర ప్రయుక్త శూలాన్ని అడ్డగించింది. ఆ ఆయుధద్వయసంఘర్షణకు వెలుపలే వికల మనస్కులైనారు. పోరిపోరి ఇంద్రశక్తి ఆ శూలాన్ని నరికింది. అది సహస్ర శకలీకృతమై భూమికంపించేలాగా పడిపోయింది. రాక్షసులు ఏడ్చారు. వనాటులు బొబ్బలుపెట్టారు. వేలుపులు ఉబ్బిపోయారు. రావణుని శూలాన్ని ఖండించిన రాముడు అంతతో ఊరుకోలేదు. ప్రచండ బాణ సంఘాతంతో గుర్రాల శక్తి నడగించి, ఉరాన్ని పగిలించి, ఖగ్రికంతో రావణుని ఫాలభాగం బద్దలుకొట్టాడు. రావణుడు భిన్నగాత్రుడూ, రక్త సంక్లిన్నతనుడూ అయి పూచిన అశోకం పోలుపుపొంది, శరవేదన సైరింపలేక దురంతో దుఃఖసంతప్తుడై కూలిపోయాడు. అవమాన పరంపరను ఆక్రోశించాడు.

## రాముడు రావణుని నిందావాక్యాలు బాధించుట

అంతలో లేచుకున్నాడు. లేచాక అధికజవంతో రాముని శరీరం ప్రమామయమయి, రక్తసిక్తం కాగా శరసంధానం చేశాడు. శరబాధ సహిస్తూ ఆ రావణుడు వేసే అంబకాలను అంతరిక్షంలోనే హరిస్తూ రాముడు పోరుతున్నాడు. అయినా పంక్తిముఖునిదే పైచేయిగా వుంది. రాముని శరీరం పుష్పితకింశుకంగా వుంది. శాత్రవుడు అలతులపోడని రాముడు ప్రళయార్కద్యుతిమంతుడై ప్రకారస్ఫారనారాచధారా విస్ఫోటితతనుభాగుడుగా చేసి పంక్తిగళుని బింకం సడలించాడు. అతడు కూడ ఈడుపోక సమంగా రాముని శరవృష్టి చేశాడు. ఉభయులు వేసే బాణాలు నినిడమై, నీరంధ్ర

ధ్వాంతమై వనలును రాత్రి చేస్తున్నై. ఆ చీకటి కన్నుల కవరోధంగాగా, రామ రావణులు చూచేవారికి అగోచరులైనారు. ఆ సాంద్ర తిమిరసమయంలో రాముడు కించిదవభర్త్సనగా హాసం చేసి "లంకా పీఠస్థుడంతా! ఏం పని చేశావు? నేను లేనివేళ నీవు నా సతిని వంచనతో హరించావు. అతి పెద్ద కార్యం అని పొంగిపోయావు. ఛీ ఛీ! నీచుడా! అది వీర లక్షణమని అను కున్నావా? బలాత్కారంగా రక్షణలేని స్త్రీని కొనిరావటం నీ వీరత్వానికి చిహ్నంగా భావించావా? వివేకంలేని జడపదార్థమా! పిరికివాడవై కూడా అనాథ నతిని దొంగవలె అపహరించి తెచ్చి ఇంకా "వీరుడనే" అని అనుకున్నావా? స్త్రీహీనా! పాపచరితా! సాధుమార్గ కంటకా! పరసతీ కాముకుడా! కోరి మృత్యువు తెచ్చుకున్న దుష్టా! ఇంకా "వీరుడనే" అని అనుకుంటున్నావా? కుబేరుని వెన్నతన్ని పుట్టి, విధాతను మెప్పించి, అనితర సాధ్యవరాలు పొంది, లోకంలో మేటివై, లోకం మెచ్చే మహాకార్యం ఏం చేశావు? కఠిన కర్ముడవై లోకం గర్హించే నీచకార్యాలు చేశావు. ఛీ. ఆ ఫలం ఇప్పుడు అనుభవానికి వచ్చింది. అవశ్యం అనుభవించు. నద్యఃఫలదాయిగా కనుపించినా పాపం పండి ప్రబలవుతుంది. అప్పుడు పూర్వార్జిత యశస్సంపదలతోపాటు సర్వం నాశనం అవుతుంది. అందుకు వేరే ఉదాహరణ ఎందుకు? నీవే సాక్ష్యం. ఇంత నిరాభిమానవై, సిగ్గులేకుండా సీతను ప్రముచ్చిలించి లంకలో వీరుడనని చాటుకున్నావు. ఆ సమయంలో నేనే వుంటే నీ కళేబరం కూడా లంకకు చేరకుండా చేసేవాణ్ణి. ఎంత భాగ్యవంతుడవో, ఇన్నాళ్ళకు నన్ను చూచావు. ఇప్పుడే అంతక నిలయానికి అతిథిగా చేస్తాను. దివ్య మణి కుండల ప్రభాభాసితమైన నీ శిరం వలల భక్షక పక్షులు లాగి లాగి, ముక్కులతో పొడిచి పొడిచి, ఇంచింతలు ముక్కలు చేసి మెక్కి పరితృప్తులై తనివి చెందుగాక. స్రవించిన నీ వక్షస్థలాన్ని గృధ్రాలు చంచువులతో చీల్చి క్షతజాన్ని కడుపార గ్రోలుగాక. నా శర నిర్భిన్న భవదాంత్రములు పతంగ బృందం గ్రహించి పాముల వైనతేయుని వలె వడవేయుగాక. ఇక బ్రతుకలేదు. ఇప్పటికి రెండుసార్లు తప్పుకున్నావు. ఈసారి తప్పుకోలేవు. విధి వ్యతిరేకించింది. కనుక వీరుడవై పోరి చావు. భీరుడవై, బ్రతుకదలిస్తే పారిపో" అని మర్మచ్ఛేదకాలైన మాటలు సూటిగా అన్నాడు.

# రణరంగం నుండి రావణుని రథం సారథి మరలించుట

రాముని ప్రత్యంగం కోపంతో పొంగింది. ఆయనే సత్యపరాక్రముడు. అప్రతిద్వంద్వి. సర్వ వరమాత్ర సంపన్నుడు. లయమై, భార్యా వియోగ దుఃఖ కారకుడైన ప్రతిపక్షి రాముని సమక్షంలో వున్నాడు. ద్విగుణతేజం పొంది వున్నాడు. ఉత్సాహం ఉరకలువేస్తోంది. రణ సంరంభం చాలనట్లు, అగస్త్యబ్రహ్మ, విశ్వామిత్ర మహర్షి ప్రసాదించిన సర్వాస్త్రాలను మంత్ర పూర్వకంగా స్మరించాడు. ఆ దివ్యాస్త్ర సంతానం మూర్తిమంతమై ఎదుట నిల్చింది. కోదండం గొని గుణం మీటాడు. దక్షిణ భుజ నేత్రాలు స్పందించి శుభం సూచించినై. హృదయం ప్రసన్నమై జయ చిహ్నాలు ప్రకటించింది. ఆ శుభ శకునాల మూలంగా గెలుపు తనదే యని నిర్ణయించాడు. ఫలితం పరీక్షగా అన్నట్లు పంక్తిముఖునిపై రెండే రెండు దివ్యాస్త్రాలు వేశాడు. అవి నిరాటంకంగా పోయి లక్ష్యాన్ని తాకినై. అంతవరకు ఇరువురి యుద్ధం చూస్తున్న వానర సేనలు జేకొట్టుతూ పర్వత వర్షం కురిశారు. ఇటు బండల ప్రేటూ, అటు రాముని శరముల పోటూ ఒక్కసారిగా పొంది గుండె గుల్లయిపోగా, తనువు తూలిపోగా రథ స్తంభం ఆలంబనం చేసుకుని కనులు మూశాడు. ఆహా విధీ! నీకు హృదయం లేదు. దయా దాక్షిణ్యాలు లేవు. నీవొక యంత్రానివి. జీవులు చేసే కర్మ ఫలాలే నీ గమనానికి మూలం. కాకపోతే జగత్కంటకుడనీ, లోకవిద్రావణుడనీ, సురాసుర దైత్య దానవ సంతప్త కారకుడనీ, ప్రథ మోసి, సువర్ణమయమైన లంకలో మహా వర బల సంపన్నులు సేవించగా జీవించినవానినైన జాలిపడ్డావా? గుండెలు పగిలి, గుటకలు మింగి, తేజం తప్పి, కాతరత్వంతో, కళవళపాటుతో కన్నులు మూసి నిల్చిన లంకేశుడు చాపం పట్టలేడు. శరాలు కూర్చలేడు. గుణం చాపానికి తొడగలేడు. శత్రు శరాలను ఖండించలేడు. తనపై వచ్చే బాణాల దిక్కేదో తాను వేసే బాణాల దిక్కేదో తెలిసికోలేడు. అది మూర్ఛ కాని మూర్ఛ. రథికుని దుస్థితి చూచి భరించలేక సారథి ఇంకా వుంటే చావే సత్యమని రథాన్ని మెల్లగా రణ భూమినుంచీ, రాముని లక్ష్యంనుంచీ దూరంగా తోలుకునిపోయాడు.

# రావణుడు సారథిని నిందించుట

సమయజ్ఞుడైన సారథి ప్రభువు పొందిన పెనుపాటు చూచి రథాన్ని రణభూమినుంచి నేర్పుతో తప్పించి సురక్షిత స్థానానికి చేర్చాడు. గంధవహనామం సార్థకం కాగా, పవనుడు సమయానుకూలంగా వీచి శైత్యోపచారం చేశాడు. ఆ వాయువు ప్రసాదించిన హాయికి రావణుడు తేరుకున్నాడు. స్వస్థుడైనాడు. ఘాతను స్మరించాడు. ప్రహారాంకిత దేహం వ్రణకవచంగా మారింది. శస్త్రాస్త్రాలు ధారణలో నిల్చినై. ఘనమైన ధృతి పెరిగింది. ప్రదేశం పరికించాడు. జనహీనంగా వుంది. సమక్షంలో రామలక్ష్మణులు లేరు. అప్పటి స్థితి అర్థం చేసుకున్నాడు. "ఏమి సారథీ! రణాంగణం నుంచి శతాంగం కొని వచ్చావా?" అని అడిగాడు. అప్పుడన్ని ప్రత్యుత్తరం విన్నాడు. దండతాడితమహోరగంలాగా కస్సున లేచాడు. బుస్సని నిట్టూర్చాడు. కృతాంత చోదిత మూర్ఖుడు సారథిపైనాడు. ఏమిరా సూతా! ఎంత పని చేశావు? నన్ను అశక్తునివలె, అల్పవిక్రము పౌరుషహీనుని భంగి, భీరునిరీతి, మానహీనుని చందాన, రోషవివర్జితుని పోల్చి భావించి, దుర్మతీ! ఎందుకీవిధం రథం కొనిపోయావు? నామనస్సెరుగకుండ స్వతంత్రుడవై, అనాదరబుద్ధి ఇవ్విధి నిర్ణయము చేశావు? నా విక్రమ పరాక్రమమైనా? నా దివ్యాయుధాలమైనా? సర్వలోక సమ్మోహ సంహార సమర్థమైన నా మాయావిద్య ఏమైంది? మూఢా! మరియాద తప్పి, నా పరువంతా పగవాని ముందు పాడుచేశావు. చిరకాల సమార్జితమైన నా కీర్తి, నా తేజం, నా బలం, 'రణంలో వెనుదీయని దనుజపతి' యన్న నమ్మకం నీ వివేకశూన్యమైన చేతచే నశించిపోయింది. త్రిభువన ప్రసిద్ధ వీరుడూ, అసదృశ బలరంజనీయుడు అయిన రాముడు చూస్తుండగా, యుద్ధానికి తలపడుతున్న నన్ను దేబెలాగా చేసి రథం తప్పించావా? వధూటికై తోలే రథాన్ని ప్రక్కకు మళ్ళించావా పాపకర్ముడా? నామేలు కోరే మిత్రుడు ఈ పాడుపని ఎన్నడైనా చేస్తాడా? దుర్వినీతుడా! పగవాడు నాకోసం చేయవలసిన పని నా చేత చేయించావా? నీవు ఈ పని శత్రువులచే మేలొంది చేసి వుంటావు. బహుదినాలుగా నా సొమ్ము తిని అవసర సమయంలో అనర్థ కార్యం చేయటం నీ వంటి కృతఘ్నునికే చెల్లింది. నీవు నిజంగా నాపట్ల విశ్వాసం కలవాడవైతే,

కృతజ్ఞతాబుద్ధి వుంటే, నా అనుగ్రహంతో జీవించదలంచితే, రాముడు ఇక్కడకు రాకముందే నా రథాన్ని అతని కభిముఖంగా తోలు"మని నిందించాడు.

## సారథి రావణునకు సమాధానం చెప్పుట

మతిపోయి, గతితప్పి, హితమతియైన సారథిని నిష్ఠురవాక్యాలతో నిశాటపతి నిందించాడు. కాని, సహృదయుడు, ప్రభుభక్తి పరాయణుడైన సారథి మాత్రం బాధపడలేదు. పతిహితం కోరుతూ, పరమార్థ స్ఫోరకాలైన పలుకులు బదులుగా చెప్పసాగాడు. "ప్రభూ! అధిపతులు భృత్యులకు ప్రసాదించే దూషణ భూషణ తిరస్కారాలు ప్రభు సేవ గలవారు ప్రసాదంగా స్వీకరిస్తారు. నేను నీయంత మహావీరునకు సారథినైనందున ప్రసాదంగాకాక ప్రభువుల సహజ గుణాలుగా స్వీకరిస్తున్నాను. అధికారి అడిగినప్పుడు సేవకుడు చేసిన పని చెప్పక తప్పదు. నేను రామునికి వెరచిన వాణ్ణి కాను. వెంబడివిత్తును కాను. నెరిచెడి పగవారివల్ల కాన్కలు కొన్న నీతివిహీనుణ్ణి కాను. మైమరచినవాణ్ణి కాను. కొరమాలినవాణ్ణి కాను. నీవు చేసిన మేలుని గ్రహించిన కృతఘ్నుణ్ణి కాను. నేను చేసింది చెలికారం. నీ కళ్యాణం కోరుతూ, నీ కీర్తిని మించి పెంచేవాణ్ణి కాని త్రుంచేవాణ్ణి కాను. నీ మీదగల ప్రేమతో చేసిన ప్రియం అనాలోచితుడవైన నీకు అప్రియంగా తోచింది. అందుకు నేను కర్తను కాను. నా చేసిన ఈ కార్యానికి కారణం వివరిస్తాను విను. నేను ముమ్మాటికి నీ క్షేమం కోరేవాణ్ణి కాని నీవటుల సంశయుడై, నీచుడైనవాణ్ణిగా నన్ను చూడవద్దు. నా చేతలో ధర్మం వుంటే గ్రహించు. అధర్మం వుంటే నిగ్రహించు. సర్వాధికారాలున్నవని తలపోసే అధిపతులకే కొన్ని హద్దులున్నై. అవి అధికార దర్పంచేతా, అహంకారంచేతా గుర్తించరు. అలాగా భృత్యజనులకూ కొన్ని విధి నిషేధాలున్నై. నీవు రథివి. నేను సారథిని. నీ ధర్మం శత్రువుతో పోరటం, హయ సారథ్యంవహించడం కాస్తూ వుండటం. ఉన్నత ప్రదేశంలోవున్న వాహిని క్రిందకు తెచ్చినట్లు సంగ్రామ మధ్యకాలంలో రథం మరలించి తెచ్చాను. ఆ పని ఎందుకు చేశానో, అది ధర్మ సమ్మతం అవునో కాదో విని తీర్పు చెప్పు. నీవు ఆపదలో వుంటే రథం మళ్ళిస్తుంటే మందలించే వాడివేకదా? కనుక నీకు స్పృహ లేదు. రాముని బాణాగ్నికి నీ శరీరం తప్తమైంది. నీవు తెలివి వచ్చే వేళకు స్తంభా లంబనంగానే వున్నావుకదా? అదే అప్పుడు

నీవున్న స్థితి. చేతిలో ధనుస్సు జారుతుంటే, దృష్టి దోషం పొందుతుంటే ఎలా యుద్ధం చేస్తావు? నీ వదనం వెలుగు మాసింది. మిక్కిలి బడలిక శరీరానికి కలిగింది. పైగా శ్రమ మయమైంది. మోహంలో తెలివి లేదు, యుద్ధంలో గెలువలేవు, ఆ సమయంలో అక్కడ వుండటం క్షేమంకాదని తలపోశాను. హయాలు శరక్షతగాత్రాలై సుడివడి చీలువడినై. చెమటలు కారుతున్నై. దుష్ఫల హేతువులైన దుశ్శకునాలు ఎన్నో పొడకట్టినై. ఈ సమయంలో సూతునకు కర్తవ్యం ఏమిటో ఆలోచించు? సూతధర్మాన్ని శిష్టులు ఇలా నిర్ణయించారు. "దేశకాలాల తెరగు తెలుసుకుంటూ, శుభాశుభాలను గుర్తిస్తూ, రథికుని మొగంలోని వైలక్షణ్యాన్ని గమనిస్తూ, బలాబలాలను తూకంవేస్తూ, మిట్ట పల్లాలను తెలిసిస్తూ, సమ విషమ స్థలాలను కనుగొంటూ, సమరకాలం, సాగుతున్న క్రమం పరికిస్తూ, పరుల రంధ్రాన్ని వెదకుతూ, పగవానికి, ప్రక్కగా, ఎదురుగా, పోటికి వచ్చే వేళ నిర్ణయిస్తూ, రథికునకు ఏ విపత్తు రాకుండా చూడటం సారథి విధి." పెద్దలు చెప్పిన ప్రకారం నా ధర్మం నేను నెరవేర్చాను. నేను ఎందుకు చేశానో అది నెరవేరింది. గుర్రాలు బడలికతీరి జవంతో పుంజుకున్నై. నీకు శ్రమతీరింది. ధృతిమంతుడవూ దృఢకాయుడవూ అయినావు. వదనం తేజో వంతమైంది. ఇప్పుడు నీలో విచక్షణా బుద్ధి వెల్లివిరిసింది. కనుక నీవేది చెపితే అది చేస్తాను. నీ వుప్పు వులుసు తిన్నందుకు అయిన ఋణం తీర్చు కుంటాను ఇక క్షమార్హుడనో, దండార్హుడనో నీవే నిర్ణయించుకో" అని ప్రాంజలిబద్ధంగా నిలుచున్నాడు. సారథి మాటలు పలుసార్లు ధ్యానించాడు. మెచ్చుకున్నాడు. సూతకర్తవ్యం నీకే చెల్లిందని శ్లాఘించాడు. హస్తాభరణం తీసి బహూకరించాడు. "సారథీ! సీతాపతి రథముఖంగా పోనీయి. రక్షఃపతి రణరంగంలో పగతుని ప్రాణంగొనక వచ్చుటంటే తప్పకోడు" అని చెప్పి కార్యం నిర్దేశించాడు.

## అగస్త్యుడు రామునికి ఆదిత్యహృదయం ఉపదేశించుట

రావణుని రథం రణానికి దూరంగాపోగానే మూర్ఛ సడలించాడు. సమరపరిశ్రాంతుడై, చింతాకుల హృదయుడై, రథస్థుడై వస్తున్న రాముని

రాముడు చూచాడు. రణవిశ్రాంతికి సన్నద్ధుడై చాపం సజ్యం చేయబోతున్నాడు. రామరావణ సంగ్రామ దర్శనాభిలాషులై గగనంలో నిలిచిన దివౌకోమండలిలో నున్న మహాశక్తిమంతుడు అగస్త్యుడు రాముణ్ణి చూచాడు. త్రుటికాలం అంతర్ముఖుడైనాడు. బ్రహ్మ వరంచేత ప్రళయాంతకుడులాగా భావిస్తున్న రావణుని రాముడు నిగ్రహించలేడని గుర్తించాడు. మరుక్షణంలో రాముని రథంముందు సాక్షాత్కరించాడు. వెంటనే రాముడు రథావతరణం చేసి నమస్కరించాడు. అగస్త్యుడు దీవించి "రామా! శ్రీరామా! త్వరగా విను. సావధానుడవు కా. ఇది పరమ గుహ్యం. సనాతనం. సదాతనం. వైరి విదళన కారణం. శీఘ్ర విజయశ్రీ పదం. దీన్ని ఆదిత్యహృదయం అంటారు. శ్రీదం, పుణ్యం, విరోధి సంహారకం, పరమ శివం, భద్రకారణం, నిత్యం, అక్షయ్యం, సర్వపాప విదళనక్షమం,విజయ కారణం,శోక చింతాది మనఃకల్మష నిషూదనం ఉత్తమ మంత్రం, ఆయుర్వర్ధనం, సర్వమంగళ మాంగల్య మహితయశం, సర్వ వాంఛాప్రదం ఇది. దీన్ని భక్తితో జపించితే, తన్మనూపాస్యుడు, రశ్మిమంతుడు, సముద్యతుడు, రవి సురాసుర మానవాది వందితుడు, భాస్కరుడు, అఖిలలోక వల్లభుడు ప్రసన్నుడవుతాడు. ఈతడే తేజస్వి. సర్వదేవ స్వరూపుడు. రశ్మిభావనుడు. సర్వ దేవాసురగణం. జగత్పోషణ చణకిరణుడు. బ్రహ్మ విష్ణు రుద్ర స్కంద మహేంద్ర దిక్పాలక ప్రజాపతి రూపధారి. ప్రజాప్రాణం ఇతడే. ఈతడే ఋతుకర్త. ఈతడే ప్రభాకరుడు. రామా! శ్రద్ధగా విని ధారణచేయి. మంత్రోపదేశం చేస్తున్నాను" అని అంగ న్యాస కరన్యాసబీజాక్షరంగా మంత్రం ఉపదేశించాడు. ధ్యానరూపంగా ఆదిత్య హృదయం ఆవిష్కరించసాగాడు.

"హేభగవాన్! నీవేఆదిత్యుడవు, సవితృడవు, సూర్యుడవు, ఖగుడవు, పూషుడవు, గభీరమంతుడవు, హేమరేతుండవు, భానుడవు, తపన దివాకర నాముడవు, సుపర్ణుడవు, త్వష్టవు, హరిదశ్వుడవు, సహస్రార్చివి, మరీచి మంతుడవు, అంశుమంతుడవు, సప్తసప్తివి, తిమిరారివి, శంభువు, మార్తాండు డవు, రవివి, అగ్నిగర్భుడవు, శంఖుడవు, భాస్కరుడవు, శిశిరనాశనతపనులు, శివంనీవే. హిరణ్యగర్భుడవు నీవే. అదితి సుతుడవు నీవే. సువర్ణామయుడవు నీవే. నభోభవుడవు, నిగమపారగుడవు నీవే. తేజస్సులలో తేజస్విని. ద్వాదశాత్మ, దిననాయక, దేవా! జయభద్రా! జయపద్మబాంధవా! నీకివే

నమస్సులు. ప్రాక్శైలానికి నమస్కారం. అస్తశైలానికి అంజలి. ఉగ్రునకు, జ్యోతిర్గణపతి హర్యశ్వ జయునకునతి. సర్వనామధారీ! సూర్యభగవానుడా! సృష్టిస్థితిలయకారణ కారణా! వర్షప్రదా! జగన్నిద్రాసమయ జాగ్రన్మూర్తీ! ప్రతిస్మృతి సవనాగ్ని హోత్రఫలరూపా! నమస్తే నమస్తే నమః" అని బోధించాడు. "రామా! ఈ మహామంత్రం ఆపదల్లో, కష్టాల్లో, అడవుల్లో, భయకాలంలో, ఎవరు స్మరిస్తారో, వారు నిరాకులులై, నిరామయులై దుఃఖ రహితులవుతారు. నీవు సర్వమంత్రగ్రహణానికి అధికారివి. నిర్మలచిత్తుడవు. ఏకాగ్ర మనస్కుడవై ముమ్మారు పఠించు. నీకు విజయం సిద్ధిస్తుంది. వస్తున్నాడు ప్రత్యర్థి పంక్తిముఖుడు. ఈసారి రావణ వధ నీచే జరిగి తీరుతుంది" అని చెప్పి అంతర్ధానం పొందాడు. రాముడు సంయమంతో సర్వచింతలు నణచి, సూర్యమండలాన్ని చూస్తూ, ఆచమించి త్రివారం పఠించాడు. చాపం చేతికి తీసుకున్నాడు. రావణ వధకు సంకల్పం చేశాడు. జగచ్చక్షువైన సూర్యభగవానుడు రాముని స్తోత్రానికి ప్రమోదం పొందాడు. "విజయోస్తు. రామ! వాంఛా ఫల సిద్ధి రస్తు" అని అనుగ్రహించాడు.

## రాముడు మాతలిని హెచ్చరించుట

రావణాసురుడి రథాన్ని సారథి రణభూమిలో ప్రవేశ పెట్టాడు. శాత్రవ వాహినీ సంఘర్షణం, గంధర్వ నగర నిరామూర్తిమంతం, ఉన్నత ధ్వజం, సంపన్న జాంబూనదమయ విరాజిత హయ సంవలితం, యుద్ధోపకరణ సమృద్ధం అయి మిన్ను ముంగేలాగా, సాగరం పొంగేలాగా, తమపర సైన్యం క్రుంగేలాగా, తన సైన్యం నింగినందేలాగా రావణుని రథాన్ని సారథి నడుపుతుండే పంక్తిముఖుడు ప్రహృష్ట మానసుడైనాడు. ప్రబల నిస్స్వనయుతం, కృష్ణవాజి సహితం, చంచలాధ్వజ గహనం, సారతరం, ఇంద్రాయుధోపమాయుధ సాంద్రం, రౌద్రకాంతిపూరం, నిస్తంద్ర వర్షధారో పమరుంద్ర శరాసార పతనభీషం అయిన రావణరథాన్ని రాముడు మాతలికి చూపించాడు. బాలచంద్ర సన్నిభమైనదాన్ని, పిడుగులవంటి మ్రోతలు పుట్టించేదాన్ని, ఇంద్ర చాపాన్ని తాను ముష్టిలో బిగించి, "మాతలీ! మన పగవాని రథం చూచావా? అది వచ్చే వైఖరి లక్షించావా? చావుకోసం తానే అవశ్యంగా వస్తున్నాడు. నీవు హెచ్చరికతో శాత్రవుని

ఎదుర్కొంటాను. ఝంఝూవాతం మేఘాలను చెదరగొట్టినట్లు వాటి బల సంపద చెదరగొడతాను. నా దృష్టి రావణుని సర్వ శరీరం మీదా నిలుపుతాను. నీవు నీ దృష్టి నిలకడగా వుంచి, హృదయం ఏకాగ్రతగా నిలిపి, చీలు పడక, కంగారుపోక, భ్రాంతి పొందక, పగ్గాలు లాగేవేళా, వదిలే వేళా, లాఘవం చూపించు. ఇంద్రునివంటి రథికునకు సారథ్యం చేసే నీకు మెలకువలు చెప్పేంతవాడనా? సారథి రక్షణ రథికుని కర్తవ్యం కనుకా, నా చిత్తం పగ వాని మీదే వుంచుతాను కనుకా ఇంతమాత్రం హెచ్చరించాను. కాని, అధికారికంగా అన్న మాటలు కావు. నీ రక్షణ నీవే చూసుకోమని చెప్పటంకోసమే" అని చెప్పాడు. మాతలి ఆ మాటలకు సంతసించాడు. రామునకు తన నేర్పు చూపదలచి అపసవ్యంగా వస్తున్న రావణ రథాన్ని ధరాధూళి రేగి క్రమ్ముకొనేట్లుగా మాతలి తన రథం తోలాడు. రాముని రథం రాకకు రావణుడు క్రోధోద్దీప్తుడై, తంతోపతంగాలుగా బాణాలను రామునిపై వర్షించాడు.

## రావణ మరణం సూచించే చిహ్నాలు కనుపించుట

రోష భీషణుడూ, ధైర్య భూషణుడూ, ధర్షణామర్షణుడూ అయిన దాశరథి శక్ర చాపంతో శాత సాయకాలు కుప్ప తెప్పలుగా గుప్పాడు. రామ రావణులు పరస్పర నిర్మథనాభిలాషులై మత్త వన కంఠీరవ ద్వయం లాగా పోరుతుంటే, దేవతా సమూహం అభ్ర వీథిలో గుంపులు గుంపులుగా నిలిచి ఆ మహారథుల సంగ్రామం ఆలోకిస్తుండగా, రావణుని ఓటమి కోరుతూ చూడసాగారు. ఆ సమయంలో ప్రకృతి తన ధర్మాన్ని తాను నెరపింది. రావణుని రథంపై రక్త వర్షం కురిసింది. గాలి సుడి తిరుగుతూ వీచింది. రథం పైగా గ్రద్దలు గుంపులుగా తిరిగినై. దాసాని పువ్వు రంగుతో సంధ్య లంకా నగరంపై కనిపించింది. దినాంతమైనా, పూర్వంలాగా ధరిత్రి మండుతున్నట్లుగా తేజరిల్లింది. తోకచుక్కలు పుట్టినై. భయంకరంగా పిడుగులు పడినై. నిశాటులు వనాటులతో పోరేవేళ వాళ్ళ చేతులెవరో బిగించినట్లుగానై గోల గోలగ ఏడ్చారు. రావణుని రథం పోతున్నంత మేర ధరణి క్రుంగసాగింది. సూర్యకాంతి సప్త వర్ణాలతో అసురేశుని తనువుపై ప్రసరించింది. రథం వెంటబడి వస్తున్న బోరగల పిండు ముఖాల్లో మంటలు గ్రక్కుతూ పంక్తివదనుని వదనం చూస్తూ అశివంగా అరిచినై. చీకట్లు దట్టంగా అలము

కున్నై. పాంసుజాలంతో ప్రతికూలంగా వాతం వీచసాగింది. దృష్టి లోపం కల్పించింది. ఉరుములురుమగానే పిడుగులు రాలినై. సైన్యాలను పాంసువర్షంతో ఆకాశం అగోచరమైంది. శారికలవింపు జగడాంలో, పరుష ధ్వనంతో వచ్చి పడినై. కటతటులు విస్ఫులింగాలు వెదజల్లినై. కన్నుల్లో నీరు కార జొచ్చింది గుర్రాలకు. తన లోటులేకుండ ప్రకృతి మాత తన బిడ్డకు రానున్న కీడు, బహుముఖాలుగా ఉత్పాత దృశ్యాలతో తెలిపింది. రామునకు సౌమ్యములూ, క్షేమావహాలు అయిన చిహ్నాలు తోచినై. ఆ శుభ నిమిత్తాలను దాశరథి వీక్షించి సమరంలో చండశాసనుడైన లంకేశుడు చస్తాడని తలిచాడు.

## వనచర నిశచరులు రామ రావణ యుద్ధం దిగ్భ్రమతోని చూచుట

బ్రహ్మజ్ఞుడైన లంకాపతి అరిష్ట సూచకాలైన దుశ్శకునాలు ఎదుట తోస్తున్నా చలించలేదు. "సీతను తెచ్చినప్పటినుంచీ లంకలో ఉత్పాతాలు జరుగుతూనే వున్నై. విభీషణాదులు వివరించారు కూడా. దళ నాయకులు వెడలినప్పుడల్లా ప్రకృతి కీడు సూచిస్తూనే వుంది. వాళ్ళు విషయ గ్రహణ సమర్థులు కాక, రాజాజ్ఞ పాలించారు. స్వర్గం చూరగొన్నారు. ఇప్పుడు నా వంతు వచ్చింది. నాకూ ఆ తల్లి ముఖ్య హెచ్చరిక చేసింది. మరలిపోతే మరణం తప్పుతుంది. నేను మాత్రం జీవిస్తాను. నాకోసం బలియైన సోదరాత్మజ మంత్రి సేనా నాయక భటవర్గాన్ని బ్రతికించి, అనాథలై, అపుత్రకలైన అపార రక్షఃకాంతల కన్నీరు తుడువలేను. నా దేవి మండోదరి గర్భశోకం తీర్చలేను. రాముని జయించలేను. జయించినా సర్వ శూన్యమైన లంకను పాలించలేను. ఆర్తలై విలపించే అసురకాంతల ఆక్రందనం వినలేను. లోక దూషణ విని భరించలేను. శౌర్యనిధులైన నాకు సంగ్రామ మరణం సర్వ ధర్మ సమ్మతం. నా చావు సర్వలోక సమ్మతం. నా పగకు అంతిమ కాలం, నా స్వస్థాన ప్రవేశకాలం ఒకటే. ఇహలోక విమర్శనలతో నాకు పనిలేదు. నా ప్రజ్ఞా ప్రతిభావిభవానికి త్రిలోక విజయం నిదర్శనం. నా బ్రహ్మత్వానికి, నా మనోనిగ్రహానికి నే చేసిన అభిచార హోమమైన భయంకర తపస్సే సాక్ష్యం. దేహధారులకు ఎప్పుడో ఒకప్పుడు చావు తప్పదు

కనుక నాకూ తప్పదు. బుద్ధిమంతులు దాన్ని సద్వినియోగం చేసుకుంటారు దుర్బుద్ధులు దుర్వినియోగం చేసుకుంటారు. ఆ కర్మలు వాళ్ళ వాళ్ళ సంస్కారబలం కొద్దీ జరుగుతుంటవి. నా చేతల రహస్యం నాకే తెలుసు. నేను లోకానికి దుష్టుణ్ణి. అలా కావటం నా అభిమతం. అదే పరమార్థమూ, పరమ రహస్యమూ. నా చావుకు రాముడు నిమిత్తమాత్రుడు. దేవతల జయించిన నా దివ్య శక్తుల్ని నిగ్రహించే శక్తి కలవాడు కాకపోతే నన్నెలా చంపగలడు? ప్రకృతి హెచ్చరికలనుబట్టి చూస్తే మానవాకారం పొందిన మూలశక్తే రాముడని తోస్తూంది. కాకపోతే నా దివ్యాస్త్రాలు ఎందుకు వ్యర్థమవుతై ? నా మరణం కోసమే మూలశక్తి ఆకృతితో దిగివస్తే అందులోని అంశమైన నేను అందులోనే లీనంకావటంకన్న కోరతగిందేది? బాహ్యంగా ఎన్ని దుష్కార్యాలుచేసినా అంతఃపరిశుద్ధిగల నేను ఈ మంచి కార్యం బాహ్యంగా చేసి "శుభయశం సాధించా"నన్న కీర్తిగడిస్తాను. నా జన్మ చరితార్థం చేసుకుంటాను. నా తమ్ముడు సద్గుణ సంపన్నుడు. వాడుచేసే పైతృకకర్మతో నా బాహ్య దుష్కృతఫలం నశిస్తుంది. వాడి పాలనలో నా కులం కళంకంలేకుండా సుఖిస్తుంది. విచక్షణా స్వరూపిణీ! మంచిమార్గం మా హితవు. నీకు నమస్సులు. నీ నిర్ణయానుసారం యుద్ధం చేస్తాను. నా బాహ్యాభ్యంతర శక్తులతో రాముని గజగజ లాడిస్తాను. అతను ధర్మమూర్తి. సత్యవ్రతుడు. నా యుద్ధ కౌశలం త్రికరణ శుద్ధిగా మెచ్చుకుంటాడు" అని అంతర్వాణిని దర్శించాడు. "సారథీ! నీ సర్వాస్త్రాలు చూపు. రథం మాత్రం మరల్చకు. పోనీ ముందుకు. రామా! వచ్చాను. భీరువువై పారిపోకేమ. అప్పటి నా స్థితికి వెరచి సారథి స్వతంత్రించాడు. నేను హెచ్చరించాను. ఇక తేరు మరలదు" అంటూ ప్రబోధించి శర ప్రయోగం సలిపాడు.

మళ్ళీ స్యందనంలో ప్రత్యక్షమైన పంక్తిముఖుని పరికించాడు. ఆ మూర్తి రామునకే మనోహరంగా వుంది. వేసిన బాణాలకు వేడి అధికంగా వుంది. అర్థం చేసుకున్నాడు. హర్షోల్లాస వికాస భాసురముఖుడై, జ్యాకర్షారావం దిశలు భేదింపగా, సమర్థమైన శాతశరపాతంతో వర్షించాడు. ప్రతిపక్షి పటుపాటవం చూచి పంక్తి గ్రీవుడు క్రూరనారాచ పరంపర వర్షించాడు. ఆకాశం త్రిజగద్భయానకంగా వర్తిల్లింది. మర్కట మూకల వీపులు రణానికి ఉత్కంఠితులై కూడా, సర్వాయుధాలు కలిగి కూడ, రామరావణ

సంగ్రామం చూస్తూ, చేష్టలుడక్కి, తర్కవితర్కాలతో, తదేకదృష్టులైనారు. అబ్బురపడి చూస్తున్న ఇరుతెగలవారూ చూచే తొందరలో దగ్గర దగ్గరగావచ్చినా శత్రుభావంతో ఒకరిపైఒకరు దెబ్బ తీయటం లేదు. రాక్షసులు రావణునీ వానరులు రాముణ్ణీ చూస్తూ విస్మయులై నోరు తెరచి సాలభంజికలైనారు.

## రాముడు రావణుని ధ్వజం నరుకుట

ఇరువురు నిజ విజయాకాంక్షులై ఈసు విడువక, భయభ్రాంతులుకాక, మధ్యాంత ప్రౌఢిమతోను, పరస్పరహనన భావంతోను, తమ తమ బలవిక్రాంతులు సమగ్రంగా సంతరించుకుని దర్శించారు. హోరాహోరీ పోరాడుతున్న రావణుడు, ఉగ్రశిలీముఖాలు రాముని ధ్వజం లక్ష్యంగా వేశాడు. అవి దాన్ని తాకి దివ్యం కావటంచేత విరిగిపడినై. రాముడు రావణుని వ్యర్థయత్నంచూచి ప్రతిగా, తన యత్నం సార్థకంకాగా ధనువు తెగదిగిచి శరం వైచాడు. అది ప్రత్యర్థి ధ్వజాన్ని తాకి వాడి ఓరంతో కూడ దాన్ని నేల కూల్చింది. ధ్వజపతనంగాంచిన దానవపతి, దారుణ రోషపరీతచిత్తుడై రాముని హయాలను బాణవర్షం పాలు గావించాడు. అవికూడా దివ్యాలు కావటంచేత తామర తూడులతో కొట్టినట్లుగా నిశ్చలంగా ఉన్నై. ఈ యత్నం కూడ విఫలం కావటం సురవైరికి ఇంకా కోపకారణం అయింది. వెంటనే శాంబరి నాశ్రయించి, మాయావిహిత ముసల ముద్గర గదాది భీకరాయుధాసారవృష్టి సృష్టించాడు. ఒక్క రాముని రథం తప్ప సర్వరణక్షోణి కూడ భీతిదంగా నిండింది. ఇది ఇంకా రాముని దైవత్వం స్పష్టంచేసి అసురపతిని విభ్రాంతిలో ముంచింది. పరాజయం పొందినకొద్దీ పట్టుదల సహస్ర గుణితంగా పెరిగింది. ఏకోద్యోగ విజృంభమాణుడయి దైత్యుడు అవ్యాక్షిప్తచిత్తంతో శరసాహస్రం దేవతలచ్చెరువునందగా మాయా ప్రభావంతో కురుస్తుంటే శ్రీరాముడు చీకాకు పడ్డాడు. అంతలోనే సూక్ష్మ వ్యాకోచానువడై శత్రువుపై ప్రతిగా ప్రయోగించాడు. అప్రతిహతంగా పురోగమించి వస్తున్న పేరాది బాణాలను నిరోధించాలని రక్షఃపతికూడ అదే ప్రయోగించాడు. ఇరువురు వేసే బాణాలు తాము పేనినట్లు పెనగొని ఆకసానికి ప్రతిగా రెండవ ఆకాశాన్ని కల్పించినై. ఇద్దరూ మహాయోధులు. భండన పాండిత్యం పారం ముట్టినవారు. చండకరాంశు ప్రతిహత తేజస్సంపన్నులు. ప్రచండ చాపకళా దోర్దండులు.

ఒకడు బ్రహ్మదత్త వరబల పరాక్రముడైతే, వేరొకడు ధర్మ స్వరూప సత్య పరాక్రముడు. వాళ్ళ యుద్ధంలో నేర్పు వాక్కుల కందదు. గురి తప్పదు. వ్యర్థంగాదు. వైరిశరం ఖండించకుండా విసరపోదు. వాడి చెడదు. విరుగదు. విడు సేవదు. అహో! వాళ్ళ యుద్ధం పరాకాష్ఠ నందుకుంది. ఒకరి బాణాలు వేరొకని బాణాలు తాకి తుత్తుమురై నేల పడుతున్నై. సవ్యాప సవ్య సంచార భేదాలు చూపుతూ, శరాలు పరపుతూ, రాముని గుర్రాలను రావణుడు బాధిస్తే, రావణుని హయాలను రాముడు వేధిస్తున్నాడు. రామ రావణులు తమ శక్తి పణంగా సమ సంగ్రామం చేస్తుంటే, సకలభూతరాశి సంభ్రమంతో చూస్తుంటే, దేవతలు తెల్ల మొగాలతో తెలివి మాసి వీక్షిస్తున్నారు. ఇటువంటి యుద్ధం "నభూతో నభవిష్యతి" అంటూ భయ సందేహాలు బాధించగా మహర్షులు వాకొన్నారు.

## రావణుడు రామునితో భీమంగా పోరుట

అంతకంతకు ఉభయులకూ వెర్రి ఆవేశం హెచ్చింది. రథికులు ఇలా వుంటే, సారథులు తమ నేర్పు చూపసాగారు. డాసి, పాసి, కదిసి, ఒకదాని నొకటి ముట్టి, విచ్చిపోతూ, జవం హెచ్చుతూ, ఎదిరి తప్పులు వెదకుతూ, రథ విన్యాసం చిత్ర విచిత్రగతుల వెలయిస్తూ, యోధులు డాయుచోట, మళ్ళి పోయుచోట, గమనజవం కనపరుస్తూ, మేనూలు ఒండొంటిని ఒరుస్తూ, వట్టం చేస్తూ విడిపోతున్నట్లుగా సారథ్యసామర్థ్యం నెరపుతూ అబ్బురం కలిగించారు. ఈ విధంగా ఇద్దరూ సాటోపంగా కదనంలో సంచరించి ఒకరికొకరు ఎదురై కాడికి కాడి, గుర్రాల మూతులకు మూతులు, చెక్కులకు చెక్కులు ఢీకొనగా శతాంగాలను సూతులు నడుపుతుండగా లోకభీకర సమరం సాగించారు. ఆ సమ యుద్ధంలో రాముడు నాలుగమ్ములతో నిశాటపతి నాలుగు గుర్రాలను శక్తి నశించిపోయేలాగా కొట్టాడు. రావణుడు కొండల భేదించే, దండి ములుకులతో కోదండ రాముని గురిచూచి కొట్టాడు. శాత సాయక సంజనిత వేదన ప్రక్కకు నెట్టి సీతాపతి కరకుటమ్ముల కఠిన కర్ముడైన పౌలస్త్యుని బాధించాడు. వాడు అందుకు ప్రతిగా మాతలిని మార్గణ శతంతో మర్మాంగాలు సడల చేశాడు. సురనేత సారథి తను కట్టిన పాటి మనకైనా పొందక, చిత్తవిక్షేపం లేకుండ నిర్భయంగా

ఉన్నాడు. తనను, తన సారథిని నొప్పించిన దేవ ద్వేషిపై రఘురాముడు రక్తనయనుడయి రూక్ష శరాలను విసరి రావణుని రణ విముఖునిగా చేశాడు. ఇంకా ఇరవై, ముప్పై, నలభయి, యాభై, అరవై, నూరు, వేలు, ఘోర శరవారం వేసి రఘునాథుని తనువు రక్తసిక్తం గావించాడు. అసురపతి అంతకంటే విజృంభించి శూల గదా పరిఘాది సాధనాలతో రాఘవుని రక్తవస్త్రుని గావించాడు. ఆ ఇద్దరి అపూర్వ బాణ ప్రయోగాలకు సప్తసాగరాలు సంక్షోభం పొందినై. కులాచలాలు పాదులు కదిలినై. పదునాల్గు లోకాలు భయభ్రాంతమైనై. సురాసుర యక్ష పన్నగ గంధర్వాదులు శోకం పొందారు. సమస్త విశ్వంభర సాగర మేఖలా పరివృతంగా సంచలించ సాగింది. కమల బాంధవుడు కాంతి మాశాడు. సదాగతి (గాలి) గతిమాని మ్రాన్పడ్డాడు. అపారమైన భూతజాలం ఆక్రోశించింది. "స్వస్తి గోబ్రాహ్మణేభ్యోస్తు లోకాస్సమాశాశ్వతా స్తిష్ఠన్తు చ సమితి విజయతాం రాఘవో విశ్వ విద్వేషిణం రాక్షస నాయకం రావణంచ" అని మహర్షులు శాంతి మంత్రం జపిస్తున్నారు. అమరులు ఆ మహాశక్తి సంపన్నుల ఆహవం తిలకిస్తూ, రోమహర్షణులై, "ఆకాశానికి ఆకాశం, అంబుధికి అంబుధి, రామ రావణ యుద్ధానికి రామ రావణ యుద్ధం సమం" అని ఆశ్చర్యం ప్రకటించారు.

## రాముడు రావణుని తల నరుకుట

చండామర్ష భీషణుడైన రఘుకులజలధిసోముడు రాముడు ఆశీవిషతుల్య శరాలను చాపంతో కూర్చి, రత్నోజ్జ్వలచ్ఛుండాగ్రావయవం, కుండలాంచితం ఐన శిరాన్ని ఖండించాడు. ఆ శిరపాతం బ్రహ్మాండమంతా చూచింది. అసురులలో నుంచి హాహాకారాలు పుట్టినై. అంతలో రావణుడు రాముని అమిత శక్తిగల అస్త్రాలతో అల్లాడించాడు. నరికినచోట మళ్ళీ శిరం మొలిచింది. రాముడు మళ్ళీ దాన్ని నరికాడు. తల తెగి ధరణిపడి దొర్లింది. తనువు నిశ్చలంగా వుంది. చాపం నుంచి శర ధార కురుస్తూనే వుంది. శరఃపాతం చూచిన రాఘవుడు తిరిగి శీర్షం తెగిన చోటనే వుండటం చూడలేనంత క్షణంలో జరుగుతూంది. ధీరత్వం రెట్టించగా దాన్ని తునుమాడాడు. ఆ ప్రయత్నం వ్యర్థమైంది. రావణుని శిరాలు మొలిచేవి మొలుస్తుంటే రాముడు నరికేవి నరుకుతున్నాడు. ఒకటికాదు, రెండుకాదు, పదికాదు—నూరు

మాట్లు నూరు శిరాలు నరికాడు. అంతవాడైన రామునకు ఆశ్చర్యం, అసూయా కలిగింది. "మారీచుణ్ని మడియించాను. ఖరదూషణ త్రిశిరుల పదునాల్గు వేల బలంతో ఖండించాను. క్రౌంచ వనంలో విరాధుణ్ని కాలుని పేటికి పంపాను. దండకవనంలో కబంధుని దారితాంగుని చేశాను. ఎప్పుడు నా అస్త్రాలు వ్యర్థంకాలేదు. వైరి భంగించకుండగనే నా అస్త్ర సంతానం వడిచెడి, వాడి తగ్గటం జరుగుతూంది. ఈ విధంగా కావటానికి హేతువు ఏదో తెలియటంలేదు. అబ్బా! ఎంత భయంకర వైరి ఈతడు? ఈతని బలపరాక్రమ వివరాలే విన్నాను. కాని, విభీషణుని ఈ విషయం అడగలేదు. అతడు చెప్పలేదు. ఆ మర్మం అడిగితే నా పౌరుషానికే కళంకం. అడగకుండా చెప్పటం అతని అభిమతం కాదు. నన్నాశ్రయించినవాడు నా శక్తి సామర్థ్యాలను ఆ రహస్యం చెప్పి అపకర్షించిన వాడౌతాడు. మిత్రుడు బుద్ధిమంతుడు. అతని మార్గం మెచ్చదగింది. నేనే అసుర సంహారక్రియను ఆలోచిస్తాను" అని తలచి అంతర్ముఖుడైనాడు. అంతలో బాహ్యప్రవృత్తి కల్గినవాడై దారుణాస్త్రంతో వక్షం భేదించాడు. అసురపతి ఎంతమాత్రం చలించక ముసలగదాది సాధనాలతో రాముని ముంచి ఎత్తాడు. ఈ విధంగా రథికులయి సూతుల చోదనంలో నభంపై, భూమిపై, గిరిశిఖరంపై పగలు రాత్రి భేదం లేకుండ, నిమిషం వ్యర్థం కానీయకుండ ఆ రాత్రి అంతా ఘోరాతి ఘోరంగా పోరు సాగించారు. ఆ యుద్ధంలో రామునికే విజయమని నిర్ణయించ సాధ్యంకాక, మాతలి రథికుడైన రామునివంక చూచాడు. కాని, ఆయన లక్ష్యం అసురపతిమీద వుంది.

## రాముడు బ్రహ్మాస్త్రంతో రావణుని వధించుట

మాతలి మళ్ళీ రాముణ్ని చూచాడు. ఈసారి కూడ ఆయన తనవంక చూడనేలేదు. తనకుతానే చొరవ తీసుకున్నాడు. "ఏమి రామచంద్రా! మహానుభావా! అమాయకునివలె ఏమీ ఎరుగనట్లు ఏవేవో అస్త్రాలు వైరివధ నిమిత్తం వేస్తూ వున్నావు? నీ కోరిక ప్రతిక్రియవరకేనా? చంపటం ఇష్టం లేదా? ఇష్టముంటే ఇంకెంతకాలం ఇలా యుద్ధం సాగిస్తావు? సర్వాస్త్రాలు శత్రువుపై ప్రయోగించావుకదా? ఏమి సాధించావు? కాలహరణం మాత్రం జరిగింది. దేవతలు, పరమేష్ఠి ఇచ్చిన వరబల శక్తి, జనన కాలగ్రహ సంచార

సంపత్తి లెక్కించాడు. ఇంకొక ముహూర్తకాలంలో ఆయుః ప్రమాణం ముగుస్తుంది. నీవు ఆలస్యం చేయకుండా బ్రహ్మాస్త్రం ప్రయోగించు" అని హెచ్చరించాడు. రాముడు సురపతి సారథి మాతలి సూక్తులు విన్నాడు. ఆ దివ్యాస్త్ర గాథ స్మరించాడు. "సర్వలోక జయార్థంగా విధాత ఇంద్రుని కొరకయి దాన్ని సృజించి ఇచ్చాడు. అతడు కార్యార్థియై అగస్త్య మహర్షికి ఇచ్చాడు. ఆ మహర్షి దండకావనిలో సంచరిస్తూ దర్శనార్థంపోతే తన కిచ్చాడు. ఆ పరమ పూజ్యుడు ఆ మహాస్త్రం తనకిచ్చి ఎంత మహోపకారం చేశాడు?" అని ఆమునికి కృతజ్ఞతా పూర్వకంగా అంజలించాడు. బ్రహ్మను ప్రార్థించాడు. అస్త్రం చాపంలో కూర్చి, పరాంకోటికి చెందిన బ్రహ్మహ్వాన మంత్రం పఠించాడు. వెనువెంటనే, ఆ దివ్యమైన అస్త్రం, పక్షభాగ ద్వయంలో పవనుడు, ముఖంలో భాస్కర పావకులు, ఆకాశమయమైన అంగం, మేరు మందరబలం, రజత భూషితం, బాహ్యమాన సంహననం, సవిత్ర వర్చస్సు, సకల భూత తేజం, ధృఢ పుంఖ దీప్తి మంతం, ఆశీవిష సదృశాగ్రమహోద్రగం, ధూమావృత ధూమకేతు సన్నిభం, శత్రు హయ నాగ నానాయుధ నాశనం, పర్వత భేదన దక్షం, రుధిరసిక్తం, మహానాదం, వజ్రసారం, భేదన నిపుణ భూతచిత్త భయదం, అప్రతిమాన వీర్యం, శివాదయ కంక గృధ్రభక్ష్యప్రదం, అంతకాభం, ఏకైక దివ్యాస్త్రం, వానర కీర్తి ప్రమదావహం, అసురదండ భయావహం, ఆత్మ వంశకీర్తి ప్రతిపాదకం, వైరి వీర యశోహరణ కారణం, చిత్రితగారుడ పక్షం, శతక్రతు మంత్రోదారం, అది సెగలు మండుతూ ప్రకాశించింది. రామునిచే అభిమంత్రితమై సర్వలోక భయానకంగా పరివర్తనం పొందుతున్న బ్రహ్మాస్త్రాన్ని తిలకించి, హాహాకారంచేస్తూ సకలాకాశంస్థ భూతకోటి అలజడి పొందింది. రౌద్ర రూపుడై రాముడు దంభోళిముక్త దండోపమ కృతాంత దారుణమైన బ్రహ్మాస్త్రం విముక్తం చేశాడు. అసురనాథుడు ఆ అస్త్రం రాక చూచి ఆత్మ సమాధి నిష్ఠుడైనాడు. అది వక్షః ప్రదేశం ప్రక్కలించి, జీవాశయాలను గ్రహించి, వెన్ను వెడలి, ధర తాకి శాంతించి, రోహిత వర్ణంతో రాముని తూణీరం చేరింది. పంక్తి ముఖుని ప్రాణ వాయువులు అనంతాకాశంలో లీనం కాగానే, శరచాపాలు చేతినుండి జారి క్షితిపై పడినై. అనంతరం ఆ మహామూర్తి కాయం అవని వాలింది. ప్రభు మరణం చూచిన

71170

రాక్షసులు పట్టలేని దుఃఖంతో లంకకు పారిపోయారు. వానరులు వాళ్ళను వెన్నంటి తరిమి వెనకకు చేతులు ములుపుకొని వచ్చారు. రావణుని మరణం, సీతాపతి విజయం, రణం ప్రవర్తిల్లిన రీతి కథలు గాథలుగా గట్టి కపిసైన్యం గానం చేసింది. రవిపుత్ర హనుమ జ్జాంబవంతాంగద విభీషణాదులు రాముని స్తుతించారు.

## రావణుని మృతికి లోకాలు సంతసించుట

రామచంద్రునిచే రావణుడు నిహతుడు కాగానే, అందంగా, త్రిభువనానందంగా, దుందుభిధ్వానాలు గగన తలం నిండా క్రందుకున్నై. బృందంగా, విగళన్మరందంగా మందార సుమాలు రాముని స్యందనంపై రాలినై. మందంగా, సురభినా నందంగా, సుఖమూలకందంగా కమ్మని గాలి స్పందించింది. లలితమై, మధురార్థకలితమై, సరస గీతమై దేవ మహర్షుల స్తుతులు చెలగినై. లోకవిద్రావణుడు, సర్వభూత భయంకరుడు అయిన రావణుడు రామునిచే నామ శేషుడయిన వార్తను పాటలుగా రచించి దేవ గాయకులు హృద్యంగా పాడారు. సాధు సజ్జన బుధ సంతాన మానసాలు సంతోషంతో నిండినై. దిశలు ప్రసన్నతా దశ సంతరించుకున్నై. గగనం నిర్మలంగా భాసించింది. భూమి కంపించటం మానింది. కమ్మకమ్మగా తెమ్మెరలు పైపై వీచినై. సూర్యుడు తేజోవంతుడైనాడు. ప్రజలు స్వేచ్ఛా వాయువులు పీలుస్తూ వీధుల్లో తిరుగసాగారు. యజ్ఞయాగాదుల హోమ ధూమం అభ్రం అంటుతూంది. లోకం గుండెపై చేతులిడి కునుకుని గురకలతో నిద్రించింది. మానవతులకు హృదయభారం తొలగింది. ఒకేఒక మూర్తి,లంకాపతి స్వర్గం చేరగానే సర్వజగత్తు శాంతితో నిండిపోయింది. వనచర శ్రేష్ఠులు రాముని చుట్టి, ద్వంద్వ సమరంవేళ తాము పొందిన భయ సంతోషాలు వివరించి, విజయలక్ష్మీ కరగ్రహణుడై వెలుగుతున్న రాముని పాదాలు పూలతో పూజించారు.

## విభీషణుడు అన్న కళేబరం చూచి ఆక్రోశించుట

రామ విజయం ఆనందం కలిగిస్తున్నా రావణ మరణం విభీషణుని క్రుంగ దీసింది. ఆపుకోలేని దుఃఖంతో అన్న కాయం పడివున్న చోటును చూస్తూ ఆవురుమని ఏడ్చాడు. అడుగులు వేయలేక వేసాడు. హా! హాసరిత

గాత్రుండై, రామశర సంభిన్న వక్షుండై పడివున్న అన్నను ఒడపై చేర్చి, ఆపన్నుడై కన్నీళ్ళ కాల్వలు కట్ట ఏడ్చాడు. "అన్నా! మహవీరా! భ్రుకుటి విక్షేపమాత్ర కంపితామర లోకవీరా! హోమాగ్ని తర్పిత దశకంఠా! సకల గుణ సంపన్నా! ఎన్ని యుద్ధాలు చేశావు? ఎంత కీర్తి గడించావు? ఎంతటి వేదపరిపించావు? ఎన్ని శాస్త్రాలు చదివావు? ఎంత మనీషివైనావు? ఎంత తపస్సు చేశావు? ఎన్నెన్ని వరాలు పొందావు? ఎంత భోగం అనుభవించావు? లంకానగరంలో ప్రత్యేకంగా మయబ్రహ్మ నీకై నిర్మించిన విమానంలో, ధర్మసౌధాంతరాళంలో, సుకుమార సుందరకాంతాజన పరిచర్యలతో హంస తూలికా తల్పంపై హాయిగా పాని పద్మంలో శయించి నిద్రించు నీవు-అయ్యయ్యో! అగ్రజా! కటికనేల శయనంగా దీర్ఘనిద్ర చెందావా? దైవాన్ని ఏమని నిందించేది? రాళ్ళ పాలబడి, కనకాంగద భూషాంచిత కరయుగ్మం అటు ఇటు పడవేసి, చేష్టారహితుడవై, సహస్ర భానుమండల ప్రభా భాసితమైన రత్న కిరీటం దుమ్ములో దొరలగా మిన్నక పడివున్నావా? నేనెంత నికృష్టుణ్ని? ఎట్టివాడవైనా నాపట్ల చూపిన సోదర వాత్సల్యం ఎలా మరిచేది? ఇది ఇలా జరుగుతుందని ఎంతగా చెప్పాను? కాముకత్వంతో, మోహాంధతతో నిగ్రహించావే కాని పరిగ్రహించలేదుగా? త్రిలోక విజేతలైన కుంభకర్ణ ప్రహస్త నరాంతక కాతికాయులు అయినా ఆత్మబల గర్వితులై నీతి పాటించ లేదుగా? నీవు నీవైనా ఆలోచించావా? అనాలోచితంగా నడచిన నీ మంత్రాంగ ఫలం కుల క్షయానికే దారితీసిందికదా? నేనెంత చెప్పానో అంతా జరిగి పోయింది. నీ సర్వశక్తులు వ్యర్థమైనై. కాలం వక్రిస్తే జీవకోటి తలచి ఎక్కడ నిలుస్తుంది? ఏమి సాధిస్తుంది? కాలగర్భంలో కలిసి పరమాణువుగా పర్యవసిస్తుంది. సునీతి సేతువు పోయింది. ధర్మ విగ్రహం పోయింది. సత్త్వ సంగ్రహ విధం పోయింది. స్తోత్రపాత్ర విషయం హాస్యమైంది. పోయింది మాత్రం నీ పొక్కడవే. ఇనుడు ధర త్రెళ్ళాడు. చంద్రుడు చీకట్లో మున్గాడు. అగ్ని చల్లబడింది. లోకంలో ఇక ఉద్యమాలులేవు. ఉత్సాహం లేదు. అవి అన్నీ నీతోనే పచ్చినై. రాక్షస సింహం రణతలంలో భూమిర్జుంగి నిద్రలేలుభంగి మూర్ఛిల్లగా హతవీరమైన ఈ లోకాన్ని ఏమున్నదని మంగళించగలం? కీర్తి ప్రవాహం, ఓరుపు వృక్షం, ధృతి తపో బలం, విశ్వబద్ధ మూలం అయిన

రాక్షస మూర్ధన్య వృక్షం, రామ మారుత హతికి త్రెళ్ళపడింది. పరాక్రమ విషాణభాసితం, కులసంహారకం, కినుక, కరుణ అనే తమపూ, తుండలుగల రావణ గంధేభం రామసింహదారుణ ప్రహారంతో ధరణి పాసింది. అహో! విధి విలసితం వారిదం విక్రమించి, విక్రమోత్సాహ విజృంభించిత వికటహేతి, దీర్ఘనిశ్శ్వాసఘూర్ణం, దేహసత్త్వ ప్రతాపంకల రాక్షస వీరప్రళయాగ్నిని చల్లార్చింది. అసురవాలకకు ద్విషాద్విత:, శాత్రవధ్వంసనం, హింసారతం, చపలకర్ణేక్షణం, సుశత్రువృషభాన్ని రాఘవద్వీపం తాకి ధరణి కూల్చింది" అని హేతు సహితవాక్యాలతో పుంక్వ గాతెత్తి పనవి పనవి ఏడుస్తున్న విభీషణుని సీతాపతి పరామర్శనం ద్వారాగా అపనయింపసాగాడు.

## రాముడు విభీషణునకు శోకోపశమనం చేయుట

మిత్రమా! ఎందుకేడుస్తున్నావు? ఎవరికోసం ఏడుస్తావు? నీ అన్న కోసమా? బంధు పరివారం కోసమా? ఇందులో ఎవరికోసం ఏడ్వవలసిన పని లేదు. నీవారంతా రణంలో వీర మరణం పొందారు. ఇక నీ అన్న బాహ్య దేహం నశించినా యశశ్శరీరం సృష్టి కొనసాగినంతకాలం నా పేరుతో కలిసి వుంటుంది. ఇంత చేసిన నేను మాత్రం శాశ్వతమా? మేకవులాగా చరించకుండా సర్వశక్తులు ధారపోసి విజయం కోసం పోరాడి వీర స్వర్గం పొందాడు. పరలోక సుఖంకోరే ప్రాజ్ఞులు అయిన క్షత్ర ధర్మం కలవాళ్ళు సంగర మరణమే కోరుతారు. అదే నీ అన్న చేశాడు. అతనికోసం విచారించటం నీకు ధర్మం కాదు. సర్వ భువనాల్లో సాటిలేని మేటిమగలుగా కీర్తిగాంచిన మంత్రి సోదర చమూనాయ కాత్మజ భటవర్గమంతా మరణిస్తే నీ అన్న దుఃఖించాడా? చండ పరాక్రమంతో ఖండనం చేయలేదా? లోకత్రయాన్ని బాధించాడు. దేవతలను వేధించాడు. ఆరని కీర్తి జ్యోతిని సాధించాడు. నా ఎదుట నా తమ్ముని స్రుక్కించాడు. నన్నే పెను దుఃఖంలో ముంచాడు. ఇంతటి వానికోసం శూరుడవైన నీవు శోకించవచ్చా? నేను నా తమ్ముని మూర్ఛకు దుఃఖించాను. ఎంతటివాళ్ళకయినా శోక సంతోషాలు తప్పవు. ఈ ద్వంద్వ గుణాలు శరీరధారులకు తప్పవు. కాని, స్థితప్రజ్ఞులు వెంటనే నిగ్రహించుకుని కర్తవ్యపాలనం చేస్తారు. నేను ఆ దృశ్యం చూస్తూనే సమరం సలపలేదా?

ఖ్యాతి పొందాడు. ఔర్ధ్వదైహిక కార్యం నెరవేర్చేందుకు రామప్రభూ! ఆజ్ఞ ఇస్తావా?" అని కోరాడు. దయామూర్తి అయిన రాముడు "మిత్రుడా! ఇంకా నన్ను అడుగుతున్నావా? వైరం మానవులకేకాదు సకల జీవకోటికి మరణాంతం. మన కార్యాలు తీరినై. ముందు పనులు నీవు తీర్చు. అతడు నీ-కెట్టివాడో, నాకూ అట్టివాడే" అని అనుమతి ఇచ్చాడు.

## రావణుని భార్యలు పతి శవం చూచి విలపించుట

లంకేశుని మరణ వార్త క్షణాలమీద లంకంతా వ్యాపించింది. ఆ వార్త విన్న అంతఃపురకాంతలు గోడు గోడున ఏడుస్తూ, విడిపోయిన జడల్లోనుంచి నలిగిన పూల మాలికలు ప్రక్కలను, వెన్నుమీదా పడుతుండగా, జారుతున్న పయిటలు అశ్రుజలంతో తడిసిపోతుండగా, చేతులతో గుండెలు కొట్టుకుంటుంటే మెడలో హారాలు చిక్కుపడి, తెగి, నేల రాలిపడుతుండగా, దుఃఖాశ్రువులతో కన్ను చీకట్లు క్రమ్మ, ఘన భారంతో నడక తడబడగా, మేను మాడిపోగా, ముడివడి పొరలుతూ, నెత్తి మోదుకుంటూ, తత్తరిస్తూ, హతవత్స గోబృందంలాగా భర్త మరణస్థలానికి, ఉత్తరద్వార రక్షకులు దారి చూపగా, వెదుక్కుంటూ చేరవచ్చారు. అల్లంత దూరంనుంచే ఆత్మేశ్వరుని కళేబరం చూచి, పరుగు పరుగున వచ్చి పైబడి రోదించసాగారు. "హా! జీవితేశ్వరా! ప్రాణనాథా! పతీ! ఆనందవర్ధనా! లంకేశా! మమ్ముల విడిచేసి మరణించావు? ఇంక మాకు దిక్కెవరు?" అని అనేక విధాల అనుబంధాలను త్రవ్వి త్రవ్వి, కాలగతినందిన కరిశ్రేష్ఠుని పైకరేణువులు విలపించినట్లుగా, నేలపడివున్న తమ నేతను తలచుకుంటూ, తెగిన తీగెలవలె రోదోంతరాళం పిక్కటిల్లేట్టు రోదించారు. ఒకసతి కౌగిలించుకుని, ఒక అర్ధాంగి తన చనుపుతలంటుకుని, ఒక గృహిణి పదాలపై పడి, ఒక రమణి సతిపతుల అనుబంధాన్ని ప్రస్తావించి, ఒక మానవతి చేతితో తలను కొట్టుకుని, ఒక మనోహరి ప్రాణేశుని ఎడబాటు సహించలేక మూర్ఛిల్లి, ఒక ఆత్మేశ్వరి విభుని తల ఒడిచేర్చి, ఒక సాధ్వి పలుకలేక, ఏడ్వలేక శిలాప్రతిమగా మారి, "నాథా! నాథా! మాకూ నీతోటిదే లోకం. మేంకూడా నీతోనేవస్తున్నాం" అంటూ, ఒక్కసారి ఆ మహావీరుని కాయంపై స్పృహలేకుండా పడ్డారు. "ఏ వీరుని ఎదిరించి ఇంద్రుడు మానం కోల్పోయి దీనుడైనాడో, ఏ పరాక్రమ

తర్కితమాయా విశేషంతో నిన్ను మాయించి వుండాలని మదికి తోస్తోంది. కాకపోతే ఇంద్రుడు ఈ పని చేసివుంటాడు. కాదు. అతని చేతనైతే ఎప్పుడో చేసి వుంటాడు. ఇంత కాలం, ఇన్ని బాధలు భరించి ఎందుకు సేవిస్తాడు? ఎన్ని విధాల చూచినా, ఎంత ఆలోచించినా, రాముడు నరుడు మాత్రం కాడు. మహాయోగి! ఆదిమధ్యాంతరహితుడు! సనాతనుడు. పరాత్ముడు! పరాత్పరుడు. మహత్తుకు మహత్తు! పరమేశుడు! శ్రీవత్సవక్షుడు! శంఖచక్రాదిసాధనుడు! శాశ్వతుడు! అజయ్యుడు! సత్యపరాక్రముడు! శ్రీమహావిష్ణువు. మానవ శరీరధారియై, వానరబలం ఆధారం చేసుకుని లోకకల్యాణం కోరి నిన్ను సబాంధవంగా చంపేడు. నీవు పూర్వం ఇంద్రియ చేతనై ముల్లోకాలు జయించావు. ఆ ఇంద్రియాలే అపకారం చేసుకుని పాత పగ తీర్చుకున్నై. నేను నీకు రామునితో వైరం వద్దని చెప్పలేదా? విన్నావా? ఆ ఫలం ఇప్పుడు అనుభవించావు. కారణం లేకుండా సీతా మానవతిని కోరి కులక్షయం చేసుకున్నావు. నీకు మతిపోయింది కాని, ఆమె అరుంధతి రోహిణులకు ఆదరణ పాత్రం. మతిమంతులు చేసే పనేనా ఇది? సీతను సామాన్య స్త్రీగానూ, అందమైనదిగానూ భావించావే కాని, ఆమె భూమికి భూమి. భర్తృవత్సల. శ్రీకి శ్రీ. సర్వసహాస్పద. ఎక్కడో అడవిలో తిరిగేవాణ్ని మొగుడో అంటూ ఏడుస్తూంటే బలవంతంగా తెచ్చావే కాని ఏమి సుఖం ఆమెతో అనుభవించావు? నీ చావు రాముని శరం నిమిత్తంగా ఆమె పాతివ్రత్య ప్రభావమే బలిగొన్నది. ఆమెను తాకినపుడే భస్మం కావలసింది. అందుకు కారణం అగ్ని, సురలు, హరిభయపడివుంటారు. ఇదంతా నీవు చేతులారా చేసుకున్న పాపకర్మ ఫలం. మొదట కలిసివచ్చినట్టు కనుపించినా, కాలగమనంలో పక్వమై, పండి అనుభవించక తప్పదు. పుణ్య కర్మలు చేసేవాళ్ళు తాటాకుమంటలాగా ఒక్కసారి ప్రజ్వలించి ప్రకాశించరు. అందుక నీ సోదరుడు సుఖం పొందాడు. నీవు పాపఫలం అనుభవించావు. నీవు తెచ్చిన సీత కంటె అందగత్తెలు నీ వద్ద ఎందరు లేరు? పంచశర విద్ధుడవై పరిజ్ఞాన శూన్యుడవైనావు కాని, కులగుణాలచేత, చక్కదనం చేత, అనురాగాభిమానాలచేత, నాకంటే ఆమె మిన్నకాదే? నా తక్కువదికాదే? దుర్మోహంతో గుర్తించలేకపోయావు. నిందలేక పోదన్న నానుడి నిఖిలభూత కోటికి నిశ్చయం. కాకపోతే ఎక్కడ సీత?

ఇంద్రుణ్ణి యుక్తరీతిగా ప్రశంసించి అనుజ్ఞ ఇచ్చాడు. ఆజ్ఞ కొన్న మాతలి రథాన్ని తోలుకొని స్వర్గలోకానికి చేరుకున్నాడు. రఘుపుత్రుడు లక్ష్మణుని గాఢాలింగనం చేసుకొని గౌరవ మర్యాదలు చూపాడు. అనేక విధాల రాఘవానుజుని లక్ష్మణుని కొనియాడాడు. ఆ పిమ్మట దాశరథి వానరనాయకుని చేర పిలిచాడు.

## విభీషణ పట్టాభిషేకం

వినమ్రుడై వచ్చి నిలిచిన విభీషణుని ప్రియమార ఆలింగనం చేసుకొని అభినందన పూర్వక వాక్యాలు పలికాడు. "సౌమిత్రీ! మనకు పరమాప్తుడూ, విజయానికి మనఃపూర్వకంగా తోడుపడినవాడూ, గుణవంతుడూ, పరమభక్తుడూ అయిన విభీషణుడు లంకాధికారం చేపట్టాలని నా సంకల్పం. ఇది నాకెంతో ఇష్టమైన కార్యం. నీవు మిత్రుని వెంటపోయి రాజమర్యాదలతో సశాస్త్రీయ సర్వరాక్షస సమ్మతంగా అభిషేక కార్యం నిర్విఘ్నంగా నెరవేర్చిరా" అని రామమూర్తి, సత్యపాలనావ్రతుడు సంతోషంతో సెలవిచ్చాడు. అన్న మాటలు శిరసావహించి సౌమిత్రి కపులు సేవించగా లంకానగరం ప్రవేశించి, జవసత్త్వ సంపన్నులైన కీశనాయకుల సముద్రజల సేకరణార్థం హనుమని నేతగా పంపాడు. కనుమూసి తెరిచేలోపల కాగలకార్యాలన్నీ సమాప్తం చేయబడినై. కపులు కొనివచ్చిన సముద్రోదక కలశాలలో ఒకదాన్ని గ్రహించి, ధర్మసింహాసనం మధ్యలో ఆసీనుణ్ణి చేసి విభీషణుని మూర్థంపై రాక్షసులంతా చూస్తూ వుండగా మంత్రయుక్తంగా అభిషేకం చేశాడు. సాధువర్తనుడు, సత్యభాషి, శాంతమూర్తి విభీషణుడు ప్రభువుకాగానే దుఃఖంతో క్రుంగిపోయిన బంధుజనం శోకం వదిలి తృప్తిగా శ్వాస వదిలింది. హతశేషులైన నిశాచరులు ఆనందించారు. లక్ష్మణుడు లంకావాసుల నుద్దేశించి ఉదార వాక్యాలతో ఓదార్చి "మీరు జరిగిన విపర్యాసాన్ని స్వప్నంగా భావించండి. అన్ని విధాలా అనుకూలుడైనవాడు, మీ అందరి ఆదరాభిమానాలు పుట్టిన దాదిగా పొందినవాడు, రామానుగ్రహంతో రాజయినవాడు మీకేలోపం లేకుండా పాలిస్తా"డని చెప్పాడు. విభీషణుడు కృతజ్ఞతా సూచకంగా సౌమిత్రిని ఆశ్లేషం చేసుకున్నాడు. పిమ్మట ప్రకృతి జనాన్ని ప్రియమైన మాటలతో అలరించి,

వున్నది రావణ గృహం అని భావించకు. అది ఇప్పుడు అతని తమ్ముడు విభీషణుని కైవసమైంది. నీవు ఇంట్లో వున్నట్లే భావించు. ఇంకొక ముహూర్త కాలంలో రావణానుజుడు సగౌరవంగా నిన్ను చూడవస్తాడు. అన్నీ అనుకూలంగా ముగించబడుతై" అని. తల్లీ విన్నావుకదా నీ మనోహరుని మధురాగమయమైన మాటలు?" అంటూ వివరించాడు. ఆ పల్కులువిన్న అవనిజ దిగ్గనలేచి నిలిచి, విగతక్రియయై మూగదై వుండిపోయింది.

## సీత హనుమంతుని ప్రశంసించుట

మారుతి ఆమె నిరుత్తరయై నిలిచివుండటం చూచి "అమ్మా! నీబిడ్డతో పలకటానికి ఎందుకు యోచిస్తున్నావు? నా నడవడిలో నీకాగ్రహ కారణం ఏమైనా వుందా?" అని మెల్లగా అడిగాడు. ఆ మాటలకు సీత చకితఅయింది. ప్రియంచేత హర్షంచేత, గద్గదకంఠియై "పావనీ! నా మౌనానికి కారణం చెపుతా విను. నీవు నా పతి సందేశం మధురాతి మధురంగా పలుకుతుంటే పరవశత్వంలో పలకలేకపోయాను. నా ప్రియంచెపుతూ నీవు పల్కిన వాక్యానికి అర్హమైన ప్రతివాక్యాలేమి కలవో అన్న ఆలోచనతో పలుకలేకపోయాను. నీకు మాటలతోకాక చేతలతోనైనా నా కృతజ్ఞత తెలుపుకుంటకు పదార్థాలు నా బుద్ధిపోయినంత మేర తగులలేదు కనుక పలుకలేకపోయాను. ఈ సృష్టిలోని అనర్ఘ వస్తు సంతానం అంతా ఇచ్చినా అన్ని లోకాలకు అధినేతయైన నా ప్రాణేశ్వరుని హృదయంకొన్న నీకు సాటికాదు. ఆ కారణం చేత పలుకలేక పోయాను" అని చెప్పింది. ఆ మధురోక్తులు విన్న మారుతి ప్రాంజలియై "తల్లీ! పతిహితకారిణీ! ఇటువంటి స్నిగ్ధ సంభాషణకు నీవే నమ్మా తగినదానవు. పతి విజయవార్త చెప్పిన దూతకు బహుమతిగా ఇచ్చే పదార్థం సృష్టిలోలేదని పలకటం, స్నేహపూర్ణమై, సారయుక్తమై, అన్ని విధాల మణులకంటె, త్రిలోకాధిపత్యం కంటె శ్రేష్ఠమైంది. ఇంతకందే బహూకృతి ఏముంది తల్లీ? అయినా నేను వానరుణ్ణి, బ్రహ్మచారిని, చపలుణ్ణి. లౌకిక వస్తువులతో నాకు పనేముంది? హతశత్రుణ్ణి, విజయుని, సుస్థితుని, శ్రీరామచంద్రుని చూచిన నాకు మరే పదార్థం వాంఛనీయమవుతుందో నీవే చెప్పు తల్లీ?" అన్న హనుమను చూచి జానకి వికసితానన పద్మయై, ఆనందాశ్రువులు వర్షిస్తూ "నాయనా మారుతీ! అతి లక్షణ సంపన్నం, అని

మాధుర్య గుణ భాషణాంచితం, సర్వలోక సమ్మతం, అష్టాంగయుతం అయిన మనస్సుతో మాటలాడటం నీకే చెల్లింది. అనఘా! నువ్వు సుగుణవు. ధార్మికువవు. ఘనబల శౌర్యములు, శ్రుతం, కాంతి, పరాక్రమం, ధీరత్వం క్షమ, వినయం, ధృతి దాక్షిణ్యం మొదలైన సద్గుణాలన్నీ నిన్నాశ్రయించుకొని ఉంటాయి" అని అభిమాన పురస్సరంగా శ్లాఘించింది. ఆమె అన్న మాటలకు మారుతి వినమ్రుడై, "తల్లీ! నీ హృదయం ఎంత విశాలమో, నీ సంభాషణ అంత గంభీరం. ఈ బిడ్డపై నీకెంత వాత్సల్యముందో ఇప్పుడు వెల్లడైంది. ఇంతకాలం నిన్ను హింసించిన ఈ రాక్షసాంగనలను నీ వనుమతిస్తే కాలుని పట్టణానికి దారి పంపిస్తాను. ఈ దాసునిపై ఇంతపాటి అనుగ్రహం చూపించు" మన్నాడు.

## సీత హనుమతో రాక్షసకాంతల చంపరాదని చెప్పుట

ఆ లోకమాత, దయా స్వరూపిణి హనుమ కోరిక విని "తండ్రీ! నీవంటి బుద్ధిశాలి చేయదగినిది కాదు. వీళ్ళంతా రాజాశ్రయంతో జీవించే పరిచారికలు. వాళ్ళు పాటించే ధర్మం రాజాజ్ఞ ఒక్కటే. పాపపుణ్యాలతో వాళ్ళకు పనిలేదు. వీళ్ళు బుద్ధి పూర్వకంగా నాపట్ల చేసిన దోషం ఏమీ లేదు. వీళ్ళపయిన ఆగ్రహించకు. నా ఈ కష్టాలకు నేను చేసిన పూర్వజన్మల్లో దురదృష్టకర శాశ్వత కర్మపాపాలు కారణం. కర్మఫలం తప్పుతుందా? పాప కార్యాచరణులైనా, కామరూపులైనా, అసురపతి ఆజ్ఞను అనుసరించి జీవించే అసురులకు కీడు చేయటం కార్యం కాదు. ఆ పని నాకు సమ్మతం కాదు. అదే నా ఇష్టం" అని మారుతిని శాంతి పరిచింది. రాక్షసకాంతలు ఆమె క్షమా హృదయానికి అంజలించారు.

## సీత శ్రీరాముని చూడగోరుట

ఆ విధంగా పల్కిన జానకి మాటలకు మారుతి విస్మయుడైనాడు. "తల్లీ! నా ప్రభునకు తగిన ఇల్లాలివి. నేను నీవని చూడగోరాను. నీ సందేశం ఏమిటో తెలుపుతావా?" అని ప్రశ్నించాడు. అందుకామె "నేను నా పతిని చూడగోరుతున్నా"నని బదులు పల్కింది. "ఆ విధంగానే జరుగుతుం"దని హనుమ ఆమెకు విన్నవించి, మళ్ళీ నమస్కార శతం అర్పించి రాముని దర్శనార్థం రణభూమికి తరలి వెళ్ళాడు. మిత్రబంధు పరివార సమేతంగా ఆయ

ప్రసన్న రఘువంశ దీపకుని చూచి, వాచావటుడైన తాను, "స్వామీ! ఏ అర్థాంగికై సేతుబంధనం చేసి, లంకానగరం దహించి, లంకేశుని వధించి విజయశ్రీ గొని వున్నావో ఆమెను నీ విప్పుడు చూచి నీ వాక్యాలతో ముఖోపశమనం చేయవలసిందని నా ప్రార్థన. నా ముఖంగా నీ సందేశం విని ఎంతో ఆనందించింది. వెనుకటి నా మాటల విశ్వసించి, నన్ను నమ్మి, సహలక్ష్మణుడైన నిన్ను దర్శించాలన్న భావం తెలియచేసింది. ఆమెకోరిక తీర్చటం ఇక మీ వంతు" అని చెప్పాడు. ధర్మమూర్తి యైన దాశరథి మౌనంగా కొంత బాధపడి, ఉస్సురని, కనుల వెంట నీరు స్రవించగా లోపల చింతించి, దగ్గరనున్న విభీషణుని చూచి "ధర్మసంశ్రయనికారనిమూరా! లంకాధీశ్వరా! నీవు నా సతి సందేశం విన్నావు కదా? ఆమెను మూర్ధస్నాతనుగాచేసి, సకలభూషణ భూషితురాలిగా సన్నిధానకు తీసుకుని రమ్మని చెప్పాడు. ఆ మాటగొని వెంటనే పోయి అంతఃపురాంగనలకు వినిపించాడు. వారు సత్వరంగా పోయి జానకికి రామాజ్ఞ తెలిపి చతురంతయానం అధిరోహించుమని కోరారు. కాని, ఆమె అస్నాతనుగ నా భర్తను దర్శిస్తానని చెప్పింది. అందుకు విభీషణుడు "తల్లీ! నీ పతి ఆదేశం ఇది. ఆయన చెప్పినట్లు చేయటం నీ ధర్మంకదా?" అని చెప్పగా, ఆ పతిజీవ అందుకు సమ్మతించింది. వెంటనే ఆమెను అంతఃపురం చేర్చి అభ్యంజన స్నానం చేయించి సర్వాభరణాలంకృతను చేసి, విలువగల వస్త్రాలు కట్టబెట్టి, మెరుగులు వెలయించే మేలి ముసుగు సవరించి, రత్నఖచితమైన బంగారు శిబికలో ఎక్కించి రాముని కడకు తెచ్చారు.

## విభీషణుడు సీతరాక శ్రీరామునికి చెప్పుట

ఆమెను కొని రాముని సముఖంలో నిలిపారు. అంతకుముందే గ్రహించిన రాముడు ధ్యాన నిష్ఠలో క్షణకాలం నిమగ్నుడై, బహుకాలం రాక్షస మందిరంలోవున్న మహీజాత అక్కడకు రావటంతో దైన్యం, శోకం ఒక్కసారి ఆయన్ను ఆవరించినై. మిత్రుని వర్తనం చూసిన రాక్షసపతి వదనం చిన్నబోయింది. నాకు విజయం సాధించిన చెలికాడు ఆమెను ఎదుటికి తీసుకురమ్మని పంపాడు. రామాజ్ఞప్రకారం ఆమెను తీసుకు వస్తుంటే, మూగుతున్న వానరుల యూథాన్ని వంచిస్తూ వేత్రహస్తులు దారి కల్పించ

నిన్ను గ్రహించటానికి కాదు. సీతా! నీవు నా ప్రక్కన వుంటే కలహానికి దీపం విరోధమైనట్లు నాకు దుస్సహంగా వుంటుంది. నీకు ఆజ్ఞ ఇస్తున్నాను. నీ ఇష్టం వచ్చిన చోటికి వెళ్ళవచ్చు. నీతో నాకు మాట పనిలేదు. రాజకుల శ్రేష్ఠుడను, నేను నిన్నెలా చేపడతాను? నా కీర్తికోసం దశకంఠుని చంపి నిన్ను విడిపించాను. నీపై రాగమోహాలు నాకు లేవు. నీవు లక్ష్మణునివద్దగాని, భరతునివద్దగాని, విభీషణ సుగ్రీవులవద్దగాని కాలం గడుపు. వారు నిన్ను పూజిస్తారు. త్రిలోక మోహన రూపమైన నిన్ను దశకంఠుడు కేవలం చూస్తూ వుంటాడా? నేను వెర్రి కాముకవాణ్ణి కాను. నీ చిత్తానుసారం నీ వుండవచ్చు" అని. ప్రియం వినగోరి వచ్చిన సీత భర్త పలికిన ములుకుల వంటి పలుకులకు ఏనుగుచే త్రెంచబడ్డ లత వలె వణికి నేల వ్రాలింది.

## రాముని పలుకులకు సీత శోకిస్తూ ప్రత్యుత్తర మిచ్చుట

శ్రీరాముడు నిండుపేరోలగంలో సీతనుగూర్చి పలికిన కర్ణకఠోరమైన వాక్యాలు విన్న మర్కటులు, మానవులు,వారి నాయకులు, స్త్రీలు, బాలురు, వృద్ధులంతా నిశ్చేష్టులైనారు. సీతను చూడలేకపోయారు. ఆమె భావి జీవితం భావించి వేసంగిలోని నీటిపడియల వలె తప్తులయ్యారు. దవానలం సోకిన కాననం వలె తేజోహీనులయ్యారు. ఆ సభ దొంగలు కొల్లగొట్టిన గ్రామం లాగా విషాద దేవతకు నిలయమైంది. అందరు ఆవసరపడడంతో కన్నీళ్ళు కారుస్తూ, రూక్షంగావున్న రాముని చూడలేక, చేరలేక, లోని భావాలు లోపల సుడితిరుగుతుండగా, అనంతంగావున్న ఆవేగాన్ని ఆపుకోలేక ఒకరితో ఒకరు గుసగుసలు పోయారు. "అనితర సాధ్యమైన వరాలుపొంది, దేవతలకే దుర్జయుడైన లంకేశుని చంపింది కట్టుకున్న భార్యను అవమానించి వదలి పెట్టటానికా?" అని కొందరు చెప్పుకున్నారు. "ఈయన ఎంత వీరాధివీరుడో అంత పాషాణ హృదయుడు. ధర్మాన్ని ప్రేమించినంతగా దారసుతాదుల గానీ, లౌకిక భోగాలగానీ ప్రేమించనట్లున్నాడు. ఇందులో ఆమె దోషం ఏముంది? లోకకంటకుడని పేరుగన్న క్రూరకర్ముడు దొంగచాటుగా కొని వచ్చి నిర్బంధించితే అబల ఏం చేస్తుంది? అశోకవనంలో కాంతల మధ్యగదా

ఆమె వుంది. ఆమె అంగీకరిస్తే ఈయన ఇంత యుద్ధం చేయవలసిన అవసర మేముంది? వారు సమూలంగా బంధుమిత్ర పరివారంతో సర్వనాశనం కావలసిన గతి ఏం వచ్చింది? ఆ తల్లి శీలం చెడితే ఈయన లంకేశుణ్ణి చంపటం సాధ్య పడేదేనా? ఇంతకాలం ప్రాణమాత్రావశేషగా "రామా రామా" అంటూ బ్రదికిన సాధ్విని ఏం కారణం చూచి ఈయన నిరసించి నీచభావాలతో నిందించాడు? మనం తెగించి చెప్పినా ఈయన వాలకంచూస్తే వినేట్టులేడు. మానవ హంతకులమైన మాకే ఈ సంఘటన దుస్సహంగా, దుర్భరంగావుంది. పాపం. ఆ తల్లి ఏమీ ఎరుగని అమాయకురాలు. భర్త వస్తాడనీ, పడ్డ కష్టాలకు పరిహారం లభిస్తుందని ఎంతో ఆశతో వస్తే, ఈయన లోకనింద అనే నెపం ఆమెపైమోపి విడిచి పెడతాడా? తెచ్చిన దగ్గరనుంచీ మా దగ్గరే కదా వుంది. మాకు తెలియకుండా ఏమీకూడా ప్రవర్తించదే? ఈయన ఇంత అన్యాయంగా శిక్షవేస్తుండే చూచి ఎలా సహించటం?" అని సీతచే రక్షింప బడిన రాక్షసాంగనలు కంటికి కడివెడు నీళ్ళుగా ఏడుస్తూ చెప్పుకున్నారు. రవిపుత్ర విభీషణ హనుమంతులు ఇంత దుష్పరిణామాన్ని ఎందుకు భావించారో ఎరుగలేక మృతప్రాణులవలె చలనంలేని దైన్యంతో ఒకసారి రాముణ్ణి, ఒకసారి జానకినీ చూస్తూ నిలుచున్నారు. విన్నవాళ్ళూ, చూస్తున్న వాళ్ళూ ఇలావుంటే, పరమ పావనిం, ధర్మప్రవణమైనదైన లోపాముద్రవంటి మహా తపస్వినులచే అనుగృహీతగా ఉపదేశింపబడిన శీలవతి స్థితి ఎంతగా ఊహించినా చెప్పసాధ్యంకాదు. తైలంలేని దీపకళిక కొడిగట్టి ప్రకాశం పోగొట్టు కున్నట్లు "భక్తివిజయోత్సాహంతో తన్ను మనఃపూర్వకంగా గ్రహించి, కన్నీరు తుడిచి, కరగ్రహణం చేస్తా"డని గంపెడంత ఆశతో పతి దర్శనం కోరి వచ్చిన సీత ఆశాకుసుమం వాడి వత్తై రాలిపోయింది. "ఈ అన్నది తన భర్తయేనా?" అని శంకించింది. జగత్సృష్టికి ప్రధాన క్షేత్రమైన స్త్రీ, బీజమాత్ర ప్రధానమైన పురుషునిచే అవమానించబడటం ఎంతవరకు ధర్మ బద్ధం?" అని తర్కించింది. "అగ్ని సాక్షిగా పాణిగ్రహించి అర్ధాంగిగా చేసుకుని నిష్కారణంగా పరిత్యజించటం, పతి ధర్మమా?" అని ప్రశ్నించు కుంది. తన్ను లోకం శంకిస్తుందా? అందుకు పరుని యింట బహుకాలం బల వంతంగా చెరలో వుంచబడటం కారణమా? శివధనుర్భంగంచేసి, కాముకుడైన తండ్రిని సత్యవ్రతుని చేసి, మహర్షుల మన్ననలు పొందిన నా భర్త నా

శీలాన్ని శంకించి విసర్జింపతావా? నిండు సభలో తన నన్ను పరాభవించటం తనకు మాత్రం గౌరవ కారణమా? దీనిలో ఏదో తెలియరాని రహస్యం వుండి వుంటుంది. నేను ఆయన అర్ధాంగిగా కాక ఒక స్త్రీగా భావిస్తాను. నా పతి తన విజయవార్త తెలుపటానికి ముందు పంపింది పావనిని. ఆ మతిమంతుడు ప్రియం చెప్పతానని కొన్ని మాటలు నా భర్త చెప్పినవి చెప్పాడు. "దేవీ! నేను నీకు అనురక్తుణ్ని. నా భాగ్యవశాన బ్రతికి వున్నావు. ధర్మదేవిపై జయం లభించింది. శోకం వీడి స్వస్థురాలవుకమ్ము" అని గంభీరంగా, క్లుప్తంగా, మహార్థబంధురంగా ఆ మాటలు వున్నై. హనుమచేత చెప్పించిన వాక్యాలు కనుక ఆయన ప్రేరణను నన్ను శంకించలేదు. నా సాహచర్యం అనుక్షణం వాంఛిస్తూనే వున్నాడు. లోపలు కాదులు. వాళ్ళకు సత్య దర్శనంతో పనిలేదు. అపవాదులు వేయటం అంటే వాళ్ళకు ఎంతో ఇష్టం. అవి పరిహరించటం నా వంతని హెచ్చరించాడు. అరణ్యవాసకాలం ముగిసింది. ఆయన మహారాజుగా రాజ్యం పాలిస్తాడు. ఆయన అంకపీఠిపై మహారాజ్ఞిగా నేనుండాల. నన్ను ప్రజలు శంకా కళంకిత మనస్సులతో చూడరాదు. అదే నా భర్త నా నుంచి కోరింది. నేను పౌరులకు తల్లివంటిదాన్ని. నా శీలం ప్రకటనచేసి నా నాథుని చింతాగ్రహణ ముక్తుణ్ని చేస్తాను" అని సత్య దర్శనం చేసింది. లోక ధర్మానుసారం భర్త పల్కిన నిందా వాక్యాలకు లజ్జతో శిరం వంచుకుంది. కంటనీళ్ళు కాల్వలు కట్టగా పైటచెంగులో తుడుచు కుంటూ, కంపితాధరయై, గద్గదకంఠియై మెల్లగా భర్తను లక్షించి "ఆత్మ ప్రభూ! ఉత్తమ వంశజాతులు ఒక క్షుద్రుడు క్షుద్ర స్త్రీని పలికినట్లు శ్రోత్ర విదారణంగా దూష వాక్యాలు పల్కటం నన్ను గూర్చి నీకు ధర్మమేనా? నాలో ఏ ఛిద్రం చూచి ఈ విధంగా అప్రసన్నుడవై అనవిన రాని పలుకులు అన్నావు? నేను సుశీలవతినేయని మన రెండువంశములపై ఒట్టు పెట్టుకుని శపథంచేస్తాను. దైవ సృష్టిలో బలహీనతగల స్త్రీలూ, పురుషులూ వున్నారు. అంతమాత్రంచేత ఆ జాతులు రెండూ గర్హించతగినవేనా? అలా అయితే ఇంకా ఈ వివాహాల బంధాలెందుకు? ఈ ధర్మాచరణలూ, కట్టుబాట్లూ ఎందుకు? రాజులెందుకు? శాసనాలెందుకు? దండనలెందుకు? నీ విజయాన్ని నాకు నీవే వినిపించావు. కేవలం నీ వీర్య ప్రకటనకే ఈ మహా యుద్ధం చేశావా? ఎన్నడులేని ఆత్మశ్లాఘ, నిమిత్తంలేని నాతో ఎందుకు

దగిన వస్తువుగా పరిగణించబడింది. స్త్రీ స్వభావంచేతగానీ, పతిపైగల గాఢానురాగంచేత గానీ, అజ్ఞానంచేతగానీ, పరిశుద్ధ హృదయుడైన మరిదిని నొప్పించాను. ఆ దోషం వృథాపోలేదు. పవిత్ర హృదయం నిందకు ఎంత క్షోభిస్తుందో స్వానుభవానికి తెచ్చి పెట్టింది. స్వామీ! నీవు శంకించినా, లోకం శంకించినా నాకది తీరరాని మచ్చ. రఘువంశరత్నానవై సత్యపరాక్రమడవై రణధర్మం తప్పకుండా శత్రుసంహారం చేసి విజయరాఘవుడవు నీవైనట్లే, నా సాధ్వీత్వాన్ని ప్రకటించి, నాకు కలిగే లోకనింద పాపుకుని, నీ అర్ధాంగిగా వీరపత్నిగా శాశ్వత యశస్సు సంపాదించుకుంటాను. నా జాతి కలకాలం పురుషులచే పూజించదగినదిగా నిరూపిస్తాను.

## సీత అగ్ని ప్రవేశం చేయుట

మరిదీ! సౌమిత్రీ! నీవెందుకు శోకిస్తావు? శోకించవలసింది నేను. కాని, నాకెప్పుడు శోకంలేదు. లోకసృష్టిలో మహాభిశాపహతను. పతి పరిత్యక్తను. పతి మెచ్చని పడతి శీలం శీలంకాదు. నేను నిర్దోషురాలనయినా పతికి దూరంగా బ్రదికే బలహీనురాలనుగాను. ఆకృతిచే అబలనైనా సతీత్వంతో సబలను. నాకేకాదు ఏ నారీమణికైనా పతి పరిత్యజిస్తే, తానెంత సౌశీల్యవతియైనా స్తనంధయులు లేకపోతే ప్రాణత్యాగం చేయటం పరమ ధర్మం. భారతనారికి ప్రథమ కర్తవ్యం. నేను త్రికరణశుద్ధిగా రామపత్నిని. నేను బాహ్య శరీరం విడచిపెట్టినా, తేజోరూపంతో నా పతి హృదయపీఠంలో పత్నిగానే భాసిస్తాను. ఇక నాకై దుఃఖించవలసింది లోకం. నా రాకకు సార్థకం సాధించాను. నా స్థానం ఇక నేను పొందుతాను. రామానుజా! గతం మరచి నీ వదినకు నీ వాక సహాయంచేయి. సభా సమక్షంలో చితి ఏర్పాటు చేయి. నేనందు ప్రవేశిస్తాను. ఒక్క నా పతే, సత్యవ్రతుడూ, సౌశీల్య ధనుడూ, సత్య పరాక్రముడూ కాదు. ఆయన భాగస్వామినిగా జన్మించిన నేనూ అటువంటి దాన్నే. ఇక లోకంతో నాకు నిమిత్తంలేదు. జాగులేకుండా ఈ ఒక్క ఉపకారం మాత్రం చేయి" అని పల్కి శిరవంచుకుంది. ఆమె పల్కినపల్కులు సభాస్తారులకే కాక మింటిపైనున్న దేవతలకు కూడా గుండెల్లో బాకులు దూసినట్లు బాధ కలిగించినై. చిన్నబోయిన మొగంతో, ఛిన్నహృదయంతో, అన్న వంకచూచి అశ్రువులు రాల్చాడు. ఆయన ఆకృతి

అంగీకరించినట్లు గ్రహించి సౌమిత్రి రవిపుత్రాదుల సాయంతో చందనతరువులతో చితి పేర్పించాడు. అగ్ని రగుల్కొల్పాడు. ఆ జ్వాలలు అంతరిక్షం అంటుకునేలాగా ప్రజ్వరిల్లసాగినై. జానకి నిర్మల మానసంతో, పూర్ణిమా చంద్రుని అపహసించే మొగంతో మెల్లగా పతిని సమీపించింది. ముమ్మారు సాంజలియై ప్రదక్షిణించింది. అధోముఖియై, మోకరించి పాదాభివందనం చేసి, "ప్రాణపతీ! అవనత శిరస్కుడవెందుకౌతావు? నీ అర్ధాంగి నీకపఖ్యాతి ఎన్నటికీ తేదు. నీయశశ్చంద్రికలు సృష్ట్యంతంవరకు దిగంతాలు వెలిగించేలాగా నీ సహధర్మచారిణి జానకి చేస్తుంది. ఆజ్ఞ ఈయి" అని చితి చేరింది. వలగొని మ్రొక్కింది. దేవతల సంభావించింది. మహర్షులకు విప్రులకు నమస్కరించింది. సభాసదులకు అంజలించింది. రెండుచేతులు చేర్చి భ్రుకుటి పైనుంచి "దేవ ప్రియా! జాతవేదా! మనసావాచా కర్మణా నా మనస్సు నా పతియందే లగ్నమైయుండే, కలలోనైనా అన్యత్ర వ్యభిచరింపనిదానైతే, నీవు ధర్మ కర్మ సాక్షివైతే, శిష్టపతివైన నన్ను దుష్టురాలిగా నాపతి భావించాడు. నేను దుష్టను కాకపోతే లోకసాక్షివైన నీవు స్పష్టంగా నా నిర్దోషిత్వాన్ని లోకానికి తెలియపరుచు. సూర్యచంద్రులు, దిక్కులు, వాయువు, రేలు, సంధ్యలు, దినములు, భూమి, దేవతలు, తక్కుంగల జ్ఞానసత్తములు నాశీలాన్ని గుర్తించినట్లయితే, నా పట్ల ఏ అనుమానాది దుర్దోషాలు లేవని విశ్వసించినట్లయితే ఈ నిండు పేరోలగం సంతృప్తినందేలాగా నా సౌశీల్యాన్ని ఋజువు చేయి" అని ప్రార్థించి, సంగరహితాత్మయై, శిఖికి ప్రదక్షిణించి జాజ్వల్యమానంగా ప్రకాశించే మంటలో పవిత్రమైన సీత దైవమందిరం ప్రవేశించినట్లు ప్రవేశించింది. పుడమి గడగడ వణికింది. సభాసదులు కొయ్యబొమ్మలైనారు. దేవతల గుండెలు దడదడలాడినై. క్షణకాలం సూర్యగమనం స్తంభించింది. సర్వాభరణ భూషితమైన సీత అగ్ని ప్రవేశం చేయగానే అంతా ఒక్కసారి హాహాకారాలు చేశారు. మూడు లోకాలు అగ్నిలో వ్రేల్చిన ఆజ్యాహుతిలాగా సీత అగ్నిప్రవేశాన్ని చూసి దిగ్భ్రమ చెందినవి. సౌరలోకం నుంచి నిరయంలో పడ్డ దేవకాంతవలె దేవ యక్ష గంధర్వాది సురలు అనిమిష నామాన్ని అర్థవంతం చేశారు సీతాగ్ని ప్రవేశం చూచి. రాక్షసాంగనలు చేసే హాహాకారాలను రోదసి ప్రతిధ్వనించింది.

# దేవతలు ప్రత్యక్షమై సీత నిర్దోషురాలని చెప్పుట

సభాసదుల నిశ్శబ్దం, రాక్షసకాంతల ఆక్రందనరావం భయంకరమై నేల చూస్తూ నిలుచున్న రామచంద్రునకు సహించరాని ఆవేదన కలిగించినవి. మహాత్ములందు అపూర్వాశ్రు జలనేత్రులై అంతర్ముఖులైనారు. ఇంతలో కుబేర వరుణ యమ మహేంద్ర మహాదేవ బ్రహ్మాదులు తమ తమ విమానములలో భూమికి అవతరించి రాముని చేరవచ్చి, రత్నాలంకృత భూషణ సంశోభిత హస్తాలు మోడ్చి "రామా! జగదభిరామా! దశరథరామా! ఈ సృష్టి స్థితి లయాలకు మూలం నీవు. జ్ఞానుల్లో మిన్నవు. సర్వ ధర్మాలు నీ స్వరూపం. నీ సతి అగ్నిలో ప్రవేశిస్తే ఉదాసీనంగా ఎందుకు చూస్తున్నావు? ఎందుకో నిన్ను నీవు తెలుసుకోలేకున్నావు. సర్వదేవతాలలోనూ అధిదేవుడవు నీవు. వసువులలో ప్రజాపతివి. పూర్వం త్రిభువనాలను నీ పేర నుండి పొందిన వాడవు నీవు. అఖిల లోకాలకు అధికర్తవు. నీవు స్వయం ప్రభువు. రుద్రుల్లో అష్టమ రుద్రుడవు నీవు. సాధ్యుల్లో పంచమ మూర్తివి. అశ్వినులు కర్ణాలు. నేత్రాలు సూర్యచంద్రులు. సృష్ట్యంతంలో నీవే శేషరూపంగా వుంటావు. ఇటువంటి నీవు ప్రాకృత జనులలాగా ప్రవర్తించటం ధర్మంకాదు. ఆమె అగ్నికంటె పరిశుద్ధురాలు. ఆమెను ఎలా శంకించావు? లోకులు కాకులు. వాళ్ళకు నిజానిజాలు తెలియవు. అపవాదులు వేయటమే వాళ్ళ పని. అంతరాత్మ సాక్షిగా జీవితం గడపాలె కాని ఎంతమంది మానవుల తృప్తి పరచగలము? మా కన్నుల పండుగ్గా మైథిలిని స్వీకరిస్తావనుకొన్నాం. కాని, ఇంత దారుణ సంఘటన జరుగుతుందని అనుకోలేదు" అని విచారం వ్యక్తం చేశారు. ఆ మాటలువిన్న రాముడు దేవతలందరిని చూచి, "పూజ్యులారా! మీరు నన్ను గూర్చి ఏవేవో పెద్ద మాటలు పలికారు. నాకు మాత్రం తెలిసింది నేను మానవుడననీ, కౌసల్యా దశరథుల పుత్రుడననీ, ఐక్ష్వాకుడననీ, రామనామం కలవాడననీ. పెద్దలు మీరు అసత్యం చెప్పరు కనుక నా చరిత్ర ఏమిటో, నేనెవ్వరివాడనో, నేనెందుకు పుట్టానో వివరించమని వేడుకుంటున్నాను" అని అడిగారు. ఆ మాటలకు వనజాసనుడు సంతసించి "మాయామానుష విగ్రహా! రామా! ఏమీ తెలియనివానివలె అడుగుతున్నావు. నీ మాటకు ప్రయోజనం కూడా ఉంది. కనుక చెపుతున్నాను.

ఆదివిష్ణుడవే నీవు. నీవే ప్రజానాథుడవు. లోకకంటకుడైన పంక్తిముఖుని వధించే నిమిత్తం మానుషీరూపం ధరించావు. మా కార్యం తీర్చావు. సమస్తలోకాలను తేర్చావు. ఇక హృష్టుడవై బహుకాలం ధర్మపాలనం గావించ స్వస్థానంపొందు. నీ వీర్యసారం, ఘోరశౌర్యం, దర్శనం, స్పర్శనం అమోఘం. నిన్ను స్తుతించిన వారి కెన్నడూ వాంఛితాలు మోఘంకావు. నీ భక్తుల కేవేళ ఏలోపాలురావు. నీ నామం భవతారకం. నీధ్యానం ముక్తిప్రదం. నిన్ను త్రికరణశుద్ధిగా నమ్మిన వారికి పునర్జన్మలేదు. నిన్ను ద్వేషించేన వారికి ఇహంలోనూ, పరంలోనూ శుభంలేదు. రాదు. కర్మబంధంపోదు. రామా! సుగుణధామా! దుష్టదైత్య విరామా! కౌసల్యానందవర్ధనా! దశరథనందనా! సీతానాయకా! జగన్నియామకా! నమస్తే నమస్తే నమః. ఈ పౌరాణికమైన, ఐతిహ్యమార్గమైన స్తవం ఎల్లప్పుడు భక్తితో పఠించేవారికి పరాభవం (ఉత్తరజన్మ) రాదు" అని రాముని అవతారకథనం బ్రహ్మ వాకొన్నాడు.

## అగ్ని సీతనుదెచ్చి రామునకు సమర్పించుట

ఈ విధంగా చతుర్ముఖుడు త్రైలోక్యమంగళకరసూక్తులు రామునితో పలుకుతుండగా వైశ్వానరుడు జనకనందినిని అంకతలంలో వుంచుకుని చితిని చిమ్ముకుంటూ పైకి వచ్చాడు. ఉదయభానుణ్ణి కాదనే దేహకాంతికలదాన్ని, రుచిరహాటక భూషణరాజితో ప్రకాశించేదాన్ని, నీలనీరదాన్ని నిర్జించిన కేశజాలం కలదాన్ని, అరుణవస్త్రంతో అలరేదాన్ని, వాడని దివ్యమాలాభరణాలు కలదాన్ని, యథారూపం కలదాన్ని, జాతవేదుడు బిడ్డను తండ్రివలె ఒడి గదించి తెచ్చి "రామచంద్రా! ఈమె వైదేహి. నీ అర్ధాంగి. నీసతి. నీసహ ధర్మచారిణి. ఈమెలో ఏపాపంలేదు. మనసుచేత, వాక్కుచేత, కర్మచేత నిన్నుగాక అన్యంఎరగని పరిశుద్ధురాలు. ఈమె నాలో ప్రవేశించి, సర్వాం విచక్షణలేకుండ దహించినందువల్ల వచ్చే దోషాన్ని పరిహరించి నన్నే పరిశుద్ధుణ్ణి చేసింది. ఇంతకుముందే దిక్పాలకులు, చతుర్ముఖుడు నీవెవరవో ఈమె ఎవరో నీకు చెప్పనేచెప్పారు. ఇంకనీసందేహంవదలి ఈమెను పరిగ్రహించు. ఒంటరిగానున్న సమయంలో [illegible]ంచి, మూర్ఛమునిగిన ఈమెను దుష్టుడు లంకచేర్చి రాక్షసాంగనల రక్షణలో వుంచాడు. ఆశలుచూపాడు.

ఆగ్రహించాడు. నిగ్రహించాడు. వాడెన్నిచేసినా ఈమె లక్షించక నీకుతగిన పత్నినని ఋజువుచేసుకుంది. ఏపాపం ఎరుగనిఈసాధ్విని నామాటనుపాటించి యథావిధిగా ఏలుకో. అడ్డమాటలు చెప్పవద్దని" సీతను రామునికర్పించాడు.

## శ్రీరాముడు సీతను పరిగ్రహించుట

పరిశుద్ధురాలైన జానకిని గూర్చి పావకుడు పలికిన పల్కులు విన్న రామునికంటినుండి నీరు జారింది. కొంతకాలం తనలో తాను చింతించి "మహానుభావా! నీవులేకపోతే లోకవృత్తమే లేదు. నీవు స్వయంగా నాకర్పించిన సీతను పరిగ్రహిస్తాను. ఈమె నీలోప్రవేశించి రెండవజన్మ ధరించి వచ్చింది. ఈమె శీలవతి కావటం సత్యం. నా కది తెలుసు. అయినా, దీర్ఘకాలం రావణాంతఃపురంలో వుండటంచేత ఈమె పరిశుద్ధ జీవితాన్ని లోకం శంకిస్తుంది. నేనే శంకిస్తే ఇంత కార్యం ఎందుకు చేస్తాను? ఎవరికోసం చేస్తాను? మామూలుగా నేను గ్రహిస్తే "దాశరథి ఎంత దుర్బలుడు? ఎంత కాముకుడు? దొరికిందే చాలని భార్యను పరిగ్రహించాడు" అని అడిపోసుకుంటారు. ఈ అవమానం మోస్తూ, అపవాదు ధరిస్తూ ప్రజలను ఎలా శాసించి ధర్మవర్తనుల చేసేది? నేను నా సతిని నిర్దాక్షిణ్యంగా నిండుసభలో అవమానించాను. ఆత్మశ్లాఘ చేసుకున్నాను. ఈ కార్యం లోకం కోసం చేశాను కాని, నా సతిని చిన్నబుచ్చటానికి కాదు. సీత ఎటువంటిదో నా కొక్కనికే కదా తెలిసింది? నేను చేసిన రావణ సంహారంతో లోకం నన్ను తిరుగులేని వీరుడుగా గుర్తించింది. మరి నా అర్ధాంగిని అపనిందతో హత్య చేస్తుంది. అందుకే ఈ పరీక్షకు నా సహధర్మిణిని గురిచేశాను. సీత భక్తురాలనీ, సాధ్వి అనీ, అనన్యమనస్క అనీ, నా మనస్సెరిగి నడిచే శీలవతి అనీ తెలిసికూడా, లోకం దృష్టిలో కూడా ఆమె పవిత్రురాలే అని ప్రకటించటానికే అగ్నిప్రవేశానికి అనుమతించాను. ఆమె అయోనిజ అనీ, జనక రాజర్షిచే పుత్రికగా గ్రహించబడిందనీ, దశరథమహారాజు కోడలనీ, నా సతిఅనీ, నేనున్నా లేకున్నా తన్ను తాను కాపాడుకోగల పవిత్ర ప్రాతివ్రత్యమహిమ కల భాగ్యశాలిని అనీ, రావణుని కామాంబుధికి చెలియలికట్టగా నిలవగలదనీ, మండేమంటను ఆలింగనం చేసుకోలేనట్లు, రావణుడు సీతను అంటలేడనీ నాకు త్రికరణశుద్ధిగా తెలిసే అగ్నిపరీక్షకు ఆమెను నిలిపాను. తన సాధ్వీ

విధాలా నీఅంతవాడు, అనురక్తుడు, భక్తుడు, నియమవంతుడు, శుచి, విక్రముడు, అనుజుడు భరతుడు. అతని ఆదరణతోచూచి కలిసిమెలిసిసుఖించు. నా బిడ్డలు నలుగురు భేదభావశూన్యులై, అన్యోన్యాశ్రయులై, తల్లులతో, భార్యలతోకూడి ప్రజలకు శాంతిసౌఖ్యాలు ప్రసాదిస్తూ పాలించి మనవంశ గౌరవం వృద్ధిచేస్తారని ఆశిస్తున్నాను. అన్న మాటప్రకారం అరణ్యవాసం అలితోనూ, తమ్మునితోను పూర్తిగావించావు. నీప్రతిన నెరవేరింది. దశకంఠుని వధతో దేవతలూ, మహర్షులూ పరితోషంపొందారు. లోకంలో శాంతి నెలకొల్పావు. చిరకీర్తి ఆర్జించావు. వెంటనే అయోధ్యకేగి, తమ్ముని ప్రీతునిచేసి, కులగురువులైన మహానుభావులు వసిష్ఠాది మహర్షులు, సుగుణవంతులైన సచివులు సుమంత్రాదులు, విశుద్ధజీవనులు, విశ్వవర్తనులైన పౌరజానపదులు ఆనందంతో అభిషేకించగా పట్టంకట్టుకుని, బంధుజనులను సేవిస్తూ, పితృదేవతలనర్చిస్తూ, యజ్ఞయాగాదులు కావిస్తూ, దానధర్మాలతో బ్రాహ్మణశ్రేష్ఠులనూ, ఆశ్రితులనూ, అర్థిజనులనూ తనియిస్తూ దీర్ఘాయుష్మంతుడవై తమ్ములు బలసికొలవగా ధర్మాన్ని నాల్గుపాదాల నడిపించు" అని హితబోధ చేశాడు.

ప్రియమార పలికిన తండ్రి హితవచనాలు విని రాముడు పరమానంద భరితుడైనాడు. "తండ్రీ! నీ కోరికగానీ, ప్రియబోధగానీ ఎన్నడూ వ్యర్థం కాకుండా నడుస్తాను. నాపట్టభంగాన్ని గూర్చి సత్యం నీకుతెలిసింది కనుక, నాపినతల్లి కైకమ్మ నిర్దోషురాలు. నా తమ్ముడు ఏపాపం ఎరుగని అమాయకుడు. లక్ష్మణుడు నాకెట్లో, శత్రుఘ్నుడు భరతుని కట్టివాడు. నీవు నా అభిషేక భంగసమయంలో నాపినతల్లిని కొడుకుతోకూడ పరిత్యజించానని అన్నావు. అదిఇంతవరకు నాహృదయశల్యంగానే వుండిపోయింది. వారు నిరపరాధులు. దైవప్రతికూలానికి మానవుల శిక్షించటం అధర్మం. నాయందు దయకలవాడవైతే ఆ ఆంక్షను ఉపసంహరించు. నాతోకూడి నా తమ్ములు నీకిచ్చే పిండోదకాలు సమంగా స్వీకరించి ఆశీర్వదించు. నీయంతవానిపత్నిగా, రాజ్యతంత్రాన్ని నడిపించినమేధావినిగా అమృత హృదయంతో నన్ను పెంచి పెద్దచేసి మాతృమూర్తిగా వెలుగొందిన నా పిన్నమ్మ నీచేత పరిత్యక్తురాలై అధమగతులందటం నేను సహించలేను. ఇదే నేను నీ అనురాగ పాత్రుడైన

బిడ్డగా కోరుకుంటున్న వరం. అది నాకు ముందుగా ప్రసాదించు" అని రాముడు పలకగానే "నీకోరిక చెల్లిస్తున్నాను. నాశాపం నేను ఉపసంహరించుకుంటున్నాను" అని దశరథుడు కొడుకుచేతిలో చేయివేసి చెప్పాడు. వెంటనే రాముని సర్వజ్ఞత్వానికీ, సమభావానికీ గగనచరులు తృప్తిచెంది పూలవాన కురిశారు. వాయువు పరిమళ బంధురంగా వీచాడు. సభాసదులు, దేవతలు ఆనంద కోలాహలం చేశారు. అనంతరం దశరథుడు లక్ష్మణుని పిలిచి ఆశ్లేషించి "వత్సా! సౌమిత్రీ! నిన్నుచూచి నేపొందినతృప్తి పూర్వం ఏ తండ్రీ తన కొడుకునుచూచి పొంది వుండడు. పేరుకు పెద్దనే కాని మీకేం బోధించేది? అన్నీ మీ సోదరులలో ఆవాసం చేస్తున్నై. అయినా, ఆనాడు తండ్రిగా మీకు మంచి మాటలు చెప్పకపోయినా ఈనాడైనా చెప్పి తృప్తి పడదలచాను. కైక కోరింది రాముని వనవాసమే. కాని నీకు నీవై శిక్ష విధించుకున్నావు. పదునాల్గేండ్లు అహోరాత్రాలు అన్ననూ, వదినెనూ ఆరాధించావు. అర్చించావు. రక్షించావు. ధన్య చరిత్రుడవైనావు. చెప్పలేని సంతోషం నీ చేతవల్ల పొందాను. ధర్మఫలం అంతా నీకే దక్కింది. నీ కీర్తి ఆచంద్రతారార్కం అన్న పేరుతో కలిసి నిలిచి పోతుంది. తండ్రిగా నాకు స్వర్గప్రాప్తి కలిగించి. అనుజుడుగా నీకు అఖండ యశస్సు వచ్చింది. ఇక మీదకూడ ఇష్టే అన్నను సేవించి ధన్యుడవుగా. రాముడు త్రిభువన క్షేమంకరుడనీ, సత్యధర్మ ప్రతిమూర్తి అనీ నీకింతకు పూర్వమే తెలుసు. అయినా నేను మళ్ళీ అదే చెపుతున్నాను. ఇంద్రసహితులై ఇందరు దేవతలు, మహర్షులు సేవింప వచ్చారంటే రాముడెవరో లోకానికి తెలిసిందికదా? "రాముడంటే అవ్యక్తుడు. అక్షరుడు. సర్వభూతాంతర్యామి. శ్రుతి సంస్థాపిత తత్త్వమూర్తి. శుద్ధుడు. వైరిఘ్నుడు. శ్రుతి ప్రతిపాదిత పర బ్రహ్మం. ఆకృతి మానవ లక్షణం. ఆత్మసాక్షాత్ బ్రహ్మం" అని నాకు దేవతలు చెప్పారు. ఇంతటి మహాగుణ వరిష్ఠుని త్రికరణ శుద్ధిగా సేవించి, పూతమైన కీర్తి, ధర్మాచరణ సంజాతముక్తి అందుకున్నావు. ఇంతకన్న నీకేం చెప్పేది?" అని ఆనందాశ్రులతో మూర్ధం తడిపాడు. శరీరమంతా పుణికాడు. గుండెకు హత్తుకున్నాడు.

పిమ్మట జానకినిచూచి "అమ్మా! కోడలా! వంశవర్ధనీ! నిన్ను చూస్తే కడుపు తరుక్కొని పోతూంది. త్రిభువన ఖ్యాతమైన రఘు వంశం మెట్టినందుకు ఏం సుఖం అనుభవించావు? అనుభవకాలం అంతా శూన్యంగానూ,

శోకం పోయి గడిపేవు. గ్రహం ముక్తమైన చంద్రబింబంలాగా కష్టాలన్నీ గడచి గట్టెక్కావు. నిండు సభలో నా కొడుకు నీకు విధించిన పరీక్షకు కోపం చెందకు. నీ పాతివ్రత్యాన్ని లోకానికి చాటటానికే ఈ కఠిన పరీక్షకు పూనుకున్నాడు. కాని, నా రాఘవుడు మాత్రం కాదు. సహచారిణివి నీవు దాన్ని సహించు. పతిసేవతో తరించుకుని పావనుని మెప్పించిన నీకు మామగా మాత్రం చెప్తున్నాను. అంతకుమించిన అర్హత నాకు లేదు. అమ్మా! ఎంతటివారైనా దైవ నిర్ణయాన్ని దాటలేరు. ఏది వచ్చినా మన మంచికే అన్నట్టు, ఇదీ మన మంచికే జరిగింది. నా దుర్మోహంతో ప్రారంభమైన మీ జీవితగాథ నీ అపహరణంతో బిందురూపం దాల్చి, రావణ వధతో పూర్ణ రూపం పొంది, నీ అగ్ని ప్రవేశంతో పతాకాస్థాయి అందుకుని శాంత రసంతో అంతమైంది. నేటి నుంచి యుగాంతాలు దిగంతాలకు నీ సతీత్వ లత ప్రాకి కీర్తి కుసుమాలు పూయుగాక" అని వరం ఇస్తున్నాను. భారత నారీమణులకు అరుంధతీ వశిష్ఠులవలె, ఉమా మహేశ్వరులవలె, లక్ష్మీనారాయణులవలె, అనసూయాత్రులవలె, లోపాముద్రాగస్త్యులవలె, శచీపురందరులవలె, సీతారామనామంతో మీదాంపత్యం ఆదర్శం అగుగాక" అని దీవించి దశరథుడు తన విమానంలో నాక లోకానికి ప్రయాణించాడు.

## శ్రీరాముడు కోరగా ఇంద్రుడు మృతవానరుల బ్రతికించుట

దశరథుడు పుణ్యలక్ష్మితోపాటు సీతానుగ్రహంచేసి తమ్మునితో సుఖంగావున్న రామచంద్రుని ఆశీర్వదించిపోగానే, దేవేంద్రుడు తృప్తిగా నిశ్వాసం విడిచి "రామచంద్రా! నీదర్శనంచేత మేం సత్ఫలసంపన్నులమై సంతుష్టి పొందాం. నీవు వనాలలో సంవత్సరాలు అనుభవించిన కష్టాలన్నీ మాకోసమే పడ్డావు. నీవల్లనే, రాక్షస గ్రహాలతో కార్యం నెరవేర్చి లోక కల్యాణ కారకుడవైనావు. నీవు వరమివ్వదగినవాడవైనా మానవశరీరధారివి. అందుచే అపరిమిత సంతోషమైన దేవలక్షణం చాటరానిది. కనుకనే ఎప్పుడూ నీసాన్నిధ్యాన్ని కోరుతుంటాం. మేమిప్పుడు చేయలేని ఈ మహాకార్యం నీవు చేసినందుకు నేను సంతోషపడుతున్నాను. ఏమైనా నీవు వాంఛిస్తే అనుగ్రహిస్తాను" అని

అనుజ్ఞ పొంది తమవారితో కూడి అంతర్హితుడైనాడు. దేవతలు తిరోహితులు కాగానే, వానరుల ఉచిత స్థానాల్లో నిల్పవలసిందిగా రాముడు ఆజ్ఞాపించాడు. ఆ సేనావాహిని చంద్ర కలితయామినివలె మేరమీరి మనోహరమై, ప్రభా వాఢ్యమై ప్రకాశించింది.

ఆ దినం అంతా ఆనందంతో గడిపారు. అందరకంటె విభీషణుడు ముందుగా లేచాడు. ఆహ్నికాలు నిర్వర్తించాడు. రాముడు మేల్కొనే వేళకు సన్నిధికి వచ్చి నిలుచున్నాడు. వచ్చిన మిత్రుణ్ని కుశల ప్రశ్నలు చేసిన రాముణ్ని ఉద్దేశించి, "దేవా! లోక కళ్యాణభావా! పరిమళజలాలు సిద్ధంగా వున్నై. మేలి అంగరాగాలు, స్థానాలు, బంగారు పట్టు వస్త్రాలు, మలయ జాలు, సొమ్ములు, దైవత వృక్ష పుష్పమాలా చయాలు కూర్చబడినై. లేచి కాల్యాలు నిర్వర్తించి, మంగళ స్నాతుడవై, భూషణ భూషితుడవై నా ఆతిథ్యం స్వీకరించు. వివిధా లంకార విలాసవతులైన ఈ పద్మగంధులు అన్ని విధులూ నిర్వహించుతారు. నాపై అనుగ్రహం చూపి అంగీకరించు" మంటూ ప్రార్థించాడు. ప్రత్యుత్తరంగా దాశరథి "పూజ్యమిత్రుడా! నీవు నాకై కల్పించిన ఈ సదవకాశం సుగ్రీవాది వానర శ్రేష్ఠులకు చేకూర్చు. పరమ సుకుమారుడు, భక్తుడైన భరతుడు నా నిమిత్తం ఎంతో శ్రమ అనుభ విస్తున్నాడు. తమ్ముడు ఆ స్థితిలో వుండగా అన్ననైన నేను సుఖాన్ని అపేక్షించేదా? అందుకు మనస్సు అంగీకరిస్తుందా? నా తమ్ముని గని ఆశ్వ సించకుండా, అభ్యంజనాలు, అంగరాగాలు, పీతాంబరాలు, హేమభూషలు నాకెందుకు? అతని ఆలింగనం చేసుకున్న అనంతరంకాని ఏవీ గ్రహించను. మా నగరం చేరే మార్గం బహుకంటక భూయిష్ఠం. మిక్కిలి కష్టం. ఇపుడే ప్రయాణ భేరీ మ్రోగించమని మనవారితో చెప్పు. నేను నిత్యవిధి ముగిస్తాను" అని పలికాడు. "ప్రభూ! నీ వంత త్వరపడనక్కరలేదు. నీవు నీ తమ్ముణ్ని అర్ధ దినంలో కలుసుకుంటావు. నా వద్ద కామగమైన పుష్పక విమానం వుంది. నా అన్న రావణుడు తన అన్న కుబేరుణ్ని జయించి దాన్ని పొందాడు. నీవు అడుగకముందే ఆ ఏర్పాటన్నీ చేశాను. నీ దాసునిపై లవమైన కరుణ నీకుంటే, నా గుణాలు నీకు గుర్తుంటే, చివరకు స్నేహభావ మైనా మిగిలితే, రామచంద్రా! నీవు మా తల్లి సీతతో, నా పూజ్య మిత్రుడు

సౌమిత్రితో కొలదికాలం ఇక్కడ నిలువు. మిమ్మల్ని మనసార పూజించి తరించాలని కోరుకుంటున్నాను. మన వానరభల్లూక మిత్రుల సన్మానింప తలచాను. ఇది నా ప్రార్థనకాని ఆజ్ఞకాదు" అని వినయంగా విభీషణుడు వేడుకున్నాడు. ఆ మాటలను రాముడు వనేచర నిశాచరులు వినేలాగా "రక్షఃపతీ! నేను కృతఘ్నుణ్ని కానని నీకు తెలుసు. నా హృదయం ఎట్టిదో తెలిసినవారిలో ముఖ్యస్థానం నీది. నచ్చికతో, మచ్చికతో, మెచ్చినసాచివ్యంతో అచ్చపుచేతలతో, సుహృద్భావంతో నేను మెచ్చగా కార్యాలు పూర్తిగావించావు. నేను నీ ఋణం ఈ జన్మలో తీర్చలేను. నేను నా తమ్మునికిచ్చిన వాగ్దానం నన్ను త్వరపెడుతూంది. నేను ఎంతత్వరపడిపోయినా సకాలంలో కలుసుకోలేనంతగా కాలం సమీపించింది. నన్ను నిర్బంధం చేయవద్దు. నేను అన్న కాలానికి చేరలేకపోతే నా తమ్ముడు జీవించడు. పడిన ప్రయాసఅంతా వ్యర్థమవుతుంది. నీ కోరిక మన్నించని నిష్ఠురచిత్తుడనని భావించకు. నాక్షేమలాభాలు నీకంటే కోరేవారెవరున్నారు? పోనా? కాలంపుండులేదా? నాతమ్ముడు చిత్రకూటంలో పాదాలపై చేతులుపెట్టి కన్నీళ్లతో కడుగుతున్న దృశ్యం కన్నుల్లో మెదలి గుండెను కదలించివేస్తూంది. నన్ను అయోధ్యకు కొనిపోవటానికి చేసిన యత్నం, అన్న మాటలు ఒక్కసారి ఉక్కిరిబిక్కిరి చేస్తున్నై. నేను దాన్ని నిరాకరించాను.

అంతేకాక, నా తల్లినీ, పినతల్లులనూ చూడాలని స్వాంతం త్రొక్కిసలాడుతూంది. పౌరులనూ, మిత్రులనూ, వారిబిడ్డలనూ, శాంతమూర్తులైన గురువులనూ సేవించాలని వుంది. నీవు చింతమాని శీఘ్రంగా విమానం అయత్తంచేయించు. వనవాసకాలం ముగిసింది. క్షణం యుగంగావుంది. నన్ను క్షమించు. నాపై కినియవద్దు. నీకోరిక శతగుణితంగా ముందు తీరుస్తాను. సంకల్పించిన సపర్యలన్నీ హృదయంతో గ్రహిస్తున్నాను. నాకోరిక వెంటనే నెరవేర్చు"మని నయమూ, ప్రియమూ అయిన మాటలతో సమ్మతింపచేశాడు. మాంసాశనపతి మారుమాట చెప్పలేక ఆజ్ఞగొని లంకకేగి క్షణంలో తిరిగి వచ్చాడు. రక్షఃపతి తిరిగిరాగానే రాముడు ఎదుట దూరంగా నిలిచిన అద్భుత విధాన నిధానమైన విమానాన్ని చూశాడు. వైడూర్య మణిమయవేదికాంచితమయి, కాంచన, చిత్రాంగకలితమయి, రాజత్ప్రభచే రమ్యంబయి,

# ఎమెస్కో వచన రామాయణం

## శతావధాని కోట వీరాంజనేయశర్మ



Volume Eleven

Price Rs. 5/-

cover printed at nandini art printers hyderabad-29